యుగమునకు చెందినవగుటచే నిచట కొంత యప్రస్తుతముగ గన్పడుచున్నవి. ఇకమీాద నేను మరికొన్ని లేఖలు వ్రాయుట తటస్థించునను నాశ కనుపడక పోవుటచే వాని నింగు చేర్చితిని.

ఈలేఖ లాంగ్లభాషయం దుండుటచేత వీని వినియోగము తక్కువగునని నేను గ్రహింపకపోలేదు. ఈ దోషము నాదే. వీనిని దేశభాషలలోనికి అనువాదము చేయించుటయే ఆదోష నివారణమునకు సాధనము.

అలహాబాదు,
నవంబరు 1929,

జవహార్లాల్ నెహ్రూ.

# విషయసూచిక



# జవహర్ లాల్ ఇందిరకు లేఖలు

## 1

### ప్రకృతియను గ్రంథము

మన యిద్దర మొకచోట నున్నపుడు చాలవిషయములను గూర్చి నీవు నన్ననేకములు ప్రశ్నలడుగుచుండెడిదానవు. వానికి సమాధానము చెప్పుటకు నేను యత్నించుచుండెడివాడను. ఇపుడు నీవు మసూరిలోనున్నావు; నేనలహాబాదులోనున్నాను. అందుచే మనమిట్టి ప్రసంగము జేయలేము. కనుక మనము నివసించు భూమికిని, యందలి భాగములగు వివిధ దేశములకును సంబంధించిన యంశముల నప్పుడప్పుడు వివరించి నీకు వ్రాయదలచుచున్నాను. ఇంగ్లండు దేశపు చరిత్రను, హిందూదేశపు చరిత్రను నీవు కొంత చదివియున్నావు. కాని ఇంగ్లండు చిన్న ద్వీపము; హిందూదేశము విస్తీర్ణముగలదే యయినను జగము యొక్క సమస్తము వైశాల్యమునుబట్టి చూచిన నిది చిన్నభాగమై యున్నది. జగత్కథనుగూర్చి కొంతయయినను దెలిసికొన దలచినచో మనము జన్మించిన యీ చిన్నదేశమునగాక సమస్త దేశములనుగూర్చియు, నచట నివసించుచున్న ప్రజలందరను గూర్చియు, నాలోచింపవలయును.

నేను వ్రాయుచున్న లేఖలలో, చాల కొద్దిసంగతులనే చెప్పగలనని యూహించుచున్నాను. కాని

యా కొద్దియే నీకుత్సుకతగల్గించి విశ్వమంతయు నేకవస్తు వనియు నందుండు వివిధజాతుల ప్రజలందరు మనసోదరులని యు భావములు నీకుఁ గలిగింపగలవని నేనాశించుచున్నాను. నీవు పెద్దదానవైన పిదప జగత్తుయొక్క కథను గూర్చియు నందలి కథలనుగూర్చియు పెద్దగ్రంథములలోఁ జదువగలవు. నీవు చదువు నితరగ్రంథములకంటెను, నవలలకంటెంగూడ నవినీ కెక్కువ కుతూహలము గల్గించును.

మనము నివసించుభూమి కోటానుకోట్ల సంవత్సరముల నుండియున్నదని నీవెరుగుదువు. భూమి సృష్టినారువాత చాల కాలమువరకు దానియందు మనుజులు నివసించియుండలేదు. మానవులకు ముందు భూమిపై జంతువులు నివసించుచుండెను. జంతువులకుముం దెట్టిజీవములును భూమిపై లేకుండెను. ప్రస్తుతము పలువిధములైన జంతువులతోడను మనుష్యుల తోడను నిండియున్న యీ భూభాగ మొకప్పుడు జనశూన్య మయి యుండెనని యూహించుటకూడ కష్టసాధ్యమే. ఇట్టి విషయమునుగూర్చి బాగుగానాలోచించి చర్చించిన శాస్త్ర జ్ఞులు కొంతకాలముక్రిందట నీభూమి జను లెవరును నివసింప లేనంత వేడిగ నుండెనని చెప్పుచున్నారు వారువ్రాసిన గ్రంథములను జదివి, శిలలను, జీవశేషములను పరీక్షించి నచో నిదినిజమేయని మనకు తోచును.

నీవు దేశచరిత్రలను గ్రంథములలో జదువుచున్నావు. కాని ప్రజలు నివసించియుండిన ప్రాచీన కాలమునను గ్రంథములు వ్రాయబడలేదనుట నిక్కువము. ఆ ప్రాచీన కాలమున నేమి జరిగెనో మన మెట్లు తెలిసికొనగలము? మన మూరక కూర్చుండి యూహించి చెప్పలేము. అట్లూహించుట కుతూహలముగనే యుండును. ఏలయన మన యిష్టానుసారమూహించి యందమగు కథలను సృష్టింపగలము. కాని యవి వాస్తవవిషయములుగ నుండవు. ఎందుచేతనగా నవి యదార్థవిషయములపై నాధారపడినవిగావు. ప్రాచీనకాలమున గ్రంథములు వ్రాయబడక పోయినను, గ్రంథములవలె మనకనేక విషయములు బోధించు వస్తువులు కొన్ని మన భాగ్యవశమున గలుగుచున్నవి. శిలలు, పర్వతములు, సముద్రములు, నక్షత్రములు, నదులు, ఎడారులు, జీవశేషములు మొదలగునవి వానిలో గలవు. జగత్తు యొక్క ప్రాచీనచరిత్రను దెలిసికొనుటకు యివియును మరి యనేక వస్తువులును మన "గ్రంథములు" జగత్కథను క్రమముగ తెలిసికొనుట కితరులు వ్రాసిన పుస్తకములు చదువుటకంటె ప్రకృతి యను గ్రంథము ననుసరించుటయే యుత్తమమార్గము. జగత్కథను శిలలనుండియు, పర్వతముల నుండియు నేర్చుకొనుట యచిర కాలముననే నీవారంభించెదవని నేనాశించుచున్నాను. అది యెంత యాసక్తికరముగ నుండునో యూహింపుము. త్రోవలోగాని, కొండప్రక్కగాని, కనబడు ప్రతి చిన్నరాయి

ప్రకృతియను గ్రంథములో నొక పుటవంటిది. నీవు వాని నుండి గ్రహింపగల్గినచో నవి నీకు కొన్ని యంశములను తెలుపును. హిందీ, ఉర్దు, ఇంగ్లీషు మొదలగు భాషలు చదువుటకు మొట్టమొదట నక్షరములు నేర్వవలెను. అట్లే జగత్కథను శిలాగ్రంథములనుండి నేర్చుకొనుటకు ప్రకృతిలోని యక్షరములను నేర్చుకొనవలెను. బహుశః వీనిని జదువుట నీకు కొంత తెలిసి యుండవచ్చును. ఒక చిన్న నున్నని గులకఱాయి నీకగపడినచో నది నీకు కొన్నియంశములు బోధించునుగదా! ఎట్టియంచులుగాని మూలలుగాని లేక యది యంత గుండ్రముగను, నున్నగను ఎట్లు తయారయినది. ఒక పెద్దఱాతిని నీవు ముక్కలుగ జేసినచో నాముక్కలంచులు దేరి సూదిగానుండునుగదా! అది నున్నగ నుండనే యుండదు. కాని యీ గులకఱాయి నున్నగను, గుండ్రముగను, మెరయుచు నెట్లేర్పడినది? నీవు కండ్లతో బాగుగా చూచి చెవులతో బాగుగ వినినచో దానికథ నదియే నీకు చెప్పును. ఒకానొకప్పుడు అది అతి ప్రాచీనకాలమయియుండవచ్చును. అదియొక చిన్న ఱాతిముక్కయనియు పెద్దఱాతిముక్కనుండి పగులగొట్టబడిన ఱాతిముక్కలవలె యంచులను మూలలును గల్గియుండెనని యది చెప్పును. బహుశః అది యప్పుడొక కొండప్రక్క నుండియుండవచ్చును. అప్పుడది వర్షముకురియుటచేత నదిలోయలోనికి కొట్టుకొనివచ్చి యొక వాగునుచేరి క్రమముగ నదిలో ప్రవేశించెను. ఆనది

దానినొక పెద్దనదిలో చేర్చెను. ఈలోపున నాభాయినీటియందు గున దొర్లిదొర్లి యంచులన్నియు రాచుకొనిపోయి పై భాగ మంతయును నున్నగను, మెరయుచును, తేలినది, ఇట్టిది నీ కగపడు గులకఱాయి యయినది. అది యెట్లో యెద్దున నిలువయుండిపోయి నీకగుపడినది. అది యింకను నదిలో కొట్టి కొని పోయిన యెడల నంతకంతకు చిన్నదై తుదకొక యిసుక రేణువుక్రింద మారి సముద్రతీరమునన్న యిసుక రేణువుల తో కలసి చిన్నపిల్లలు బొమ్మరికస్లు కట్టుకొని యాడుకొనుట కుపయోగించు యిసుకదిబ్బలో జేరియుండును.

ఒక గులకఱాయి నీకెంతకథ చెప్పగలిగినదో మన చుట్టు నగుపడు "శిలలు" "కొండలు" మొదలగువానినుండి యింకను యెన్నివిషయములను గ్రహింపగలమో?

## 2

### ప్రాచీనచరిత్ర యెట్లు వ్రాయబడినది?

నిన్న నేను వ్రాసిన లేఖలో జగత్తుయొక్క ప్రాచీన చరిత్రను ప్రకృతియను గ్రంథమునుండి మనము నేర్చుకొన వలసి యుండునని సూచించియుంటిని. నీవు నీచుట్టుప్రక్కలు జూచి శిలలు, పర్వతములు, లోయలు, నదులు, సముద్రము, అగ్నిపర్వతములు మొదలగు ననేకవస్తువులతో నిండిప్రకృతి యను గ్రంథ మేర్పడినది.

ఈ ప్రకృతి యను గ్రంథము మనయెదుట నెల్లపుడును తెరువబడియే యున్నది. కాని మనలో చాల తక్కువమందియే దానివిషయమున శ్రద్ధవహించి దానిని చదువ యత్నించుచున్నారు. మనము దానిని చదువుటకును గ్రహించుటకును నేర్చుకొన్నచో నది మనకెన్ని యుత్సాహజనకమగు కథలను చెప్పగలదు? దాని ఱాతిపుటలలో మనము చదువుకథలు దేవతల కథలకంటె నెక్కువ యుత్సుకత గల్గించును.

కనుక అతిప్రాచీనకాలమున భూమిపై జంతువులుగాని మనుజులుగాని నశింపక పూర్వమునుండియున్న స్థితిగతులను గూర్చి కొంత యీగ్రంథమునుండి నేర్చుకొందము. మనము చదివినకొలదియు. మొదట కొన్నిజంతువులను గూర్చియు, పిమ్మట నెక్కువజంతువులనుగూర్చియు తెలిసికొందము. తరువాత పురుషులును స్త్రీలును కనుబడరు, కాని వారుప్రస్తుతము మనము చూచు స్త్రీపురుషులకంటె చాలభేదమైనవారు. వారు కొంచెము హెచ్చుతక్కువగ జంతువులను పోలియుండెడివారు. క్రమముగ వారనుభవము సంపాదించి యాలోచించుట కారంభింతురు, ఆలోచనాశక్తి పొందగనే వారు జంతువులకు చాల భిన్నమైనవారగుదురు, వారి యాలోచనాశక్తి పొందగనే వారు జంతువులకు చాల భిన్నమైనవారగుదురు. వారి యాలోచనాశక్తి వారిని చాల పెద్దవియు క్రూరమును నగుజంతువులకంటె బలవంతమైన వారినిగ

చేయును మావటివాడు గొప్పజంతువగు ఏనుగు వీపుమీద గూర్చుండి దాని నతని యిష్టమువచ్చినట్లు చేయించుట నీ వెపుడు చూచుచున్నావు; ఏనుగు చాలపెద్దది; బలవంతమైనది. దానిమెడమీద కూర్చుండు మావటివానికంటె నదియెంతో బలిష్ఠమైనది. కాని మావటివాని కాలోచనాశక్తి గలదు. అందుచేతనే మావటివాడు యజమాని యగుచున్నాడు; ఏనుగతనికి లొంగుచున్నది. అట్టియాలోచన యెక్కువయిన కొలది మానవుడు బుద్ధిమంతుడును వివేకవంతుడును నగుచున్నాడు. నిప్పుచేయుట, భూమిని సేద్యముచేసి పంటలు పండించుట. బట్టలు నేయుట, ఇండ్లుకట్టుట మొదలగు ననేకమగు విషయముల నతడు కనిపెట్టియున్నాడు. చాలమంది స్త్రీపురుషులు కలసి యొకచోట నివసించుటచే నగరము లేర్పడినవి. నగరము లేర్పడకముందు మానవులు గుడారములందు నివసించుచు నొకచోటనుండి మరియొకచోటికి తిరుగుచుండిరి. భూమినుండి పంటలుపండించుట వారికప్పుడు తెలియదు. కనుక వారికి ధాన్యముగాని గోధుమలుగాని తెలియవు. అప్పుడు కూరగాయలు లేవు. ఇప్పుడు నీవుతినుట కుపయోగించు చాలవస్తువులపుడు లేవు. బహుశః మనుజులపు డడవిలోని కాయలను పండ్లనే తినుచుండిరి. ఎక్కువగా వారు జంతువులనుచంపి యాహారముగా నుపయోగించుచుండిరి. నగరములు వృద్ధియయినకొలదియు ప్రజలు వివిధకళలను నేర్చిరి. వ్రాతనుగూడ వారు నేర్చుకొని చాలకాలమువరకు

వ్రాయుటకు కాగితములు లేకపోవుటచే భూర్జపత్రములమీద గాని, తాటాకుమీదగాని వ్రాత జరుగుచుండెను. ప్రాచీన కాలమున వ్రాయబడిన తాటియాకు పుస్తకములు ఇపుడు కొన్ని గ్రంథాలయముల యందును, ఇండ్ల యందును కనుపడుచుండును. కాగితము వచ్చినపిదప వ్రాతసులభమయ్యెను కాని యచ్చుయంత్రములు లేకపోవుటచే ఇప్పటివలె వేల కొలది ప్రతులచ్చువేయుటకు వీలులేకపోయెను. చాలశ్రమపడి పుస్తకముల ప్రతులు వ్రాయవలసివచ్చెడివి. కనుకనే యపుడు పుస్తకములు చాల లేకుండెను. పుస్తకవిక్రయశాలకుపోయి కొనుటకు వీలయ్యెడిదిగాదు. ఒకరిచేత పుస్తకపు ప్రతి వ్రాయించవలసి యుండెను. ఇట్లుచేయుటకు చాలకాలము పట్టుచుండెను. కాని యప్పటివారు చాలయందముగ వ్రాయుచుండిరి. సుందరమగు నక్షరములతో వ్రాయబడిన గ్రంథము లిప్పటికిని కొన్నిగ్రంథాలయములలోనున్నవి. మన దేశమున నిట్టివి సంస్కృత, పర్షియను, ఉర్దుభాషలలోగలవు ఇట్టిపుస్తకములు వ్రాయువాడు పుటలప్రక్క మనోహరమగు పుష్పములను, లతలను చెక్కుటకూడ గలదు.

నగరము లభివృద్ధియయినకొలది దేశములును,జాతులును ఏర్పడెను. ఒక దేశమున నిరుగుపొరుగుల నివసించుచుండిన ప్రజలకు సహజముగ పరిచయమెక్కువ గల్గుచుండెను. ఇతర దేశములలో నివసించుప్రజలకంటె తాము గొప్పవారమని తలచి తెలివితక్కువగ నితరులతో పోరాడ మొదలిడిరి.

పోరాడుటయు హత్యచేయుటయు చాలబుద్ధిహీనమగు పనులని వారు గ్రహింపలేరు. ఈవిషయమును ప్రజలిప్పటికిని గ్రహింపలేకున్నారు. ఇట్టిపను లెవరికిని లాభదాయకములుగావు. ప్రాచీన కాలపు నగరములయొక్కయు, దేశములయొక్కయు చరిత్ర తెలిసికొనుటకు మనకు కొన్ని గ్రంథములు దొరుకుచున్నవి. కాని యిట్టి గ్రంథము లనేకములు లేవు. మరికొన్ని వస్తువులు మనకువిషయములు తెల్పుచున్నవి పూర్వకాలపు రాజులును, చక్రవర్తులును, తమతమ కాలములయందుజరిగిన యంశములను శిలాశాసనములమీదను, రాతి స్తంభముల మీదను వ్రాయించుచుండిరి. కాగితము ప్రాతపడుట చేతను పురుగులు కొట్టివేయుట చేతను పుస్తకములు చాలకాలము నిలువనేరవు. కాని రాళ్ళెంత కాలమయినను చెక్కుచెదరవు అలహాబాదుకోటలోని అశోకుని శిలాశాసనముచూచిన సంగతి బహుశా నీకు జ్ఞాపకముండును. అనేక శతాబ్దములక్రింద మనదేశమును పాలించిన ఘనుడగు అశోక చక్రవర్తి జేసిన ప్రకటన ఇచట రాతిపై చెక్కబడినది. లక్నోలోని మ్యూజియమునకు (ప్రాచీనవస్తుప్రదర్శనశాలకు) నీవుపోయిన అనేకమగు శిలాశాసనములను చూడగలవు.

యూరోపునందలి దేశములలోని ప్రజలు అనాగరికులై యడవిమనుష్యులుగ నున్నపుడు చీనా, ఈజిప్టు దేశములలో జరిగిన ఘన కార్యములనుగూర్చి చరిత్రవలన మనకు తెలియును. రామాయణ మహాభారతములవంటి గొప్పగ్రంథములు వచిం

పబడిన కాలమునందలి హిందూదేశపు వైభవమును అప్పుడు మన దేశ మెట్లయిశ్వర్యముతో దులతూగుచుండినదియు, నెట్టిపరాక్రమవంతు లిచటనుండినదియుగూడ మనకు దెలియును. ప్రస్తుతము మనదేశము దరిద్రావస్థలోనున్నది. విదేశీయులచే పాలింపబడుచున్నది. మన దేశములోగూడ నిచ్ఛవచ్చిన ట్లుండుటకు మనకు స్వేచ్ఛలేదు. కాని యిట్టి యవస్థ పూర్వకాలమున లేదు. తగిన శ్రమపడినచో మన దేశమునకు తిరిగి మనము స్వాతంత్ర్యము చేకూర్పవచ్చును. అపుడు బీదలస్థితి బాగుపడి యూరపు నందలి దేశములవలెనే మనదేశముగూడ సౌఖ్యదాయకముగ నుండును. రాబోవు లేఖలో మనోరంజకమగు జగత్కథ నారంభించెదను.

## 3

### భూమి యేర్పడినవిధము

భూమి సూర్యునిచుట్టు తిరుగుననియు చంద్రుడుభూమి చుట్టు తిరుగుననియు నీకు తెలియును. భూమివలె సూర్యుని చుట్టు తిరుగు గోళములు చాలగలవనియుకూడ బహుశః నీకు తెలియును. వీటన్నింటికిని మనభూమికినిగూడ గ్రహములని పేరు. ఇతరగ్రహముల కుపగ్రహములుగలవు. సూర్యుడును గ్రహమును, ఉపగ్రహములును, కలసి యొకకుటుంబముగ నేర్పడుచున్నది. దీనికి సూర్యకుటుంబమని పేరు. గ్రహము లన్నింటికిని సూర్యుడు తండ్రివంటివాడు.

రాత్రులందాకసమున ననేకములగు నక్షత్రములగ పడును. వీనిలో కొన్ని గ్రహములు వాస్తవముగ నక్షత్రములుగావు. గ్రహమేదియో నక్షత్రమేదియో నీవు గుర్తింపగలవా? యదార్థముగజూచిన గ్రహములు నక్షత్రములకంటె చాల చిన్నవి. కాని యవి మనకు సమీపముననుండుటచే పెద్దవిగ కనబడుచున్నవి. చంద్రుడు చాల చిన్నగ్రహమైనను దగ్గరనుండుటచే పెద్దగ గనపడుచున్నాడు. గ్రహములను, నక్షత్రములను, గుర్తించుట కొకమార్గము గలదు. నక్షత్రములు మినుకుమినుకుమనును. గ్రహములు మినుకుమినుకుమనవు. ఏలనుచేసినగా గ్రహములకు సూర్యునినుండితప్ప కాంతిగలుగును. గ్రహములమీదను చంద్రునిమీదనుపడు సూర్యుని కాంతియే మనకగుపడుచున్నది. నక్షత్రములు సూర్యునిపోలినవే. నక్షత్రములు చాలవేడిని, తేజస్సును కల్గియుండుటచే తమంతటయవి ప్రకాశించుచున్నవి. నిజముగా మండెడు సూర్యుడును ఒక నక్షత్రమే. సూర్యుడు మనకు దగ్గరనుండుటచే పెద్దయగ్ని గోళమువలె గనబడుచున్నాడు.

మనభూమి సూర్యకుటుంబమునకు చెందియున్నది. భూమి చాల బ్రహ్మాండమైనదని మనమనుకొనుచున్నాము. మనయూహకాని ముందో పోల్చిచూచినచో భూమిచాల గొప్పది. వేగముగాపోవు రైలుబండిలోగాని, స్టీమరులోగాని ప్రయాణము చేసినచో భూమియొక్క యొకకొననుండి మరియొక కొనకు చేరు

టకు కొన్ని వారములును, కొన్ని నెలలును పట్టును. భూమి మనకంత పెద్దదిగ కనబడుచున్నను అది గాలిలో ద్రేలాడు ధూళిరేణువును పోలియున్నది. సూర్యుడు భూమినుండి కోట్ల కొలది మైళ్ళదూరములోనున్నాడు. మిగిలిన నక్షత్రములింకను ఎక్కువ దూరములోనున్నవి. నక్షత్రములనుగూర్చి తెలిసికొనియున్న ఖగోళశాస్త్రజ్ఞులు చాల ప్రాచీనకాలమున భూమియు నితర గ్రహములును సూర్యునియందు భాగములుగా నుండెనని చెప్పుదురు. ఇప్పటివలె నపుడుగూడ సూర్యుడు విపరీతముగ నుండెడి పదార్థమేమైయుండెను. ఎట్లో సూర్యుని నుండి కొన్ని భాగములు విడిపోయి గాలిలో కెగిరిపోయెను. కాని యాభాగములు తమజనకుడగు సూర్యునినుండి పూర్తిగ విడిపోవలేక పోయెను. కనుక త్రాటితో కట్టబడినట్లివి సూర్యుని చుట్టును తిరుగనారంభించెను. త్రాటితో సరిపోల్చబడిన యావింతశక్తియే చిన్నపదార్థములకు పెద్దవానివైపు ఆకర్షణను గలుగ జేయును. వస్తువులు బరువుచే క్రిందబడునట్లా శక్తియే చేయుచున్నది. మనకు సమీపముననున్న పెద్ద వస్తువులలోనెల్ల భూమియే మిగుల పెద్దదియగుటచే మనచేత నున్న వస్తువులను భూమి యాకర్షించును.

పైన చెప్పినరీతిని భూమి సూర్యునినుండి బయటకు చొచ్చుకొని వచ్చినది. మొదటనది చాల యుష్ణముగనుండి భయంకరమగు వేడిగాలి దానిచుట్టు నావరించియుండెను. కాని సూర్యునికంటె చాలచిన్నదగుటచే చల్లారనారంభిం

చల్లబడినపుడు గాలిలోని నీటియావిరి గడ్డకట్టి వర్షముగా మారియుండును. అపుడు కుంభవృష్టి కురియుటచే భూమిమీద ఖాళీలన్నియునిండి సముద్రములును, మహాసముద్రములు నేర్పడినవి.

భూమియును, మహాసముద్రములును చల్లబడినకొలదియు జీవములు సముద్రములందును భూమిమీదను నివసించుటకు వీలయ్యెను.

తరువాతలేఖలో జీవముల యారంభమునుగూర్చి తెలిసికొందము.

## 4

## భూమిపై తొలిజీవములు

చాలకాలమువరకు భూమి యత్యుష్ణముగానుండుటచే జీవములేవియును దానిమీద నుండలేకపోయెనని క్రిందటి లేఖలో చదివియున్నాము. భూమిమీద ప్రాణులజీవిత మెప్పుడారంభమయ్యెను? మొదటిజీవములేవి? ఇది చాల కౌతుకజనకమగు ప్రశ్నయేకాని దానికి సమాధానము చెప్పుటమాత్రము చాలకష్టము. జీవితమన నేమియో ముందాలోచింతము. మనుజులును జంతువులునుమాత్రమే జీవములని నీవందువు కాబోలు. చెట్లు, తుప్పలు, కూరగాయలు మొదలగువానిమాట యేమి? నిశ్చయముగ నివియు జీవములుగలవియే.

అవికూడ నెలద్రాగి గాలిపీల్చి, పెరిగి మరణించును. చెట్టు నకును జాగ్రత్తగానున్న మొక్కల కేమనగా చెట్టుకదలలేదు లాడనుంగానో 'కార్టూన్ ఫిల్మ్‌లో' నీవు చూచిన కొన్ని మొక్కలు నీకు జ్ఞాపకమున్నవనుకొందును. 'ఆర్చిడులు; పిచరులు; అన బడు యీ మొక్కలు ఈగలను తినును. సముద్రపు టడుగున నివసించుచున్న కదలలేని స్పాంజి యను పేరుగల జంతువులు కొన్నిగలవు. ఒక్కొక్కప్పుడది మొక్కయో జంతువో నిర్ధారణచేయ వీలుగాని ప్రాణులు కూడ కొన్ని గలవు. వృక్ష శాస్త్రమును, జంతుశాస్త్రమును నీవు చదువునపుడు పూర్తిగ మొక్కలుగాని ఈవింత ప్రాణులనుగూర్చి నీవుచదువగలవు.

రాళ్ళకుగూడ కొంతవరకు ప్రాణముకలదనియు, అవి కూడ పెరిగి నశించుననియు కొందరు చెప్పుదురు. కాని దీనిని ప్రత్యక్షముగ నిరూపించుట చాలకష్టము జనీవాలో మన లను నిరూపించుటకు వచ్చిన యొకరు నీకు జ్ఞాపక ముండవచ్చును ఆయన పేరు "సర్ జగదీశచంద్రబోస్" మొక్కలకు ప్రాణ ము కలదని ఆయన ప్రయోగములద్వారా ఋజువుపరచెను. రాళ్ళకుగూడ ప్రాణముకలదని ఆయన యభిప్రాయము.

దేనికి ప్రాణముగలదో, దేనికి లేదో నిర్ధారణచేయుట చాలకష్టమని యిప్పుడు గ్రహించియుంటివి. కాని ప్రస్తుతము రాళ్ళను వదలి మొక్కలనుగూర్చియు జంతువులను గూ ర్చియు మాట్లాడుదము. ప్రస్తుతము లెక్కలేనన్ని జంతువుల ను మనము చూచుచున్నాము. అవి యనేకవిధములనున్నవి.

వీనిలో స్త్రీజాతియు పురుషజాతియుగలవు. వీనిలో కొన్ని తెలివిగలవియు కొన్ని తెలివితక్కువైనవియు యున్నవి జంతువులలోగూడ ఏనుగు కోతి, చీమ మొదలైనవి కొన్ని తెలివైనవి మరికొన్ని తెలివితక్కువైనవి చేపలును, నీటిలో నివసించు మరికొన్ని జంతువులును, చాల అధమజాతికి చెందినవి. అన్నిటికంటెను అట్టడుగున స్పాంజి, జిగట చేపమున్నగునవి సగము మొక్కగను సగము జంతువుగనుండు జీవములుగలవి.

వివిధజంతువులన్నియు భూమిపైనొకేసారి పుట్టినవా? లేక క్రమముగా నొకజాతితరువాత నొకటి పుట్టెనా? ప్రాచీన కాలపుగ్రంథములలో నీక్రమము తెలుపబడలేదు. ప్రకృతిగ్రంథము మనకేమైన తోడ్పడునా? నిశ్చయముగ తోడ్పడును. ప్రాచీనశిలలలో జంతువులయెముకలు కనపడుచున్నవి వీనికి శిలాజీవ శేషములని పేరు. అవి మనకు కనుపడినపుడు, ఆశిలలేర్పడినపుడే అచ్చట ఆయెముకలుగల జంతువులు జీవించియుండెనని మనము చెప్పవచ్చును. లండనులోని సౌతుకెన్సింగుటను మ్యూజియములో నిట్టి శిలాజీవశేషముల నెన్నియో పెద్దవియు, చిన్నవియు చూచియున్నావు.

ఏజంతువైనను చనిపోయినతరువాత దానిశరీరములోల మాంసముతో గూడిన మృదువైనభాగము త్వరగా కుళ్ళిపోవును గాని, దానియెముకలు చాలకాలముండును. ఈ యెముకనే చాల పూర్వకాలమున నివసించియుండిన జంతు

పులనుగూర్చి కొంతవరకైనను మనకు తెలుపును. కాని జిగటచేపవంటివానికి ఎముకలు లేకపోవుటచే నది మరణించిన పిదప వాని శవమేమియు నుండదు.

శిలలను జాగ్రత్తగా పరిశీలించి అవశేషములగు నెముకలను సమకూర్చినచో వివిధజాతులగు జంతువులు వేర్వేరు కాలములందు పుట్టియుండెనని తెలిసికొందుము. అవి యన్నియు నొక్కసారి హఠాత్తుగా పుట్టలేదు. మొట్టమొదట శరీరముపై చిప్పలుగల సామాన్యజంతువులు — నత్తగుల్లల వంటివి — పుట్టెను. సముద్రతీరమున నీకు దొరకు నందమగు నాలుగుచిప్పలు వంటివి యీ జంతువుల పై పెంకులే. తరువాత పాములు, పెనుగోలకొలు పెద్దవగు జంతువులు, పక్షులు మొదలగు క్లిష్టమైన శరీరనిర్మాణముగల జంతువు లేర్పడెను. చిట్టచివరకు మనుష్యుల శిలలును అగపడుచున్నవి. కనుక జంతువులపుట్టుకలో నొకక్రమము నున్నట్లు కనబడుచున్నది. మొదట సరళమగు జీవములు, తరువాత క్లిష్టమగు నవయవనిర్మాణముగల యుచ్ఛజాతి జంతువులు; తుట్టతుద కత్యుత్తమశ్రేణికి చెందిన మానవుడు, స్పాంజియు, నత్తగుల్లయు నభివృద్ధినొంది, మానవునిగా, పరిణామ మొందినవో తెలిసికొనుట కుతూహలజనకమగు విషయము. ముందుముందు నేనావిషయమును గూర్చి వ్రాయుదును. కాని ప్రస్తుతము మనము మొట్టమొదటి జీవములనుగూర్చి తెలిసికొందము.

భూమి చల్లబడినపిదపనుండిన మొట్టమొదటి జీవములు మృదువైనపాకమువంటి వస్తువులై యుండెను. వీనికి పై పెంకుగాని యెముకలుగాని లేవు. కనుక మనము వీనిని గూర్చి తెలిసికొనుట కొంతవరకు ఊహపైననే ఆధారపడవలసియుండును. సముద్రములో నిప్పటికిని యిట్టిజిగటపదార్థము లనేకములు గలవు. అవి గుండ్రముగానుండును గాని యెముకలుగాని పై చిప్పగాని లేకపోవుటచే వానిరూప మెల్లపుడును మారుచుండును. అవి కొంచెమెక్కువతక్కువగ నిట్లుండును. వీనిమధ్య నీవు చుక్క కనబడుచున్నది. అదియే బీజము. అది దాని హృదయమనికూడా చెప్పవచ్చును. ఈ జంతువులు (లేక వీనికి మరేపేరు పెట్టినసుసరే) వాటంతటవియే రెండుభాగములుగ విడిపోవు వింతస్వభావముగలవి. ఒకానొకచోట సన్నముగా నగుటకారంభించి, చివరకు రెండుజిగురువంటి పదార్థములుగ విడిపోవును. కాని రెండు భాగములును మొదటిదానిని పోలియుండును. ఈ భాగము లీవిధముగ నుండును.

బీజముకూడ రెండుభాగములై తుద కనేకవిభాగము లేర్పడునని కనుపడుచున్నవి. ఈవిధముగ నీజంతువులు విభాగముపొంది వృద్ధియగుచుండును. మనము నివసించుభూమిపై మొదటిజీవ మిట్టిదై యుండవలెను. ఇదియెంత సరళమును నల్పమునగు జీవప్రతినిధియోగదా! ఆకాలమున భూమిపై నెచటను నింతకంటె నుత్కృష్టమైనజీవమేదియు లేకుండెను.

నిజమగు జంతువు లప్పటికి పుట్టలేదు. మానవుడు కోట్లతర బడి సంవత్సరములతర్వాతగాని జన్మింపలేదు.

ఈపాకమువంటి పదార్థములతర్వాత సముద్రపురెల్లు; నత్తగుల్లలు; పీతలు, పురుగులు మొదలగునవి పుట్టెను. తరువాత చేపలు పుట్టెను.

చేపల కెముకలవంటి కఠినపదార్థమును పెంకును నుండుటచే చాలకాలముతర్వాతగూడ వానినిగూర్చి మనకు తెలిసికొనుట కాధారములు దొరికినవి. సముద్రతీరమున మట్టిలోనవి కప్పివేయబడినవి. అంతకంటె కెక్కువమట్టితోను, యిసుకతోను, కప్పబడుటచే నవి జాగ్రత్తగా నుంచబడినవి. పైనున్న మట్టియొక్కయు, నిసుకయొక్కయు నొత్తిడిచే నడుగుననున్న మట్టి తుదకు కఠినమయిన శిలారూపము దాల్చినది. ఇట్లు సముద్రపుటడుగున శిలలు ఏర్పడినవి. భూకంపమువలనగాని, యితరమగు మార్పులవలనగాని యడుగుననున్నశిలలు బయటపడి ఆరిననేలగా మారినది. ఆయెండినరాయి నదులచేతను, వర్షములచేతను కొట్టుకొని పోయి యుగములకొలది కాలముగడచినపిదప తుదకు ఆమరుగుపడిన చిప్పలు బయటపడినవి. ఈజీవశేషములును పెంకులును మనకిట్లగపడి మానవునకుముందు భూమియెట్లుండెనో తెలిసికొనుటకు తోడ్పడుచున్నవి. ఈ సూక్ష్మజంతువులు వృద్ధిజెంది ప్రస్తుతము జంతువు లెట్లేర్పడినవో తరువాత లేఖలో పరిశీలింతము.

# 5

## జంతువుల పుట్టుక

భూమిమీద మొదటి జీవములు చిన్న సముద్రపు జంతువులును, నీటి మొక్కలు నయియుండునని మనము గ్రహించితిమి. అవినీటిలోనే నివసింపగలవు బయటకువచ్చి నచో సముద్రపుటొడ్డున పడియుండు జిగటచేపలవలెనే యెండిపోయి చచ్చిపోవును. ఆరోజులలో నిప్పటికంటె చాల ఎక్కువ సమృద్ధిగ నీరును, బురదనేలనుఉండియుండవచ్చును. కొంచెము దళసరిచర్మముగల చేపలు ఆరిననేలపై ఎక్కువ కాల ముండగలవు. ఏలయనగా నవి యంతత్వరగా ఎండి పోవు, అందుచే క్రమముగా మృదుచర్మముగల చేపలు మొదలగు జంతువులు నశించి దళసరి చర్మముగల జంతువులు వృద్ధిచెందినవి. ఇవి చాల చిత్రమగు విషయము. జంతువులు క్రమముగ పరిసరముల ననుసరించి సరిపెట్టుకొను నని దీనివలన తెలియుచున్నది. లండనులోని సౌతు కెన్సింగ్ టన్ మ్యూజియములోని పక్షులును, జంతువులును మంచు నలె తెల్లగానుండుట నీవు చూచి యున్నావు. మంచుతో గూడిన ప్రదేశములలో జంతువులిట్లే యుండును. పచ్చని చెట్లతోను ఆకులతోను గూడిన యుష్ణప్రదేశములలో నాకు పచ్చగగాని, మరియొక దట్టమగు రంగుగగాని యుండును. అనగానవి వానిపరిసరముల ననుసరించి మార్పుచెందును. వాని పరిసరములరంగుగూడ గల్గియున్నచో వానిశత్రువులు

వానినిగుర్తింపలేరు. అందుచే నాత్మరక్షణ కిది పనికివచ్చును. శీతలప్రదేశములలోని జంతువులను చలినుండి రక్షించుటకు వాని శరీరముపై దట్టమగు బొచ్చు పెరుగును. అట్లే పెద్దపులికి పచ్చనిచారలుండును. దట్టమగు నరణ్యములలో పులియగుపడనే యగుపడదు.

జంతువులు పరిసరముల కనుగుణముగ ప్రవర్తించు నను విషయము ముఖ్యమయినది. సృష్టియందలి యేర్పాటు ననుసరించి మార్పుబొంది, పరిసరముల కనుగుణముగ ప్రవర్తించు జంతువులు క్షేమముగ నుండుట కెక్కువ అవకాశముగలదు. అట్టివి ఎక్కువగ వృద్ధిపొందును. మిగిలినవి వృద్ధిజెందవు. ఈవిషయ మనేకమగు సృష్టివిచిత్రములకు కారణములనుమనకు వివరించుచున్నది. చిన్నజంతువులు క్రమముగ వృద్ధిజెంది పెద్దజంతువులగుటకును, కోట్లతరబడి సంవత్సరములలో మృగము మానవుడుగ పరిణామము జెందుటకును హేతువు నిది విశదీకరించుచున్నది. మనచుట్టును ఎల్లప్పుడు ననేకవిధములగుమార్పులు గలుగుచున్నను అవి చాల మెల్లగా జరుగుచుండుటచేతను, అవిజరుగుకాలముతో సరిపోల్చినపుడు మనజీవితప్రమాణము చాలతక్కువగుటచేతను, వానిని మనము గుర్తింపలేకున్నాము. ప్రకృతిమాత్రము మార్పుచెందుచునేయుండి అంతకంతకుపరిణతిబొందుచునేయుండును.

భూతలమంతకంతకు చల్లబడుచు ఆరుచున్న సంగతి నీకుజ్ఞప్తియున్నదిగదా! అట్లు చల్లబడినకొలది, శీతోష్ణస్థితి

మారుటచే ననేకమగు మార్పులు గలిగినవి. భూమిమారిన కొలది మెల్లగా జంతువులును మారి క్రొత్తరకపు జంతువులు జన్మింప నారంభించినవి. మొట్టమొదట అవయవక్లిష్టతలేని సముద్రపు జంతువులుండెను. తరువాత క్లిష్టమగు నవయవములుగల జంతువులేర్పడినవి. అంతకంతకు పొడినేల యెక్కువై నకొలది యిప్పటి మొసళ్ళు కప్పలువలె భూమిమీదను నీటిలోను నివసించు జంతువులు బయలుదేరినవి. వానితర్వాత కేవలము భూచరములును, ఆపిమ్మట గాలిలో నెగురుపక్షులును, పుట్టినవి. పైన కప్పవిషయము చెప్పియున్నాను. దీని జీవితము చాల చిత్రమైనది. దీనిజీవితముబట్టి జలచరములు క్రమముగా భూచరములుగ నెట్లు మారినవో మనము తెలిసికొనగలము. కప్ప మొదట చేపవలెనే యుండునుగాని పిదప భూచరమువలె శ్వాసకోశములతో గాలిని పీల్చుట కారంభించును.

భూతలముపై జీవములు నివసించుట కారంభమైన మొదటిదినములలో పెద్దఅరణ్యము లెక్కువగా నుండెను. అప్పుడు భూమియంతయు దట్టమగు నడవులతోనిండి బురదనేల యెక్కువగా నుండెను. ఈయడవులన్నియు క్రమముల కప్పివేయబడి మట్టి రాళ్ళు మొదలగు వానియొత్తిడిచే నేబొగ్గుగా మారినది. నేలబొగ్గు భూమియడుగున గనులలో దొరకునని నీకు తెలియును. బొగ్గుగనులన్నియు ప్రాచీనకాలమున అరణ్యములే.

మొదటి భూచరములలో పెద్దపాములు, బల్లులు, మొసళ్ళు మొదలగునవి యెక్కువగ నుండియుండును. దీని లో కొన్ని నూరడుగుల పొడవుగూడ నుండెను. నూరడుగుల పాముగాని బల్లిగాని యెట్లుండునో యూహింపుము! ఇట్టిజంతువుల జీవవిశేషములను లండనుమ్యూజియములో చూచిన సంగతి నీకు జ్ఞాపకమున్నదా?

ప్రస్తుతము మనకగుపడు జంతువులవంటివి తర్వాత పుట్టెను. ఇవి పిల్లలకు పాలు కుడుపునుకనుక "మమ్మాలులు లేక సస్తనులు" అని వీనికి పేరు. ఇవికూడ నిప్పటివానికంటె పూర్వము చాల పెద్దవిగనుండెను. సస్తనులలో మనుజుల నెక్కువగా పోలియున్నదికోతి. కనుకనే మానవుడు కోతి యొక్క సంతతికి జెందినవాడని తలచుచున్నారు. జంతువు లన్నియు తమపరిసరముల కనుగుణముగ వర్తించి పరిణామము బొందుచున్నట్లే మానవుడుగూడ మొదట వానరశ్రేష్ఠముగ నుండెనని దీనియర్థము. కాలము గడచినకొలది ప్రకృతి నను సరించి మానవు డభివృద్ధినొంద నారంభించెను. ఇప్పుడు జంతువులకును వనకును పోలికయే లేదని మానవుడు తలచు చున్నాడు కాని, మనకును వానరములకును దగ్గరబంధుత్వము గలదని మానవులమగు మనము జ్ఞప్తియం దుంచుకొనుట మంచిది. ఇప్పటికిని మనలో గొందరు కోతులవలెనే సంచ రించుచున్నారని నాయభిప్రాయము.

## 6

## భూమిపై మానవుని ప్రవేశము

భూమిపైనున్న జీవములు మొదట సరళమగు నాకారములుగలవై మెల్లమెల్లగ కోట్లకొలది ఏండ్లలో పరిణామము చెంది ప్రస్తుతపురూపము నొందినదో ల్చెనో క్రిందటి లేఖలో చదివియున్నాము జంతువులు తమపరిసరముల ననుసరించి వర్తించునను ముఖ్యసూత్రమునుగూడ మనము గమనించియుంటిమి. ఇట్లు పరిసరముల కనుగుణముగ వర్తించుటలో నవియనేకమగు క్రొత్తగుణముల నలవరచుకొని ఎక్కువ శ్రేష్ఠములును, క్లిష్టములునైనవి. ఈపూర్వను అభివృద్ధిని అనేకమార్గములలో మనము చూడగలము. దీనికుదాహరణ మేదన, మొదట ఎముకలులేని జంతువులు చాలకాలము బ్రతుకలేకపోవుటచే క్రమముగా ఎముక లేర్పడినవి. జంతువుల కేర్పడిన మొట్టమొదటి ఎముక వెన్నెముక. ఇట్లు ఎముకలతోగూడినవియు, ఎముకలులేనివియు నను రెండు విధముల జంతువు లేర్పడెను. మానవులును మనచుట్టునుండు జంతువులును వెన్నెముకలుగల ప్రాణులు.

గ్రుడ్లనుపెట్టి వానిని ఎదలివేయుచేపలవంటి చిన్న జంతువులు కొన్నిగలవు. అవి యొక్కొక్కసారి వేలకొలది గ్రుడ్లుపెట్టునుగాని వానిని కాపాడక వదలివేయును. తల్లి పిల్లలవిషయమున నెంతమాత్రమును జాగ్రత్తగైకొనదు.

గ్రుడ్లు నిట్లే వదలివేసి వానివైపునకు రావు. గ్రుడ్లవిషయము నెవరును చూడకపోవుటచే వానిలో చాలమట్టుకు చనిపోవును ఇదియంతయు కేవలము వ్యర్థముగదా! పెద్దజంతువులను పరిశీలించినకొలది వానిపిల్లలుచు, గ్రుడ్లును సంఖ్యయందు తక్కువయనియు నవి వానివిషయమున శ్రద్ధవహించుననియు తెలిసికొనగలము. కోడిపెట్టగూడ గ్రుడ్లుపెట్టునుగాని వాని మీద గూర్చుండి వానిని పొదిగి పిల్లలు బయటకువచ్చిన పిదప కొంతకాలము వరకు వాటికాహారమునిచ్చి మేపును. అవి పెద్దవైనపిదప తల్లి వాటివిషయమున శ్రద్ధవహింపదు.

స్తనుల (మమ్మాలులు) ను గూర్చి క్రిందటి యుత్తరములో గొంత చెప్పియుంటిని. పెద్దజంతువులగు ఈజాతికి జెందిన జంతువులలో నెక్కువమార్పు గనపడుచున్నది. ఈ రకపు జంతువులు గ్రుడ్లనుపెట్టవుగాని తల్లిగ్రుడ్లును (పిండమును) తనలోనే యిముడ్చుకొని యది బాగుగా పెరిగినపిదప శిశువును కనును. కుక్కలు, పిల్లులు, కుందేళ్ళు నిట్టివి. తర్వాత తల్లి శిశువునకు పాలుకుడుపును. తల్లి పిల్లవిషయమున అమిత శ్రద్ధ వహించును. వీనియందుగూడ వ్యర్థమగు పని కొంతగలదు. కుందేళ్ళు కొద్దినెలల కొకసారి యెన్నియో పిల్లలను పెట్టుచుండునుగాని వీనిలో చాలవఱకు చనిపోవు చుండును. ఏనుగువంటి యుత్తమశ్రేణికి జెందిన జంతు వొక్క పిల్లనేకని దానిని మిగులశ్రద్ధతో జూచును.

ఇట్లు జంతువులు పరిణామము చెందినకొలదిని గ్రుడ్లను పెట్టక తమ్ముబోలిన చిన్నపిల్లలను పెట్టుననియు, నుత్తమ జాతి జంతువు లొకసారి ఒకేశిశువును కనుననియు, నీవు గ్రహింపగలవు. ఉత్తమజాతిజంతువులు తమతమ శిశువులపై ప్రేమనుగూడ కనపరచునని నీవు గమనింపగలవు మానవు డత్యుత్తమజాతి జంతువు గనుక తల్లిదండ్రులు బిడ్డలపై నెక్కువ యనురాగము జూపి మిక్కిలి శ్రద్ధతో పెంచుదురు.

మానవు డీవిధముగ నల్పజాతిజంతువులనుండి యభి వృద్ధి నొందియుండును. బహుశః ఆదిమమానవు లిప్పటి వారిని పోలియుండకపోవచ్చును. వారుసగము కోతులవలెను, సగము జంతువులవలెనుండి "వానరములు" అను సార్థక నామముగల్గి యుండవచ్చును, జర్మనీలో హీడెల్‌బర్గునగర ములో నొక శాస్త్రాచార్యుని మనము చూచుటకు వెళ్ళిన మాట జ్ఞాపకముగలదా? అతడు జీవశేషములతో నిండియున్న యొక ప్రదర్శనశాలను మనకు చూపించెను. అతడొక ప్రాత పుర్రెను (కపాలమును) ఒక యినుపపెట్టెలోపెట్టి తాళము వేసి జాగ్రత్తగనుంచెను. ఇది ఆదిమానవులలో యొకని పుర్రెయని యూహించుచున్నారు. ఆపుర్రె హీడెల్బర్గునద్ద భూమిలోకప్పబడియుండి దొరకుటచే నాపుర్రెగల యాదిమ మానవునకు హీడెల్బర్గు మానవుడని పేరిడిరి. కాని యప్పటి రోజులలో, హీడెల్బర్గుగాని మరియేనగరముగాని యుండ లేదనుటమాత్రము నిజము. ఆదిమమానవులు సంచారము

చేయుచుండిన ప్రాచీనకాలములో చాల చలిగానుండెను. అపుడు మంచు విపరీతముగా నుండుటచే ఆకాలమునకు హిమయుగమని పేరు. ఇప్పుడుత్తరధృవమువద్దనున్న హిమానీనదములవంటివి ఇంగ్లండు, జర్మనీ దేశములవరకు ప్రవహించుచుండెను. అపుడచట ప్రజలకు నివసించుట చాలదుర్భరముగనుండి యుండవలెను. హిమానీనదములు లేనిచోట మాత్రమే వారు జీవింపగలిగి యుండిరి. అప్పటిరోజులలో నిపుడు మధ్యధరాసముద్రమని మనము చెప్పుప్రాంతమును సముద్రముగ నుండలేదనియు నొకటిరెండుసరస్సులుగ నుండెననియు శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అపుడు ఎఱ్ఱసముద్రము లేదు. అదియంతయు నేలయే. హిందూదేశములో చాలభాగ మొకద్వీపమై యుండెను. పంజాబులోను మనరాజధానిలో చాలభాగమునను (సంయుక్తరాష్ట్రములు, యునైటెడ్ ప్రోవిన్సెస్) సముద్ర ముండెను. దక్షిణహిందూదేశమును, మధ్యహిందూదేశమును కలసి యొకద్వీపముగనుండి హిమాలయపర్వతములనుండి ఒక సముద్రముచే విడదీయబడియుండెనని యూహింపుము. అప్పుడు నీవు మసూరికి పోవలయునన్న పొగయోడ (స్టీమరు) పై పోవలసియుండును.

మానవుడు భూమిపై మొదట నవతరించినపుడుఅతని కనేక భయంకరమృగములు చుట్టుముట్టి యుండియుండును. అందుచే నతడు భయమునందియుండును. కాని నేడు మానవుడు జగత్తున కధికారియై జంతువులను తన యిచ్ఛవచ్చినట్లు

త్రిప్పుకొనుచున్నాడు. కాని ఆపూర్వదినములలో నతను సృష్టికి యజమాని కాకపోవుట యట్లుండగా తానే క్రూర మృగములచే వెంటదరుమబడి తప్పించుకొనవలసివచ్చెను. క్రమముగ మానవు డున్నతస్థితినిబొంది యంతకంత కెక్కువ బలవంతుడగుచుతుదకన్ని జంతువులకంటెబలవంతుడయ్యెను.

అతడి ట్లెవిదముగ నయ్యెను! శరీర బలముచేగాదు.ఏల యన నేనుగు మనుజునికంటె చాల బలమయిన. తన తెలివి తేటలచేతను బుద్ధిసూక్ష్మతచేతను మానవుడింత బలవంతు డయ్యెను. ప్రాచీనకాలమునుండి నేటివరకు మానవునిబుద్ధి ఎట్లు వికాసము నొందెనో మనము గుర్తింపవచ్చును. ఇతర జంతువులనుండి మానవుని వేరుచేయునది యతని బుద్ధిసూక్ష్మతయె. వివేకములేని మానవునకును జంతువునకును ఎట్టిభేద మును లేదు. మనుష్యుడు కనిపెట్టిన మొదట గొప్పవిషయము నిప్పు. ఇపుడు మనము అగ్గిపుల్లతో నిప్పంటించుచున్నాము. కాని అగ్గిపుల్లలు కొలదికాలము క్రిందటనే కనిపెట్టబడినవి. పూర్వకాలమున రెండు చెకుముకిరాళ్ళకదానితో నొకటి రాపిడిచేయుటచే పుట్టిన నిప్పురవ్వతో నెండుగడ్డినిగాని, మరియేదైన యెండిన వస్తువునుగాని యంటించుటచే నిప్పు చేయుచుండిరి. ఒక్కొకపు డడవులలో చెకుముకిరాళ్ళకుగాని మరేవస్తువులకుగాని గల్గిన రాపిడిచే నగ్ని బయలుదేర చుండును. ఈవిషయమును బట్టి మరికొన్ని యితరసంగతులు గ్రహించుటకు తగినంత బుద్ధిసూక్ష్మత మిగిలిన జంతువులకు

లేకుండెను. కాని మానవునకు తెలివితేట లెక్కువగ నుండుటచే నతడు నిప్పుయొక్క యుపయోగము గ్రహింపగలైను. దానివలన నతనికి చలికాలమున వెచ్చదనముగల్గుచుండెను. అంతేగాక నతని ప్రబలశత్రువులగు నితరజంతువులు నిప్పు చూచి బెదరుచుండెను. కనుక నగ్నిబయలు దేరినపుడెల్ల నప్పటిస్త్రీపురుషులందరును దానిలో నెండుటాకులు బడవేసి మంట నెగద్రోయుచుండిరని తోచుచున్నది. మంట యారి పోవుట వారి కిష్టముండెడిదిగాదు. చెకుముకి రాళ్ళను రాపిడి చేయుటచే నిప్పు రవ్వలను పట్టించవచ్చునని క్రమక్రమముగా వారు గ్రహించియుందురు.

ఇది వారికొక నూతనావిష్కరణమువలె గన్పడెను. దీనిని వారు జంతువులపై నొకయస్త్రముగ ప్రయోగించు చుండిరి. జగత్తున కధికారియగుటకు మానవున కగ్నిప్రధమ సోపాన మయ్యెను.

## 7

### ఆదిమ మానవులు

మనుజునకు ఇతరజంతువులకును ముఖ్యభేదము మనుజునికిగల బుద్ధిసూక్ష్మతయేయని క్రిందటిలేఖలో గమనించి యుంటిమి.

ఈబుద్ధివిశేషమునలననే అతడుబలశాలియై తనకంటె చాల పెద్దవియగు నితరజంతువులచే నాశనము చేయబడ

కుండుట తటస్థించెను. మనుష్యుని బుద్ధివికసించుకొలదియతని శక్తికూడ వృద్ధికాజొచ్చెను. ఆరంభకాలమున శత్రువుల నెదుర్కొనుటకు దగిన యస్త్రములు మనుజునకు లేవు. అతడు రాళ్ళనుమాత్రము విసరుచుండెను. క్రమముగా నతడు రాళ్ళతో గొడ్డళ్ళు ఖడ్గములు మొదలగునవియును. సన్నని సూదులనుగూడ చేయనారంభించెను. సౌత్ కేన్సింగ్‌టన్ మ్యూజియమునందును జినీవామ్యూజియములోను మనమిట్టి యాయుధములెన్నో చూచియుంటిమి.

క్రిందటి లేఖలో నేనుదహరించియుండిన హిమయుగమంతమై మధ్యఐరోపాలోను, ఆసియాలోను, హిమానీనదములు దగ్గనారంభించెను. అంతకంతకు వెచ్చదనమెక్కువైన కొలది జనులు వ్యాపింపజొచ్చిరి.

ఆరోజులలో నిండ్లుగాని ఇతరవిధములగు కట్టడములుగాని లేవు. జనులు గుహాలలో నివసించుచుండిరి. వ్యవసాయమనునది లేదు. పండ్లు, కాయలు, జంతువులు నే మనుష్యుల యాహారముగ నుండెను. పొలములలో పంటలు లేకపోవుటచే నన్నము. రొట్టె మొదలగునవి లేవు. పంటలేదు గాని బహుశః వారు మంటలపై మాంసము వెచ్చచేయుచుండిరి. పాత్రలుగాని కుండలుగాని పెనములుగాని వారికి లేవు.

ఇచట విచిత్రమగు నొకసంగతిగలదు. ఈ యడవి మనుష్యులకు బొమ్మలుగీయుట తెలియును. వారికి కాగితము కలము, పెన్సిళ్ళు, కుంచెలు మొదలగునవి లేనిమాట నిజమే.

వారివద్ద రాతిసూదులు, మొనదేరినపనిముట్లు కొన్నియుండె ను. వీటితో వారు గుహాలగోడలపై జంతువులబొమ్మలు గీయుచుండిరి. ఆచిత్రంపులలో కొన్ని చాలబాగున్నవి కాని వానిలో చాలవరకు ఆకారచిత్రములే. చిత్రములువ్రాయుట చాలసులభమని నీకు తెలియును. తరచుగ చిన్నపిల్లలు వానిని గీచుచుందురు. ఆగుహాలు చీకటిగనుండెను. గనుక వారు సులభమగు దీపములు వాడుకొని యుండవచ్చును.

ఇపుడు మనము వర్ణించిన నరులకు పూర్వశిలాయుగపు నరులనిపేరు అప్పటిజనులు తమపనిముట్లన్నియు రాతితో జేసికొనెడివారు. కనుక నాకాలమునకు శిలాయుగము (రాతియుగము) అనుపేరేర్పడినది. లోహముల వాడుక వారికి తెలియదు. ఇప్పుడు మనముపయోగించు వస్తువులలో చాలవరకు లోహములతో చేయబడియున్నవి. ఆరోజులలో వారికి ఇనుముగాని కంచుగాని తెలియకపోవుటచే వారు రాతినే వాడుచుండిరి. రాతితో వస్తువులుచేయుట కష్టమైనపని. శిలాయుగ మంతమగుటకు పూర్వము ప్రపంచపు శీతోష్ణస్థితి ఎక్కువగా మారి వెచ్చదనమెక్కువైనది. హిమానీనదము లుత్తర ధృవమువైపు పోయెను. మధ్యఆసియా ఐరోపాలలో పెద్ద అరణ్యము లేర్పడెను. ఈయడవులలో క్రొత్తజాతి ప్రజలు నివసింప నారంభించిరి. వీరును రాతియుగపు ప్రజలేగాని వీరిది నవీనశిలాయుగము. వీరు నవీనశిలాయుగపుప్రజ లనబడుచున్నారు.

ఈనవీన శిలాయుగపు ప్రజలనుగూర్చి తెలిసికొన్నపుడు చాలయభివృద్ధి కనబడుచున్నది. ఇతరజంతువులతో బోల్చి చూడగా మనుజునిబుద్ధిసూక్ష్మతయే యతనిని చాలముందంజ వేయునట్లు చేయుచున్నది. నవీనశిలాయుగపు ప్రజలు వ్యవసాయముచేయుట యను నొక నూతనవిషయము కనిపెట్టిరి. వారు భూమినిదున్ని విత్తనములుజల్ల నారంభించిరి; ఇవి వారికి చాల లాభదాయకమయ్యెను. రోజంతయు జంతువులను వేటాడ నవసరములేక వారికిపు డాహారము లభించుచుండెను వారికిపుడు విశ్రాంతికాల మెక్కువగనుండెను. అందుచేత బుద్ధి నుపయోగించి యాలోచనచేయుటకు వీలు కలిగెను. వారికి విశ్రాంతి యెక్కువైనకొలదియు క్రొత్త విషయములను, క్రొత్తపద్ధతులును కనిపెట్టుటకు వీరికి యెక్కువ అవకాశము దొరకెను. మట్టిపాత్రలను నిర్మించి వీనిలో వంటచేసికొన నారంభించిరి. వారి రాతి పనిముట్లు నిగనిగలాడునట్లు మెరుగుపెట్టబడెను. ఆవు, కుక్క, గొఱ్ఱె మొదలగు జంతువులను మచ్చికచేయ నారంభించిరి. వారికి బట్టలనేతకూడ తెలియును.

వారు యిండ్లను, గుడిసెలను, నిర్మించుకొనుచుండిరి. వారు తమగుడిసెలను తరచు సరస్సులమధ్య నిర్మించుకొనుచుండిరి. ఇట్లుచేయుటచే నడవిజంతువులవలనను మనుజులవలనను వారికపాయము తక్కువగుటకు వీలయ్యెను. కనుక వీరికి సరోవరవాసులు అనిపేరు వచ్చెను.

ఈప్రజలనుగూర్చి మనకిన్ని విషయము లెట్లు తెలిసిన వాయని నీవాశ్చర్యము పొందవచ్చును. వారుగ్రంథము లే మియు వ్రాయనిమాట నిజమే. కాని వీరినిగూర్చి తెలిసికొ నుటకు ప్రకృతిగ్రంథమే గొప్పయాధారమని నే నిదివరలో చెప్పియుంటిని, అది పఠించుట యంతసులభమైన పనిగాదు. దానికి చాల యోరిమి యుండవలెను.

ఈగ్రంథమును చదువుటలో కొందరు తమజీవిత మం తను గడపి యసంఖ్యాకములగు జీవ శేషములను ప్రాచీనకా లపు శిథిలములను సేకరించి యుండిరి. ఇవి పెద్దపెద్ద చిత్ర వస్తుశాలలలో నుంచబడనవి. అచట మనము మెరుగుపెట్ట బడిన నాజూకగు గొడ్డళ్ళను పాత్రలను రాతియమ్ములను, సూదులను నవశిలాయుగపు ప్రజలచే చేయబడిన యనేకమ గు నితరవస్తువులను చూడగలము. ఇట్టివస్తువులను నీవుచాల చూచియే యున్నావుగాని మరచిపోయితివిగాబోలు, నీవు వానిని తిరిగి చూచిన నీకు జ్ఞాపకమువచ్చును.

జినివా చిత్రవస్తుశాలలో సరోవర నివాసముయొక్క మాదిరియొకటి చూచినట్లు నాకు బాగుగ జ్ఞప్తియందున్నది. ఒకసరస్సులో స్తంభములనుపాతి వానిపై ఒకకొయ్యచపటా యమర్చబడెను. ఆచపటామీద కొయ్యగుడిసెలు వేసిరి, వీనినుండి నేలమీదకు పోవుటకు ఒకవంతెన యేర్పరుపబడి నది. జంతువుల చర్మములును కిత్తనారచే చేయబడినముతక బట్టలను నవశిలాయుగపుప్రజల వస్త్రములు, బట్టలునేయుట

కు కిత్తనార మొక్కకు మంచిపీచుండును. కిత్తనారతోనిపుడు బట్టలు నేయుదురు. కాని యాకాలపు నారబట్టలు చాల ముతకగ నుండియుండును.

వీరిట్లు క్రమాభివృద్ధి నొందుచుండిరి. వారు రాగితోను, కంచుతోను, పనిముట్లు చేయనారంభించిరి. రాగియు, తగరముకంటెనుగూడ కఠినమైనది. వారు బంగారమును కూడ నుపయోగించి దానితో నాభరణములుకూడ తయారు చేయ నారంభించిరి.

ఈప్రజలు సుమారు పదివేలయేండ్ల క్రిందట జీవించి యుండిరి. కాని నిశ్చయమగు తేదీలు చెప్పలేము. ఇదియంతయు నూహాపై నాధారపడినదే. ఇంతవరకు మనము కోట్ల దరబడి సంవత్సరములు విషయము చెప్పుచుంటిమి మనము క్రమక్రమముగా ప్రస్తుతకాలమును సమీపించుచున్నాము. నవశిలాయుగపు నరునినుండి ప్రస్తుతపుకాలపు నరునివరకు చూచినవిపరీతమగు మార్పేమియు కనబడలేదు. అయినప్పటికిని మనకును నవశిలాయుగపు ప్రజలకును ననేక భేదములు గలవు. ఆమార్పులు సహజరీతిని ననుసరించి మెల్లమెల్లగా కల్గెను. అనేకమగు జంతువు లేర్పడి యొక్కొక్క జాతి యొక్కొక్క మార్గము ననుసరించి యొక్కొక్క విధమగు జీవితవిధానము నవలంబించెను. ప్రపంచమునందలి వేర్వేరు భాగములందలి శీతోష్ణస్థితి వేర్వేరువిధములుగ నుండుటచే

నచ్చట పరిస్థితులకు దగిన ట్లచటి ప్రజలు మెలగుటచే మార్పులెక్కువగ గలిగెను. వానిని గురించి ముందుముం దాలోచింతము.

ఈరోజున మరియొకసంగతి చెప్పదలచుచున్నాను. నవ శిలాయుగాంతసమయమున మానవజాతికొక గొప్పప్రమా దము తటస్థించెను. అప్పటి దినములలో మధ్యధరాసముద్రము లేనేలేదని ఇదివరలో చెప్పియుంటిని. అచ్చట కొన్నిసరస్సు లుండెను. వానియందనేక జనులు నివసించియుండిరి. హఠా త్తుగా ఐరోపా ఆఫ్రికాలమధ్య జిబ్రాల్టరువద్దనున్న నేలకొట్టు కొనిపోయి అట్లాంటిక్ మహాసముద్రములోని నీరు మధ్య ధరాసముద్రములోనికి ప్రవహింపసాగెను. ఆజలప్రవాహ ములో సమీపమున నివసించుచుండిన స్త్రీపురుషులెందరో మరణించి యుందురు. వారికి తప్పించుకొనుటకు మార్గము లేకుండెను. వందలకొలది మైళ్ళమేర జలప్రవాహము వ్యా పించి మధ్యధరా లోయనునింపగా మధ్యధరాసముద్ర మేర్పడెను.

ప్రళయమునుగూర్చి ఇదివరలో నీవు విని యుందువు. చదివికూడాయుందువు బైబిలులోను మనసంస్కృతగ్రంథము లలోనుగూడ నీవిషయ ముదహరింపబడియున్నది. ప్రళయ మనగా మధ్యధరాసముద్ర ప్రవాహమే యైయుండును. అది చాల భయంకరమగు నాపద; అందుండి తప్పించుకొనిన కొలదిమంది జనులు ఆవిషయమునుగూర్చి తమబిడ్డలకు చెప్ప

గా వారు మరల వారిసంతతివారికి చెప్పగా, నిట్టికథ యొక తరమునుండి మరియొక తరమువారికి తెలియుచు వచ్చి యుండును.

# 8

## వేర్వేరుజాతు లెట్లేర్పడినవి?

సరోవరవాసులగు నవశిలాయుగపు ప్రజలనుగూర్చి వెనుకటిలేఖలో చదివియున్నాము వార నేకవిధముల నభివృద్ధి బొందియుండిరని మనము గమనించితిమి. వ్యవసాయమును వారు కనిపెట్టిరి. వంటచేయుటయును, జంతువులను మచ్చికచేసి వాని నుపయోగించుకొనుటయు వారికి తెలియును. ఇదంతయు వేలకొలది యేండ్లక్రింద జరిగియుండును; అంతకంటె నెక్కువ వారినిగూర్చి మనకు తెలియదు. కాని నేడు ప్రపంచమునగల యనేకజాతుల ప్రజలు నవశిలాయుగపు సంతతివారై యుందురు. ఇప్పుడు శ్వేతవర్ణులు (తెల్లవారు) పీతవర్ణులు (పచ్చనివారు) గోధుమవర్ణులు (గోధుమరంగువారు) నీలవర్ణులు (నల్లవారు) అనుజాతులప్రజ లగుపడుచున్నారు. కాని ప్రపంచమందలి ప్రజలందరను ఈనాలుగుజాతులక్రింద విభజించు టంత సులభమైనపనిగాదు. జాతులన్నియు మిశ్రమమై పోవుటచే కొంద రేజాతికి చెందినవారో నిర్ధారణగా జెప్పుట కష్టసాధ్యమైనపని. మనుజులపుర్రెలనుకొలిచి యా

కొలతలవలన వారేజాతికిచెందినవారో శాస్త్రజ్ఞులు నిర్ణయింతురు. ఈవిషయము మరికొన్ని మార్గములుగూడ దెలిసికొనవచ్చును.

ఇన్ని వేర్వేరుజాతు లెట్లేర్పడినవి? వీరందరు నొకే సంతతికి చెందినవారైనచో నిన్ని పరస్పరభేదములేల కన్పడుచున్నవి? జర్మనీదేశస్థునకును నీగ్రోజాతివానికి నెంతభేదము కలదో నీవెరుగుదువు. ఒకడు తెల్లగనుండును; ఇంకొకడు నల్లగనుండును. జర్మనీవానిజుట్టు తేలికరంగుగలదై పొడుగుగ నుండును. చైనావాడు వీరిద్దరకును భేదించియుండును ఈభేదము లెట్లేర్పడెనో చెప్పుట కష్టముగాని యీభేదములకు కొన్ని కారణములు మనకు తెలియును. పరిసరముల ననుసరించుచు జంతువులెట్లు మార్పుజెందెనో ఇదివరకు నేను చెప్పియుంటిని. జర్మనులును, నీగ్రోలును వేర్వేరు తెగలకు జెందినవారి సంతతి కావచ్చునుగాని యెప్పుడో యొకకాలమున వారి పూర్వీకు డొక్కడేయైయుండును. ఈభేదములు పరిసరానువర్తనవలన నైనకావచ్చును. లేక జంతువులవలెనే మనుజులలోగూడ కొన్ని తెగలవారు మిగిలినవారికంటెసులభముగ ననువర్తనజేసికొని యుండియుండవలెను.

ఈవిధముగ నుత్తరదేశములలోని మంచుభూములలో నివసించువారు చలినోర్చుట కలవాటుపడియుందురు. ఎస్కిమోలిప్పటికిని మంచుగడ్డలమధ్య నివసించుచు నెంత

చలిదైన భరింపగలరు, మన దేశమువంటి యుష్ణ దేశమునకు వచ్చినచో వారు చనిపోవుదు రేమో! వారికి ప్రపంచములో నితర భాగములతో సంపర్కము లేక కష్టజీవితము గడుపవల సిన వారగుటచే వా రితర ప్రాంతములలోని జనులు నేర్చు కొన్న విషయములన్నియు నేర్చుకొని యుండ లేదు. ఆఫ్రికా ఖండములోనివారివలె భూమధ్య రేఖాప్రాంతమున నివసించు ప్రజలు అచటి తీవ్రమగు వేడిని భరింప నలవాటుపడుదురు. అచటి యెండ తీవ్రతవలన వారిచర్మము నలుపెక్కును. సముద్రతీరమున నెండలో నెక్కువసేపున్న యెడల శరీరము నల్లబారుదని నీవెరుగుదువు. కొద్దిరోజు లెండవేడిమి తగిలిన మాత్రముననే శరీరము నల్లబారిన నెల్లపుడును ఎండలో నుండువారి మాట యేమి? వందలకొలది యేండ్లుష్ణ దేశము లలో తరములపిదప తరములు, నివసించుచున్నచో నాజాతి ప్రజ లంతకంతకు నలుపెక్కి తుదకు కారునలుపుగ తయార గుదురు. మట్టమధ్యాహ్నపు టెండలో పనిచేయు మన దేశపు రైతునుచూడుము. పేదతనముచే నతడు తగినన్నిదుస్తులు ధరింపలేడు. అతనిశరీరమంతయు నెండపాలగును. అతనిజీవిత మంతయు నిట్లే గడుచును. కాన నతడు నల్లగనుండక తీరదు

కనుక శీతోష్ణస్థితినిబట్టి శరీరవర్ణము మారుచుండునని తెలియుచున్నది. మనుజుని గొప్పతనమునకుగాని, మంచి తనమునకుగాని, అందమునకుగాని శరీరచ్ఛాయసంబంధించి యుండదు. ఉష్ణదేశమున చాలకాలము నివసించిన, తెల్ల

వాడుగూడ నల్లబడును. కాని యెండతగులగుండ తగినంత యాచ్ఛాదన మెల్లప్పుడు నుంచుకొన్నమాత్ర మట్లుజరుగక పోవచ్చును. మనము కాశ్మీర దేశస్థులమనియు రెండువందల యేండ్లక్రింద మనపూర్వీకులు కాశ్మీర దేశమున నివసించు వారనియు నీకు తెలియును. కాశ్మీరములో నందరు రైతులును కూలివారునుగూడ తెల్లని శరీరచ్ఛాయకలిగియుండుట నీవుచూచియున్నావు, ఏలయన కాశ్మీరము శీతలప్రదేశము. కాని ఈకాశ్మీరవాసులే హిందూదేశములోని యుష్ణప్రాంతములో నివసించినచో కొన్నితరముల తరువాత నల్లబడుదురు. మనమిత్రులగు కాశ్మీరవాసులు కొందరు మంచి శరీరచ్ఛాయగలిగియుండ మరికొందరు నల్లగనున్నారు. హిందూదేశపు టుష్ణప్రాంతములో కాశ్మీరవాసులెంత యెక్కువకాలము వసింతురో అంత నల్లబడుదురు.

శరీరచ్ఛాయకు ముఖ్యకారణము శీతోష్ణస్థితి. కొందరెక్కువ వేడిప్రాంతములోనున్నను భాగ్యవంతులగుటచే నెండలో పనిపాట్లుచేయ నవసరములేక పెద్దభవనములలో కాపురముండి శరీరకాంతిని కాపాడకొనగల్గి యున్నారు. భాగ్యవంత కుటుంబీకులిట్లు తరతరముగ శీతోష్ణస్థితివలన గల్గుమార్పులను బొందకపోవచ్చును. కాని కష్టపడిపనిచేయక పోవుటగాని, ఇతరులచేపనులు జేయించుకొనుటగాని యొక గర్వింపదగు విషయముగాదు,

హిందూ దేశములో నుత్తరభాగమునను‌న్న కాశ్మీర పంజాబులలోని జనులు సాధారణముగ మంచిశరీర కాంతికల్గి యుందురు. కాని దక్షిణమునకు పోయినకొలది జనులునల్లగా నుందురు. మదరాసు రాజధానిలోను సింహళమునందును చాలమంది నల్లగనుండుట నీవు చూచియున్నావు. ఇదియంతయు శీతోష్ణస్థితివలన నేర్పడినదనియు భూమధ్యరేఖను సమీపించినకొలది యెక్కువ వేడిగ నుండుననియు నీవు చెప్పగలవు. హిందూదేశములోని వేర్వేరు భూభాగములలో శరీరవర్ణమునందు భేదముగల్గుటకు ముఖ్యకారణమిదియే. కాని దీనికి కారణము కొంతవరకు హిందూ దేశమునకు పూర్వకాలమున వచ్చిన వేర్వేరుజాతులనుబట్టికూడ నుండునని ముందు మనము తెలిసికొనగలము. పూర్వయుగములలో ననేక జాతులువారు హిందూదేశమున ప్రవేశించిరి, ఆయాజాతులు తమప్రత్యేకతను కాపాడుకొనుటకు ప్రయత్నించినను, ఇతర జాతులతో కలసిపోవుట తప్పనిసరియైనది. ఒకానొక భారతీయుడీప్రత్యేకజాతికి చెందినవాడని ఇపుడు నిర్ధారణగా చెప్పుట కష్టసాధ్యమైనపని.

## 9

### మానవకుటుంబములోని జాతులు, భాషలు

ప్రపంచమున నేభాగమున మానవకుటుంబము మొట్ట మొదట నేర్పడెనో మానవనివాసస్థానము లాదిలో నెచట

నిర్మింపబడెనో మనము చెప్పజాలము. బహుభూతలముపై ననేకస్థలములం దించుమించుగా నొకేసారి మానవునకు కుటుంబములు వృద్ధిబొందియుండును. హిమయుగము నందలి హిమానీనదములు కరగి యుత్తరదిక్కునకు బోవుచున్నపుడు మనుజులు వెచ్చగనుండు ప్రాంతములందే నివసించియుందురు మంచుపోయిన పిదప నిపుడు సైబీరియాలోనున్న టండ్రాల వంటి విశాలములు శీతలమైదానము లేర్పడియుండును. ఇవి గడ్డిబీడులుగ మారుటచే పశువుల గడ్డికొరకు మానవులు వానియందు సంచారము చేసి యుందురు. స్థిరనివాసము లేక తిరుగుచుండువారికి దేశద్రిమ్మరులని పేరు. ఇప్పుడును దేశ ద్రిమ్మరు లన్ని దేశముల యందునుగలరు. హిందూ దేశమున గూడ నిట్టివారున్నారు. ఎరుకలవారు వీరిలో చేరినవారే.

నదీతీరముల దలినేల సారవంతమైనదగుటచే నదివ్యవసాయము ననుకూలించును గనుక నాకాలమున ప్రజలు నదులసమీపమున స్థిరనివాసము లేర్పరచుకొనిరి. అచటనీరు సమృద్ధిగనుండుటచే సేద్యముచేయుట సులభముగ నుండెను. కనుక హిందూదేశములో సింధు గంగానదులవంటి పెద్దనదుల వద్ద మొదట ప్రజలు స్థిరనివాసము లేర్పచుకొనిరని మన మూహించుచున్నాము. మెసపొటేమియాలో టైగ్రిస్ యూఫ్రటీస్ నదులవద్దను, ఈజిప్టులు నైలునదీతీరమునను, చీనాలో పెద్దనదీతీరములందును ఇట్లేజరిగియుండును. హిందూ దేశములో మనకు తెలిసిన మొదటిజాతివారు ద్రావిడులు.

తరువాత ఆర్యులును మంగోలియనులును వచ్చిరి. ఇప్పటికిని దక్షిణ హిందూదేశప్రజలలో చాలమంది ద్రావిడుల సంతతి వారే. ఉత్తర దేశముకంటె వారెక్కువ నలుపుగనుందురు. ద్రావిడు లీ దేశమున నెక్కువ కాలముండుటయే యిందులకు కారణము కావచ్చును. ద్రావిడులు చాలయభివృద్ధిబొందిన ప్రజలు. వారికి వేర్వేరు భాషలుండెను. వారు విదేశీయులతో నెక్కువవ్యాపారము చేయుచుండిరి.

ఆ కాలమున మధ్యఆసియాయందనుపడమటి ఆసియాయందును తూర్పుఐరోపాయందును నొకక్రొత్తజాతి వృద్ధి పొందుచుండెను. దీనికి ఆర్యజాతియని పేరు. సంస్కృతభాషలో ఆర్యశబ్దమునకు 'మర్యాదగలవాడు' లేక 'గొప్పకులమున బుట్టినవాడ'ని యర్థము. ఆర్యులభాషలలో సంస్కృతి మొకటి గనుక తాము చాల మర్యాదగలవారమనియుఉన్నతకుల సంజాతులమనియు వారు భావించుచుండునట్లు దీని వలన స్పష్టమగుచున్నది. ఇప్పటిప్రజలవలెనే వారును అహంభావపూరితులుగ నున్నట్లు కనుపడుచున్నది. ఆంగ్లేయుడు తానే మిక్కిలి శ్రేష్ఠమైనజాతికి చెందినవాడననియు, ఫ్రెంచివాడు ఫ్రెంచిజాతియె యత్యుత్తమమైనదనియు, అమెరికనులును, జర్మనులునుగూడ తమజాతిని గూర్చి యిట్టి యహంభావముతోను తలచుచుందురని నీకు తెలియును.

ఆర్యులు ఉత్తరాసియా యందును ఐరోపాయందును విశాలమగు గడ్డిబీడులలో సంచరించుచుండిరి. కాని వారి

సంఖ్య వృద్ధియై వర్షములు తక్కువై గడ్డిఅయిపోయినకొలది వారందరకును చాలినంత యాహారములేకపోయెను కనుక ఆహారమును వెదకుకొనుచు వారు ప్రపంచమున నితరభాగ ములకు వెళ్ళవలసివచ్చెను. క్రమముగా ఐరోపాయంతయు వ్యాపించి హిందూదేశము, పర్షియా, మెసపొటేమియా ప్రాంతములను గూడ చేరిరి. కనుక నే కొంచ మెచ్చుతక్కు వగ యూరపుప్రజలందరును, ఉత్తరహిందూదేశము, పర్షియా, మెసపొటేమియాలలోని ప్రజలును ప్రస్తుతము పరస్పర భేద ములు నెక్కువగల్గి యున్నప్పటికిని ఒకేమూలపురుషుల సం తతివారనుట యథార్థము. ఈమూలపురుషులే ఆర్యులు ఆమూలపురుషులకాలము చాలప్రాచీన మనుట నిజమే. ఈ లోపున చాలమార్పులు గల్గుటయేగాక వివిధజాతులు మిశ్ర మము చెందెను. ప్రస్తుతము ప్రపంచమునసున్న ప్రజలలో నక్కువమందికి ఆర్యజాతి మూలజాతి యని స్పష్టముగ జెప్ప వచ్చును.

మంగోలియనుజాతిగూడ గొప్పదే ఈజాతి తూర్పాసి యాలోని చీనా, జపాను, టిబెట్టు, సయాం, బర్మాలలో వ్యాపించెను. ఆ...[illegible] నే యొక్కొక పసుపుపీతజాతి యందురు ...[illegible] చుగ నా...[illegible] ప్రజలకు బూరెబుగ్గలును, చీపికండ్లు నుం డుట నీవు గమనించి యుండవచ్చును.

ఆఫ్రికాయందలి కొన్ని దేశముల ప్రజలకు నీగ్రోలని పేరు వారార్యులును కారు. మంగోలియనులును కారు. వారు చాలనల్లగనుండిరి.

అరేబియా, పాలస్తీను దేశములలోని అరబ్బులును హీబ్రూలును మరియొక జాతికి చెందినవారు.

ఈజాతులన్నియు వేలకొలది యేండ్ల కాలమున చిన్న చిన్న జాతులుగ విడిపోయి కొంత మిశ్రమమైపోయినవి. ఆ వివరములన్నియు మనము తెలిసికొన నవసరము లేదు.

వివిధజాతులను గుర్తించుటలో వారివారి భాషలను పరిశీలించుట యొక ముఖ్యమైనదియు, కుతూహలము గల్గించునదియు నగు విషయమైయున్నది. ఆరంభమున నొక్కొక్క జాతి కొక్కొక్క మూలభాషయుండెనుగాని, కాలక్రమమున నీమూలభాషనుండి వేర్వేరు భాషలు బయలుదేరినవి కాని ఈభాషలన్నియు నొకకుటుంబమునకు చెందినవై యొక మూల భాషయొక్క శాఖలై యున్న వానిలోగల సామాన్య పదములను కొన్నిటిని ఎంచి వానికిగల సంబంధమును నిరూపింపగలము.

ఆర్యులు ఆసియా ఐరోపాలలో వ్యాపించునపుడు పరస్పర సంబంధము గల్గియుండలేక పోయిరి. అపుడు రైలుదారులుగాని టెలిగ్రాపులుగాని, తపాలాగాని, చివరకు వ్రాయబడిన గ్రంథములుగాని లేవు. కనుక ఆర్యులలో నొక్కొక తెగయు తనదారి ననుసరించి యొక్కొకభాషను మాట్లాడ నారంభించెను. కొంతకాలమున కార్యులభాష మూలభాష

నుండియు, ఇతరార్య దేశములలోని యేకకుటుంబభాషల ఉప శాఖలనుండియు చాలమార్పులు పొందెను.

ఈ కారణమువలననే ప్రస్తుతము ప్రపంచమున నిన్ని భాష లగుపడుచున్నవి.

ఈభాషలన్నియు పరికించిచూచిన నవియన్నియు నెక్కువగ నున్నప్పటికిని మూలభాషలు చాలతక్కువగనుండె నని గ్రహింపగలము. ఆర్యులే దేశమునకు పోయినప్పటికిని అచ్చటి భాష ఆర్యకుటుంబమునకు జెందియుండెననుట దీని కుదాహరణము సంస్కృతము, లాటిను, గ్రీకు, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను, ఇటాలియను మరికొన్ని యితరభాషలును ఏకకుటుంబభాషలే ఇవన్నియు నార్యకుటుంబమునకు జెందినవి. హిందీ. బెంగాలీ, ఉర్దు, మరాఠి, గుజరాతి మొదలగు భాషలన్నియు సంస్కృతభాషనుండి పుట్టినవి గనుక నివియు నార్యకుటుంబమునకు జేరినవే.

చీనాభాషాకుటుంబముకుండ పెద్దదే. దీనితో చీనాభాష బర్మాభాష, టిబెటుభాష. సయాముభాష మొదలగునవిగలవు.

అరబికు, హిబ్రూభాషలుచేరియున్న సెమిటికుటుంబము వేరొకటి.

టర్కీభాష, జపానుభాష మున్నగునవి పైకుటుంబములలో వేనియందును చేరదు. తమిళము, తెలుగు, కన్నడము, మళయాళము మొదలగు దక్షిణహిందూదేశ భాషలును ఈ కుటుంబమునకు చేరినవికావు. ఇవి చాలప్రాచీనమగు ద్రావిడ కుటుంబములోనివి.

# 10

## భాషాసంబంధములు

ఆర్యులు వివిధదేశములలో విస్తరించి తాము వెళ్ళిన చోటులనెల్ల తమభాష నెట్లువ్యాపింపచేసినదియు తెలిసికొని యుంటిమి. కాని వేర్వేరు శీతోష్ణస్థితిగతులును, వేర్వేరుపరిస్థితులును ఆర్యులతెగలలో ననేకభేదములు గల్గించినవి. ఒక్కొక్క తెగయు క్రొత్తఅలవాట్లను, క్రొత్తఆచారములను యేర్పరచుకొని,మార్పులు జెందుచుండెను. ఆరోజులలో ప్రయాణసౌకర్యములు లేకపోవుటచే నొక తెగవారు మఱియొక తెగవారిని కలిసికొనలేకపోవుచుండిరి. ఒక తెగ మరియొక తెగతో వేరుపడియుండెను. ఒక దేశపుప్రజలు నేర్చు క్రొత్తవిషయమును మరియొక దేశపు ప్రజలకు తెలియజేయలేకపోయిరి. ఇట్లు మార్పులేర్పడి కొన్నితరముల పిదప నొక్కొక ఆర్యకుటుంబమును వివిధభాగములుగ నేర్పడెను. వారందరు నొకే పెద్దకుటుంబమునకు చెందినవారనికూడ వారు మరచిపోయి యుందురు. మొదట నొక్కటిగానుండిన యార్యులభాష యనేకభాషలై యవి పరస్పరము భిన్నమైనట్లగుపడజొచ్చెను.

అవి యెంతభిన్నముగ కన్పడినను వానిలో సామాన్యపదములును, సామ్యములు నెక్కువగ నున్నవి. వేలకొలది యేండ్లుగడచినపిదప నిపుడుగూడ వేర్వేరుభాషలలో నిట్టి

సామాన్యపదముల నెంచి యీ భాషలన్నియు నొకప్పు డొకటిగ నుండెనని చెప్పవచ్చును. ఫ్రెంచి ఇంగ్లీషుభాషలలోనట్టి సామాన్యపదములు చాలగలవని నీకు తెలియును తండ్రి, తల్లి అను రెండు మామూలుపదములను పరిశీలింతము. హిందీలోను సంస్కృతములోను ఆపదములకు 'పితా', 'మాతా' అందురని నీకు తెలియును లాటినులోనవి 'పేటర్', 'మేటర్' గ్రీకులో 'పేటర్', 'మీటర్' ఇంగ్లీషులో 'ఫాదర్', 'మదర్' జర్మనులో 'ఫాతర్', 'ముతర్' ఫ్రెంచిలో 'పీరే', 'మేరే' ఇట్లే ఇతర భాషలలోను గలవు. ఇవన్నియు నొకదానితో నొకటి పోలియుండలేదా? ఇవన్నియు జ్ఞాతులవలె నొకకుటుంబ సామ్యమును గల్గియున్నవి. చాలపదము లొకభాషనుండి మరియొక భాషలో ప్రవేశింపవచ్చును. ఇంగ్లీషునుండి హిందీలోనికిని, హిందీనుండి ఇంగ్లీషులోనికిని ఇట్లనేక పదములు వచ్చియున్నవి. కాని తండ్రి, తల్లి అనునర్థమిచ్చు పదము లొకభాషనుండి మరియొక భాషలో చేరియుండవు. ఇవి క్రొత్తగా చేరినపదములు ఎప్పుడును గాజాలవు. మనుజులు మాట్లాడుటకు నేర్చినపుడే తల్లి దండ్రు లుండిరిగనుక వారికి పేర్లప్పుడే యేర్పడియుండును. అందుచేతచే యీపదములు మరియొకభాషనుండి ఎరువు తెచ్చుకున్న వెప్పటికిని కాజాలవు. అవియొక మూలభాషనిద్వారా గాని యొకకుటుంబము ద్వారా గాని తర్వాతివారికి వచ్చియుండును. వీనినిబట్టి

యిప్పుడు వేర్వేరు దేశములలో నివసించుచున్న వేరుభాష లుపయోగించు ప్రజలొకప్పు డొకేకుటుంబమునకు జెంది యుండిరని మనము తెలిసికొనగలుగుచున్నాము.

భాషాభ్యసన మెంతయుత్సాహకరముగ నుండునో, అది మన కెన్నివిషయములు బోధించునో నీవు గ్రహింప గలవు. మూడునాలుగుభాషలు తెలిసిన అనేకమగు భాషలు సులభముగా నేర్చుకొనవచ్చును,

ప్రస్తుతము వేర్వేరుదేశములలో నొకరకొకరు దూర ముగ నివసించుచున్న మనలో చాలమంది పూర్వమొకప్పు డొకేజాతికి చెందియుంటిమని నీవు గ్రహింపగలవు. అప్పటి నుండి మనమనేకమగు మార్పులజెంది మనకుగల సంబంధము మరచిపోతిమి. ప్రతిదేశములోని ప్రజలను వారేశ్రేష్ఠులనియు నెక్కువబుద్ధిమంతులనియు, మిగిలినవారు తమకంటె తక్కువ యనియు తలచుచుందురు. ఇంగ్లీషువాడు తనను తన దేశము నే గొప్పగాతలచును. ఫ్రెంచివాడు, ఫ్రాన్సునుగూర్చియు. ఆదేశమునకు సంబంధించినదంతయు జూచియు, గర్వము జెందును. జర్మనులును, ఇటాలియనులును తమ దేశమును చూచి పొంగిపోవుటకు మితియుండదు. ప్రపంచమందలి దేశములన్నిటిలో హిందూదేశము గొప్పదని చాలమంది భారతీయుల యభిప్రాయము. ఇదియంతయు నహంభావ మనిపించుకొనును. ప్రతివాడును తననుగూర్చి తన దేశమును

గూర్చి మంచినే తలచుచుండును. కాని యథార్థ మాలోచించిన ప్రతిమనుజునియందును కొంతమంచియు కొంతచెడ్డయు నిమిడియుండును. అట్లే కొంతమంచియు కొంతచెడ్డయు లేని దేశముండదు. మంచియున్నచోటునుండి దానినిగ్రహించి చెడ్డయున్నచో నది పరిహరింపదగును. మనకు మన హిందూదేశముతోడనే యెక్కువ సంబంధముగలదు. దురదృష్టవశమున నేడు మనదేశము దుస్థితియందున్నది. మన దేశమందలి ప్రజలు చాల పేదవారై హీనస్థితియందున్నారు. వారికి జీవితమున సౌఖ్యమనునది లేదు. వారికెక్కువసౌఖ్యము గలుగజేయుట యెట్లోమనమాలోచింపవలెను. మనయాచార వ్యవహారములలో మంచివేవో యాలోచించి వానినుంచి చెడ్డవానిని తీసిపారవేయవలెను. ఇతర దేశములలో మనకేదైన మంచి కన్పించినచో దానిని తప్పక సంగ్రహింపవలెను.

మనముభారతీయులమగుటచే భారతదేశమునవసించి భారతదేశముకొరకు పాటుపడవలసియున్నది కాని మనము ప్రపంచమను పెద్దకుటుంబమునకు జెందినవారమనియు, నితర దేశస్థులుమనసన్నిహితబంధువులనియు, మనముమరువరాదు. ప్రపంచమందలి జనులందరును సౌఖ్యవంతులై, సంతుష్టులై యున్నచో నది చాలమంచిసంగతి గనుక మనమందరమును విశ్వకళ్యాణముకొఱకు యత్నింపవలెను.

# 11

## నాగరికతయన నేమి?

ఆదిమనాగరికతలనుగూర్చి నీకు కొంత చెప్పదలచుచున్నాను. కాని యంతకుముందు నాగరికతయన నర్థమేమి యొకొంత తెలిసికొనవలెను. నిఘంటువుచూచిన నాగరికత కలుగజేయుటయన బాగుచేయుట, నాజూకుతనము కలిగించుట, మోటుఅలవాట్లు పోగొట్టి మంచియభ్యాసములు కలిగించుట యని తెలియగలదు. ఇది యొకసంఘమునకుగాని ప్రజాసమూహమునకుగాని వర్తించును. జంతువులకంటె కొంచెము నయముగానుండు మనుజుల మోటుస్థితికి ఆటవిక స్థితి లేక కిరాతస్థితియని పేరు నాగరికత దానికి భిన్నమైనది. ఆటవికస్థితినుండి దూరమైనకొలది నాగరికత వృద్ధియగుచుండును.

కాని యొకసంఘముగాని, వ్యక్తిగాని ఆటవికస్థితిలో నున్నదియు. నాగరికతస్థితిలోనున్నదియు, మన మెట్లు కనుగొనగలము? ఐరోపాలోని చాలమంది ప్రజలు తామే నాగరికులమనియు, ఆసియాలోని ప్రజలు కేవలము ఆటవికులనియు తలచుచుందురు. ఆసియాఆఫ్రికాలందలి ప్రజలకంటె ఐరోపాలోనివా రెక్కువ దుస్తులను ధరించుటయా దీనికి కారణము? దుస్తులు శీతోష్ణస్థితినిబట్టియుండును. ఉష్ణదేశములందుకంటె శీతలదేశములందు ప్రజలెక్కువదుస్తుల ధరింపవలసియుం

డును; లేక తుపాకి ధరించినవాఁడు అస్త్రములు లేనివానికంటె నెక్కువబలవంతుఁడు గనుక నెక్కువనాగరకుఁడనుకొనవలెనా? నాగరకతమాట యెట్లున్నను బలహీను డామాట కాదని ధైర్యముగ చెప్పలేఁడు, చెప్పినచో నతఁడు తుపాకీదెబ్బ తినవలసివచ్చునేమోయని భయ ముండును.

కొన్నియేండ్లక్రిందట నే యొకగొప్పయుద్ధము జరిగెనని నీ వెఱుఁగుదువు. ప్రపంచములో నెక్కువ దేశములు దానియందు పాల్గొని యొక [illegible] దలి వారిని సాధ్యమైనంత యెక్కువ మందిని చంపుటకు యత్నము చేసెను. ఇంగ్లీషువారు జర్మనులను జర్మనులింగ్లీషువారిని నాశనముచేయ ప్రయత్నించుచుండిరి. ఈయుద్ధములో లక్షలకొలది జనులు చనిపోయిరి. వేలకొలది అంగవైకల్యము పొందిరి. కొందరికి కండ్లుపోయెను. మరికొందరకు చేతులు కాళ్ళు పోయెను. ఇట్టి అంగహీనులను నీవు ప్రయాణములో [illegible] దేశములందు చాలమందిని చూచియున్నావు. పట్టణములలో భూమియడుగున వేయబడిన [illegible] రైలుమార్గమున నట్టివారికి ప్రత్యేకముగ కొన్ని స్థానములు అమర్చబడియున్నవి ఇట్లుమానవు లొకరినొకరు చంపుకొనుట యెంతనాగరికమైనట్టిదియు, వివేకవంతమైనట్టిదియు నీవే చెప్పఁగలుగుదువా? వీధులలో నిద్దరు మనుష్యు లొకరితో నొకరు పోరాడుచున్న పోలీసువాడు వారిని విడదీయును. వారు వట్టి తెలివితక్కువవారని అందఱును తలంచెదరు. కాని పెద్దపెద్దదేశము లొకదానితోనొకటి

పోరాడి వేలకొలదియు లక్షలకొలదియు ప్రజలను చంపుట యింక నెంతబుద్ధిలేనిదియు, నజ్ఞానముతో గూడినదియునగు పనియైయున్నది? అడవిలో నిద్దరు కిరాతులు పోరాడుకొనుట వంటిదే యిది. అడవిమనుష్యులను కిరాతులన్నచో నిట్లు అజ్ఞానముగ సంచరించు దేశము లింక నెంతకిరాతబుద్ధిగలవి?

కనుక నీసమస్య నీవిధముగ నాలోచించిచూచిన ఐరోపా మహాసంగ్రామములో పోరాడి హత్యలు గావించిన ఇంగ్లండు, ఫ్రాన్సు, ఇటలీ మొదలగు నితర దేశము లన్నియు నెంతమాత్రమును నాగరికమైనవిగావు. అయినప్పటికిని యీ దేశములం దెన్నియో సుందరమగు వస్తువులున్నవి; సత్పురుషులును నున్నారని నీకు తెలియును.

నాగరకత యననేమియో నర్థముచేసికొనుటకష్టమని నీవు చెప్పెదువుకాబోలు నీవు చెప్పునది నిజమే. ఇది చాల క్లిష్టమగుసమస్య. సుందరభవనములు, మనోరంజకమగుచిత్రములు ఆహ్లాదకరమగు గ్రంథములు—వేయేల? సౌందర్యముగల వస్తువులన్నియు నిశ్చయముగా నాగరకతా చిహ్నములే కాని స్వార్థపరత్వమునువిడిచి యితరులతోగలిసి సంఘశ్రేయమునకు బాటుపడు నుత్తమవ్యక్తి నాగరకత కింకను మంచి చిహ్నము. ఒంటరిగ పాటుపడుటకంటె నితరులతో నైకమత్యముగల్గి పాటుపడుట యుత్తమపద్ధతి. ఐకమత్యముతో సర్వజనసౌఖ్యముకొరకు పాటుపడుట యుత్తమోత్తమపద్ధతి

## 12

### తెగల యేర్పాటు

మానవుడు భూతలముపైనున్న మొదటిరోజులలో జంతువుల చెక్కువ పోలియుండెనని యిదివరకు లేఖలలో జెప్పియుంటిని. మెల్లమెల్లగా చేలకొలది యేండ్లలో నాతడభివృద్ధిపొంది యుచ్చస్థితిని పొందెను. ఇప్పుడవి జంతువులవలెనే యాతడపుడొంటరిగ వేటాడుచుండెను. తరువాత సమూహముగ జేరియుండుట యెక్కువ వివేకవంతమును, క్షేమకరము నని యతడు గ్రహించెను. ఎక్కువమంది కూడియున్నచో నెక్కువ బలముకలిగి అడవిజంతువులనుండియు మానవశత్రువులనుండియు నాత్మరక్షణ చేసికొనవచ్చును. జంతువులు గూడ నట్లే యపాయరహితముగ నుండుటకై మందలు మందలుగ సంచరించును. గొఱ్ఱెలు, మేకలు, లేళ్ళు, ఏనుగులు గూడ నిట్లే మందలుగ తిరుగును. మందలు నిద్రించునపుడు వానిలో కొన్ని జంతువులు మేల్కొనియుండి కాపు కాయుచుండును. తోడేళ్ళమందల కథలను నీవు చదివియున్నావు. రష్యాలో శీతాకాలమున తోడేళ్ళు మందలుగా తిరుగాడుచు, నాకాలమున వాని కాకలి యెక్కువగుటచే, జనులనెదిరించును. ఒంటితోడేలు తరచుగ మనుష్యునిపైకి రాదు. గాని మందగా నున్నపుడు మనుష్యులసమూహమును గూడ నెదుర్కొనుటకు తగినధైర్యము కలిగియుండును. అప్పుడు మనుజులాత్మరక్షణకై పారిపోవుదురు, మంచుగడ్డ

లపై చక్రములు లేని బండ్లమీద మనుష్యులు ముందును, వెనుకతోడేళ్ళును, పరుగెత్తుచుండుట చూచిన పందెము జరుగుచున్నదాయనునట్లుండును.

ఇట్లు గుంపులుగా నేర్పడుటయే నాగరికతాభివృద్ధిలో మొదటిదశ. ఇట్లేర్పడిన గుంపులకే తెగలనిపేరు. పిదప, వారైకమత్యముతో పనిచేయ నారంభించిరి. పరస్పర సహకారముగూడనుండెను. ప్రతివ్యక్తియు మొదట తెగనుగూర్చియు పిదప తనబాగునుగూర్చియు తలపవలసియుండెను. తెగకేదైన నపాయముగల్గిన నందలి ప్రతివ్యక్తియు పోరాడి తెగనురక్షింపవలసియుండును. తెగలోనెవడైన తెగయొక్క బాగునకై పాటుపడనియెడల నాతడు తెగనుండి తరిమివేయ బడుచుండెను.

జనులందరునుకలసి పనిచేయవలెనన్నచో వారొక క్రమవిధానము ననుసరింపవలసి యుండును. ఎవరియిష్టానుసారమువారు వర్తించిన తెగకు హానిగల్గును. కనుక నొకడు నాయకుడుగ నేర్పడవలెను. మృగముల మందలకుగూడ పెద్ద యొకటియుండును. ఒక్కొక్క తెగయందలి మనుజులుగూడ వారిలో బలవంతుని నాయకునిగ నెన్నుకొనుచుండిరి. ఆకాల ప్రజనులలో పోరాటములు చాల ఎక్కువగనుండుటచే బలవంతుడే నాయకుడుగ నేర్పడెను.

ఒక తెగలోనంతఃకలహములు నల్గిన ఆ తెగ నాశన మగును, కనుక నాయకుడంతఃకలహముల నణచుచుండెను

ఒక తెగతో మరియొక తెగకు మాత్రము పోరాటములు తప్ప కుండెను. అంతకుపూర్వము ప్రతివ్యక్తియు స్వల్పలాభము కొరకు సంఘమునం దందరితోను పోరాడుచుండిన పద్ధతినిబట్టి చూచిననిది కొంత 'ముందడుగు' అనియే భావింపవచ్చును.

ఆరంభమున నొక్కొక్క పెద్దకుటుంబముఒక్కొక్క తెగగ నేర్పడుచుండెను. తెగలోనివారందరును బంధువులై యుండిరి. కాని క్రమముగా కుటుంబములు పెద్దవై తెగలు కూడ చాల పెద్దవయ్యెను.

ఆదిమకాలమున తెగ లేర్పడకముందు మనుష్యునిజీవితము చాలకష్టముగ నుండియుండును. అప్పు డుండుట కిండ్లు లేవు. చర్మములుతప్ప బట్టలులేవు; ఎల్లప్పుడును పోరాటము జరుగుచునే యుండెను. ఆహారముకొరకు వేటాడి జంతువులను చంపి మాంసమును, పండ్లను, కాయలను సేకరింపవలసి వచ్చెను. అతని కన్నివైపులను శత్రువులే యున్నట్లుండెను. వడగండ్లు మంచు, భూకంపములు మొదలగువానిచే నతనికి ప్రకృతికూడ శత్రువుగనే గన్పడెను. పాప మతడొక బానిస వలె భూమిపై ప్రాకుచు దేనినిచూచినను భయమొందుచు నుండెను. ఏలయన ప్రకృతివిషయము లతనికేవియు నర్థమగుటలేదు. వడగండ్లు పడినపుడు మేఘములలోని దేవత యేదో యాతనిని కొట్టవచ్చుచున్నదని యాతడు తలచెను. అతడు పారిపోయి వడగండ్లను, మంచును, వర్షమును పంపుచున్న మేఘములలోని దేవత ప్రీతికై యేదైన చేయదలచె

ను. కాని యెట్లు ప్రీతిగలిగింపగలడు? అందులకు తగిన తెలివి తేట లతనికి లేవు. మేఘములలో దేవతకూడ తనవలెనే యాహారమును కోరెనని యాతడు తలచెను. అందుచే నత డొక జంతువునుచంపి యాదేవత తినుట కతడు పడవేయు చుండెను. దీనికే 'బలి' యనిపేరు. వర్షమును, వడగండ్లను పడకుండ ఇట్లాపవచ్చునని యాకాలపు మానవుడుతలచెను.

వర్షము, మంచు, వడగండ్లు నెట్లేర్పడుచున్నవో ఇప్పటి కాలమున మనకు తెలియును గనుక మనకాలపు మనుజులచర్యలన్నియు చిన్నపిల్లలచేష్టలవలె నగపడుచున్న వి. జంతువును చంపుటకును, వడగండ్లుపడుటకు నెట్టిసంబంధ మును లేదు. ఇది స్పష్టమే; అయినప్పటికిని ప్రస్తుతకాలమున గూడ కొందరజ్ఞాను లిట్టి తెలివితక్కువపనులను చేయుచుం డుటను మనము చూచుచున్నాము.

# 13

## మతారంభము; శ్రమ వినిమయము

ఆదిమమనుష్యులు ప్రతివస్తువునుచూచియు, భయపడు చుండిరనియు, కష్టములన్నియు కోపదారులగు దేవతలచే గల్పింపబడినవనియు తలచుచుండిరని క్రిందటిలేఖలో జెప్పి యుంటిని. ఇట్టిఊహచే గల్పింపబడిన దేవతలన్ని స్థలములందును అడవులలోను, పర్వతములమీదను, నదులలోను, మేఘము

లంచమును వారికగపడుచుండిరి. వారిదృష్టిలో భగవంతుడు దయామయుడుగాడు. అంతేగాక దేవుడు కోపిష్ఠియు చికాకు పడువాడుననియు వారిభావము. అతనికోపముచే వారుభీతి నొంది యాతనిని శాంతింపజేయుట కేదోయొక లంచము-ముఖ్యముగ నాహారము ఇచ్చుటకు యత్నించుచుండిరి. ఎప్పుడైనను భూకంపము వరదలు, జాడ్యములు మొదలగునవి తటస్థించి చాలమంది చనిపోయినయెడల వారు భీతిజెంది దేవతల కాగ్రహముగ లైనని తలచుచుండిరి. వారిని తృప్తి పరచుటకు పురుషులును, స్త్రీలును, తమపిల్లలనుగూడ చంపి బలియిచ్చుటకుకూడ వెనుదీయకుండిరి. ఇదిచాల ఘోరమైన విషయమేగాని భయము జెందినవా డెట్టిపని చేయుటకు సంకోచింపడు.

మతమునుసదయిట్లే యారంభమైయుండును. కనుక మతము భయమువలన చేసినపని యేదైనను మంచిదికాదు. మతము మనకనేకమగుమంచివిషయములనుబోధించును,నీవు పెద్దదానవైనపిదప ప్రపంచమందలి మతమునుగూర్చి చదివి మతము పేరిట జేయబడిన మంచిపనులను చెడ్డపనులను తెలిసి కొనగలవు. మతమునకు సంబంధించిన యుద్దేశము లెట్లా రంభమయ్యెనో తెలిసికొనుటకుతూహల జనకముగనుండును. మతము యొక్క అభివృద్ధినిగూర్చి ముందుముందు తెలిసి కొనగలము కాని మతమంత యెక్కువగ సంస్కారణము జెందినను మతముపేరిట ననేకులు యుద్ధముచేయుటయు,

నొకరితలలొకరు పగలగొట్టకొనుటయు మనము నేటికని చూచుచున్నాము. కొందరికింకను మతము భీతినిగనుగజేయు నదిగనేయున్నది. గుడులలో నెవరోయున్నారని తలచి వారిని తృప్తిపరచుటకు కొన్నివస్తువు లిచ్చుచుండుటయును, జంతువులను బలిగ నర్పించుటయు నిప్పటికని కొందరికలవాటు.

ఆరంభ కాలమున మనుష్యుని జీవితము చాలకష్టముగ నుండెను. ప్రతిదినమును కష్టపడి యాహారము సంపాదించుకొన నిచో పస్తుండవలసిన చ్చెడిది. ఆరోజులలలో సోమరిపోతులు బ్రతుకలేకుండిరి. ఒకసారి యెక్కువ ఆహారము నిలువచేసి కొని కొంతకాలమువరకు పనిచేయక కూర్చుండుటకుగూడ నప్పుడు సాధ్యముగాకుండెను.

తెగలేర్పడినపిదప కొంత సులభమయ్యెను. తెగలలో నందరును కష్టపడిన నొక్కొక్కని కష్టమునకంటెను సంపాదించిన దానికంటె నెక్కువ సేకరించుటకవకాశము కలిగెను. ఒంటరిగా చేయలేని పనులెన్నిటినో పరస్పరసహకారము చేసులభముగజేయగలమని నీకు తెలియును. ఒక పెద్దబరువును నొకరిద్దరు మోయలేరుగాని ఎక్కువమంది ఒకరికొకరు సాయము చేసికొని సులభముగ మోయగలరు. ఆరోజులలో జరిగిన మరియొక అభివృద్ధిసూచకమగు నంశమునుగూర్చి నేనుజెప్పియుంటిని. అది వ్యవసాయము, చీమలు వ్యవసాయమును మనుజులకు ముందారంభించినవని నేను చెప్పినచో నీకు చిత్రముగ గన్పడును. చీమలు నేలనున్న పత్తినములు

జల్లి పంటను కోతకోయునని నేను చెప్పుటలేదు. చీమలు చేయుపని యిట్లుండును. తాము తినదగిన విత్తనములుగల మొక్క లగపడిచో చీమ లామొక్కచుట్టునున్న గడ్డి నంతను తీసివేయును. దీనివలన నామొక్క ఎక్కువకాలము బ్రతుకుట కవకాశము గల్గును.

మనుజులుగూడ మొదట నీ చీమలవలెనే చేసియుందురు. అపుడు వారికి సేద్యమన నేమియో తెలియదు. వ్యవసాయమన నేమియో గ్రహించి విత్తనములు జల్లుటకు వారి కెన్నోయుగములు పట్టియుండును.

వ్యవసాయ మారంభముకాగానే ఆహారము లభించుట సులభమయ్యెను. ఆహారముకొరకెల్లపుడు వేటాడ నవసరము లేకపోయెను. అందుచే మునుపటికంటె వారిజీవితము సులభమయ్యెను. ఇపుడు మరియొక చిత్రమగుమార్పు కల్గెను. వ్యవసాయమునకు ముందు ప్రతిమనుజుడును వేటయందు నేర్పరియై యుండెను. అప్పుడు మనుష్యుల కదియే వృత్తిగనుండెను. ఆరోజులలో స్త్రీలు పిల్లలను పోషించుచు పండ్లను సేకరించుచుండిరిగాబోలు కాని వ్యవసాయమురాగానే అనేకమగు మార్పులుగలిగెను. పొలములోపని, వేట, పశుపోషణ మొదలైన వేర్పడెను. అపుడు బహుశః స్త్రీలు పశువులను పెంచి పాలు పితుకుచుండిరి. కొందరు పురుషులొక విధమగుపనియు, మరికొందరింకొకపనియు చేయుచుండియుందురు.

ప్రస్తుతము ప్రపంచమున నొక్కొక మనుష్యుడొక్కొక పనినే చేయుచున్నాడని గమనించియుందువు. వైద్యుడుగనో పంతెనలును, రోడ్లను నిర్మించు ఇంజనీరుగనో, వడ్రంగిగనో, కమ్మరిగనో, ఇండ్లకట్టు తాపిపనివాడుగనో, దర్జీగనో, చెప్పులుకుట్టువాడుగనో ఇట్లీకాలమున నొక్కొక డొక్కొక వృత్తిని నవలంబించుచున్నాడు. ప్రతివానికిని ఒక్కొక వ్యాపారము గలదు. మిగత వ్యాపారముల గూర్చి యతని కింతగా తెలియదు. ఇదియే వ్యాపారవిభాగము లేక శ్రమవినిమయమందురు. ఒక్కొక మనుష్యుడు ఒకేపనియందు కృషిచేసినచో నాతడు దానిని నైపుణ్యముతో చేయ సాధ్యమగును. అంతేగాని యొకడు చాలపనులలో వ్రేలుపెట్టిన నేదియు క్రమముగ నెరవేరదు. ప్రస్తుతము ప్రపంచమున నిట్లు శ్రమవినిమయ మెక్కువగ వ్యాపించియున్నది. ప్రాచీన కాలపు జాగలలో వ్యవసాయమారంభింపగనే శ్రమవినిమయము మెల్లగా వ్యాపింపదొడగెనని మనకు స్పష్టమగుచున్నవి.

# 14

## వ్యవసాయమువల గల్గిన మార్పులు

క్రిందటి లేఖలో శ్రమవినిమయమునుగూర్చి కొంత చెప్పియున్నాను. మొట్టమొదట మనుష్యులు వేటవలననే జీవించుచుండినపుడు శ్రమవినిమయముచాలతక్కువగనుండెను. ప్రతి

మనుజుడును వేటాడుటచే కొంతశ్రమపొందినను చాలినంత యాహారము తెచ్చుకొనగల్గెను. వ్యాపారవిభాగము మొదట స్త్రీపురుషులలోనే జరిగెను. పురుషులు వేటకువెళ్ళగా స్త్రీలింటివద్దనుండి పిల్లను పశువులను పోషించుచుండిరి.

మనుజులు వ్యవసాయమును నేర్వగనేచాలమార్పులు జరిగెను. మొట్టమొదట వ్యాపారవిభాగ మెక్కువగా నేర్ప డెను. కొందరు వేటాడిరి. మరికొందరు పొలమును దున్నుచు పనులు చూచుచుండిరి. కాలముగడచినకొలది ప్రజలెక్కువ వృత్తులు నేర్చుకొని వానియందు నైపుణ్యము గడించిరి.

భూమికృషి నారంభించుటతోడనే మనుష్యులు పల్లె లందును పట్టణములందును స్థిరపడజొచ్చిరి వ్యవసాయ మారంభింపకముందు ప్రజలు వేటాడుచు సంచారముచేయు చుండిరి. అప్పుడు వేరొకచో నుండనవసరము లేకుండెను. వారచ్చటకు బోయినైనను వేటాడవచ్చును. వారియావులు గొర్రెలు మొదలగు జాతువులకొరకు వారు తిరుగవలసి వచ్చెను. ఈజంతువులుమేయుటకు గడ్డిబీడు లవసరమయ్యెను. ఒకచోట కొంతకాలము పశువులుమేసినపిదప నచటతగినంత గడ్డి మొలవకపోవుటచే తెగయంతయును మరొకచోటికి బోవలసివచ్చెను. వ్యవసాయమురాగానే జనులు భూమికి దగ్గరనుండి పోవలసివచ్చెను. వారుదున్ని విత్తులు జల్లిననేలను వారు వదలలేకపోయిరి? అందుచే వారొకపంటకాలమునుండి

మరియొక పంటకాలమువరకు కష్టపడుచుండిరి. ఇట్లు గ్రామములును పట్టణములును వృద్ధిపొందెను.

వ్యవసాయము తెచ్చిపెట్టిన మరియొక మార్పేదనగా, జీవితము సులభమయ్యెను.

ఎల్లపుడును వేటాడుచుండుటకంటె భూమిని సేద్యము చేసి పంటపండించుట చాలసులభమైనపని. భూమిలోపండిన పంట అప్పటితిండికిపోగా మిగులుచుండెను. మిగిలినదానిని సేద్యగాండ్రు జాగ్రత్తచేయుచుండిరి.

మరియొకచిత్రమగు నభివృద్ధి గమనింతము. మానవుడు కేవలము వేటగాడుగానున్నపుడాతడెక్కువగ నేమియు నిలువచేయలేకపోయెను. అతడు చాలీచాలని జీవనముగడపుచుండెను. ఏరోజునకారోజు వేటాడి ఆహారముదు సంపాదించుకొనుచుండెను. ధనమునుగాని మరిదేనినిగాని జాగ్రత్తపరచుకొనుటకు బ్యాంకులు లేకుండెను. వ్యవసాయ మారంభముకాగానే భూమినుండి తాత్కాలికముగ నవసరమైన దానికంటె నెక్కువ లభించుచుండెను. అపుడు మిగిలిన దానిని మానవుడు నిలువచేయనారంభించెను. ఈవిధముగా నాహారపునిలువ ఆరంభమయ్యెను. అప్పటి కవసరమైనంత మాత్రముకంటె నెక్కువగా లభించునట్లు కొంచెమెక్కువ కష్టపడుటచే మానవునకీయాహారపునిలువ లభించెను.

ఇప్పుడు ప్రజలు బ్యాంకులలో ధనము నిలువచేసికొని యవసరమైనపుడు చెక్కులద్వారా దానిని తీసుకొందురు,

ఈధన మెక్కడినుండి వచ్చుచున్నది? దీనినిగూర్చి బాగుగా నాలోచించిన ధనమంతయు ననసరమైనదానికంటె నెక్కువే యనియు నొకేసారిఖర్చు చేయుట ఇష్టములేకపోవుటచే ప్రజలు దానిని బ్యాంకులలో నుంచెదరనియు గ్రహింపగలవు. ప్రస్తుతకాలమున భాగ్యవంతులవద్ద నిట్టినిలువ చాలయెక్కువగా నున్నది. బీదల కసలేలేదు. ఈనిలువ యెట్లువచ్చుచున్నదో ముందుముందింకను బాగుగా గ్రహింపగలవు. ఒకనికంటె మరియొక డెక్కువ కష్టపడి పనిచేయుటచే నిట్టినిలువను పొందలేరు సరిగదా ప్రస్తుతము అసలేపనిచేయనివానికెక్కువ నిలువ లభించుచున్నది. శ్రమపడి పనిచేయువాని కెంత మాత్రమును లభ్యమగుటలేదు. ఇది చాల తెలివితక్కువ యేర్పాటుగ గన్పడుచున్నది.

ఇట్టి తెలివితక్కువయేర్పాటువలననే ప్రస్తుతము ప్రపంచమున బీదవారెక్కువగా నున్నారని చాలమందియభిప్రాయము. ఈవిషయ మర్థముచేసికొనుట నీకిపుడు కొంచెము కష్టముగ గన్పడవచ్చును. అటులైనచో దీనివిషయమై చికాకుచెందకుము. అది నీకు త్వరలోనే బోధపడును.

వ్యవసాయమువలన తాత్కాలికోపయోగమునకంటె నెక్కువ లభింపవీలయ్యెననియు, ఈమిగత పదార్థములు నిలువచేయబడెననియు, గ్రహించిన చాలును. ఆరోజులలో బ్యాంకులుగాని ధనముగాని (నాణెములరూపమున) లేవు.

పశువులు, గొర్రెలు, ఒంటెలు ధాన్యము మొదలగునవి యెవరివద్ద నెక్కువగ నుండెనో వారు ధనికులుగ పరిగణింప బడుచుండిరి.

## 15

### కులపెద్ద ఆరంభము

నా లేఖలంతకంతకు క్లిష్టమగుచున్న వేమోయని నాకు భయముగనున్నది కాని మన నావరించియున్న జీవితమంతయు క్లిష్టమైనదే. చాల పూర్వకాలమున జీవితము సులభముగా నుండెను. ఇపుడు మనమాలోచించుచున్నది క్లిష్టసమస్య లారంభమైన తర్వాత కాలము మనము నిదానముగ పరిశీలించి జీవితమునందును సంఘమునందును క్రమముగ నేర్పడిన మార్పులను గమనించినచో ప్రస్తుతపు సమస్యల నెన్నిటినో సులభముగా నవగాహనము చేసికొనగలము. మనమట్లు చేయనిచో మన చుట్టును జరుగుచున్న చాలవిషయములను గ్రహింపలేము. అడవిలో దారితెన్నులు తెలియని చిన్నపిల్లలరీతి నుందుము. అందుచేత తిన్నగా నాయడవిచివరకు నిన్ను దీసికొనిపోయిన, నచట సరియగు మార్గమును వెదుకవీలగునని నాయభిప్రాయము.

మసోరీలోనున్నపుడు నీవు రాజులనగా నెవరో, వారు రాజులెట్లయిరో, ఈ మొదలగు సంగతుల నడిగియుంటివని

నీకు జ్ఞాపకముండవచ్చును. రాజులారంభమైన యాపూర్వపు రోజులనుగూర్చి కొద్దిగ నిపుడు తెలిసికొన యత్నింతము. తొలుత వారికి రాజులని పేరులేదు కాని వారినిగూర్చికొంత తెలిసికొన్నచో రాజులని పేరులేదు కాని వారినిగూర్చికొంత తెలిసికొన్నచో రాజులయుత్పత్తి మనకు స్పష్టమగును.

తెగలెట్లేర్పడినవో యిదివరకు చెప్పియుంటిని. వ్యవసాయ మారంభమై వ్యాపారవిభాగ మేర్పడిన పిదప అవసరమైనపన్నుల నన్నిటిని క్రమమార్గమున నడపించువాడొక డుండవలసివచ్చెను. వీనికి పూర్వముగూడ నొక తెగకు మరియొక తెగతో జరుగుచుండిన యుద్ధములలో నాయకుడొకడుంట యవసరమయ్యెను. తరచుగ నొక తెగలో వయస్సున పెద్దవాడే నాయకుండగుచుండెను. అతనిని మనమిపుడు కులపెద్దయనుచున్నాము. వయోవృద్ధుండగుటచే నాతడు సహజముగ జ్ఞానవృద్ధుడుగ నుండుననియు, ననుభవశాలిగ నుండుననియు, నభిప్రాయముండెను. తెగలో నుండిన మిగిలినవారికిని కులపెద్దకును ఎక్కువ భేదము లేకుండెను. అతడుగూడ మిగిలినవారితో కలసిపాటుపడుచుండెను. సేకరించిన యాహారమందరును పంచుకొనుచుండిరి. సమస్త పదార్థములును తెగ మొత్తముపై నందరకును చెందియుండెను. ఇప్పటివలెనే ఎవని మట్టుకువానికి ప్రత్యేకముగ నిల్లు, ధనము, ఆస్తి మొదలగునవి లేవు. ప్రతిమనుజుడు డార్జించినదియు తెగలో నందరును సంచుకొనుచుండిరి. కులపెద్ద

తెగకు సంబంధించిన కార్యనిర్వాహకు డగుటచే నాతడీ విభాగమును చేయుచుండెను.

కాని క్రమముగ మార్పులెక్కువయ్యెను. వ్యవసాయమునకు సంబంధించిన పను లెక్కువగుటచే ఆగలో నందరును క్రమముగ పాటుపడునట్లు చేయుటలో కులపెద్ద యెక్కువకాలము గడుపవలసివచ్చెను. క్రమక్రమముగ కులపెద్ద మామూలుగ నందరును పనిచేయు పనులను మానివేయజొచ్చెను. ఇట్లితనికిని మిగిలినవారికిని తేడాయేర్పడజొచ్చెను. ఇపుడు మరియొకవిధమగు వ్యాపారవిభాగము ఆరంభమయ్యెను. కులపెద్ద కార్యనిర్వాహణము చేయుచు ప్రజలపై నధికారము చేయుచుండెను. మిగిలిన ప్రజలు పొలములలోపనులు, వేటాడు యుద్ధములు మొదలగునవి చేయుటలో గుంపునాయకుడగు కులపెద్ద యధికారమింకను ఎక్కువయ్యెను. ఏలయన నాయకుడులేనిదే యుద్ధము బాగుగా చేయ వీలుండదు. అందుచే కులపెద్ద మహాబలవంతుడయ్యెను.

కార్యనిర్వాహణ మెక్కువైనకొలదిని దానికి సంబంధించిన కార్యముల నన్నిటిని కులపెద్దయొక్కడును చేయలేకపోయెను. తనకు సహాయులుగ మరికొందరి నతడు నియమింపసాగెను. ఇట్లు కార్యనిర్వాహకు లెక్కువైరి. గాని కులపెద్ద వారిలో ముఖ్యుడై యుండెను. తెగలో కార్యనిర్వాహకులు కొందరును, మామూలుగ పాటుపడువారు కొందరు నేర్పడిరి. ఇకమీదట ప్రజలందరును సమానమేయను భావముతగ్గి

తేడాలేర్పడ నారంభించెను. సామాన్యులపైన అధికారము చలాయించు కార్యనిర్వాహకులకు మామూలుపని చేయు ప్రజలు విధేయులుగ నుండిరి.

కులపెద్ద పలుకుబడి యింక నెట్లు అభివృద్ధి బొందెనో ముందు లేఖలో పరికింతము.

# 16

## కులపెద్ద, ఆతని ప్రాధాన్యపు అభివృద్ధి

పూర్వకాలపు తెగలనుగూర్చియు, వారి కులపెద్దలను గూర్చియు నేను చేయుచున్న వర్ణన నీకు విసుగు కల్గించుట లేదనుకొందును.

ఆరోజులలో ప్రతివస్తువును తెగమొత్తముపై చెంది యుండెననియు ప్రత్యేకవ్యక్తులకు చెందియుండ లేదనియు క్రిందటి లేఖలో చెప్పియుంటిని. కులపెద్దకుగూడ ప్రత్యేకపు ఆస్తి యేమియు లేదు. తెగలో జేరిన యొకడగుటచే మిగిలిన వారివలెనే అతనికి ఒకభాగముండెను. కాని యతడు కార్య నిర్వాహకుడుగ నుండి తెగయొక్క ఆస్తికి సంరక్షణకర్తగా కూడనుండెను. క్రమముగ నాతని యధికారము హెచ్చిన కొలదియు తెగకు చెందిన వివిధపదార్థములును ఆస్తియు తనవేగాని తెగవి కావను భావమాతనికి గల్గ నారంభించెను. లేక తెగకు నాయకుడగుటచే తెగకు తాను ప్రతినిధినని

తలపనారంభించెను. స్వంతమగు ఆస్తిని కల్గియుండు నభిప్రాయమెట్లేర్పడెనో దీనినిబట్టి మనకు తెలియుచున్నది ప్రస్తుత కాలమున మనమెల్లపుడును 'ఇదినాది' 'అదినీది' అని యనుచుందుము. కాని ఆదిమకాలముననుండిన తెగలిట్లు తలచుచుండలేదని నేనిదివరకే చెప్పియుంటిని అపుడు సమస్తమును తెగమొత్తము మీాదనే చెందియుండెను.

పూర్వకాలపు కులపెద్ద తానే తెగకు ప్రతినిధిననితలచుటచే తెగకు చెందినవస్తువులు తనవేయని భావింపనాగెను కులపెద్ద చనిపోయినపుడు తెగలోని వారందరును సమావేశమై మరియొకనిని తమనాయకునిగ నెన్నుకొనిరి. సాధారణముగా కులపెద్ద కుటుంబమునకు జెందినవారు మిగిలినవారికంటె కార్యనిర్వాహణమును బాగుగ తెలిపియుండిరి. వారెల్లపుడును కులపెద్ద సమీాపముననుండుటచే నాతనికిసహాయము చేయుచు నాపనియంతయు తెలిసియుండిరి. కనుక నొక కులపెద్ద చనిపోయినపుడు తిరిగి యతనికుటుంబమునకు జెందిన మరియొకనిని కులపెద్దగ నెన్నుకొనుచుండుట తటస్థించెను. క్రమముగ కులపెద్దకుటుంబము మిగిలిన వారినుండివేరై యాకుటుంబమునుండియే నాయకుని యెన్నుకొనుట సంభవించుచుండెను. కులపెద్దకమితమగు బలముండెను. సహజముగతన తర్వాత తనకుమారుడుగాని సోదరుడుగాని కులపెద్దకావలెనను కోరిక ప్రతికులపెద్దకును ఉండెను.కనుక తనకుమారునికి

గాని, సోదరునకుగాని, మరియొక దగ్గరబంధువునకుగాని, తగిన తరిఫీను నొసంగుచుండెను. తానెంచుకొని తరిఫీను చేసిన వ్యక్తినే తనపిదపనాయకునిగ నెన్నుకొనవలెనని కులపెద్ద చెప్పుచుండెను. మొదటిరోజులలో తెగలోనివారి కిట్టిపద్ధతి యిష్టము లేకపోయినను క్రమముగ వారందరు కలవాటుపడి పోయిరి. క్రొత్తకులపెద్ద నెన్నుకొను నవసరము క్రమముగ తగ్గిపోయెను. ఏలయన నాతఁడందులకు ! పూర్వమే నియోగింపబడియుండెను.

ఇట్లు క్రమముగ కులపెద్దపదవి వంశపరంపరాగత మయ్యెను. అనగా నొకేకుటుంబమున తండ్రిపిదప కుమారులుగాని, దగ్గరబంధువులుగాని ఆపదవి పొందుచుండి ఇప్పటికి తెగకుజెందిన యావదాస్తియు కులపెద్దదేయని స్థిరపడెను. అతనిమరణానంతరముగూడ నాయాస్తి తనకుటుంబములోనే యుండెను. 'నాది', 'నీది' యనుభావ మెట్లేర్పడినదో దీని వలన తెలియుచున్నది. ఆరంభకాలమున నిట్టియభిప్రాయములు లేవు. జనులందరును తెగయొక్క మొత్తములాభము కొరకే పాటుపడుచుండిరిగాని, స్వలాభమునకుగాదు. వారుత్పత్తి చేసిన పదార్థములన్నిటిని తెగలోనివారందరును పంచుకొనుచుండిరి. తెగలో ధనికులు, బీదలు ననుభేదము లేకుండెను. తెగయొక్క యాస్తిలో నందరును భాగస్వాములుగనుండిరి.

కులపెద్ద తెగకుసంబంధించిన యాస్తిని కాజేయుట కారంభింపగనే భాగ్యవంతులు, బీదలు అను తేడా ఏర్పడ సాగెను.

దీనినిగూర్చి మరికొన్ని యంశములు ముందు లేఖలో చెప్పగలను.

## 17

### కులపెద్ద రాజుగ మార్పుచెందుట

పూర్వకాలపు కులపెద్దతో మనము చాలకాలము గడపివేసితిమి కాదా? త్వరలోనే యతనినిగూర్చి ముగింతము. అతడు నామాంతరము పొందగలడు. రాజు లెట్లేర్పడిరో నీకు చెప్పదలచి యీ విషయమెత్తుకొంటిని. రాజులనుగూర్చి తెలిసికొనుటకు కులపెద్దనుగూర్చి చెప్పవలసివచ్చినది. ఈకుల పెద్దలే తుదకు రాజులును మహారాజులు నైరని నీవూహించి యుందువు. కులపెద్ద (ఇంగ్లీషులో **Patriarch**) యను పదము 'ఇంటియజమాని' 'తండ్రి' 'పిత' అనుపదములకు సంబంధించినది. పేటర్ అను లేటిను పదము కూడ నీసందర్భమునకు వర్తించునదే. పేట్రా అన నిదేయర్థమని నీకు తెలియును. సంస్కృతములోను, హిందీలోను, మనస్వదేశమును 'మాతృభూమి' యందుము. స్వదేశమును 'పితృభూమి' యనుట బాగున్నదా? మాతృభూమియనుట బాగున్నదా!

కులపెద్దపదవి వనింపరంపరానుగతమగుటతోడనే రాజునకును కులపెద్దకును భేదమేమియులేదు. కులపెద్దయే రాజుగమార్పు చెందెను.

దేశమునందలి ప్రతివస్తువును తనదేయను చిత్రమగు నభిప్రాయము రాజునకు గల్గెను. తుదకు రాజు దేశమనగా తానేయనితలచెను. ప్రసిద్ధుడగు నొకఫ్రెంచిరాజు రాజ్యాంగ మనగా 'నేనే' యని నొక్కివక్కాణించెను. కార్యనిర్వహణ మునకును దేశమునందలి పదార్థములను ప్రజలకు పంచుటకు ప్రజలచే తామెన్నుకొనబడినవారమని రాజులుమరచిపోయిరి తమ తెలివితేటలను, అనుభవమునుబట్టి ప్రజలు తమ్మెన్నుకొనిరని వారికి జ్ఞప్తియందు లేకపోయెను. చివరకు తాము యజమానుల మనియు, ప్రజలందరు వారిసేవకులనియు, భావింపదొడగిరి. యదార్థముగజూచిన రాజులే ప్రజలసేవకులు.

ముందుముందుచరిత్ర చదివినకొలదియు రాజు లహంభావపూరితులై ప్రజలు తమ్మెన్నుకొనుట యెన్నడును జరిగియుండలేదనియు, భగవంతుడే తమ్మురాజులుగా సృష్టించెననియు చెప్పసాగిరి. దీనిచే వారు 'రాజులు భగవదంశ సంభూతులు' అని వాదింపదొడగిరి. చాలకాలమువరకు వారిట్లు అక్రమముగ ప్రవర్తించుచు నెక్కువ యాడంబరముతోను విలాసములతోను కాలము గడుపుచు తమప్రజలు తిండిలేక

మాడుచున్న సంగతి గమనింపకపోయిరి. తుదకు బ్రిటిషునిసామా న్యప్రజలు భరింపలేక కొన్ని దేశములలో రాజులను వెడల గొట్టిరి. ఇదియంతయు ముందుముందు నీవు చదువగలవు. ఇంగ్లండు దేశపుప్రజలు మొదటి ఛార్లెసు రాజుపై తిరుగబడి యాతనినోడించి హత్యచేసిరనియు ఫ్రెంచిప్రజ లొకగొప్ప విప్లవముజరిపి యికమీదట రాజులవసరము లేదని నిర్ణయించి రనియు నీవు తెలిసికొందువు. మనము పారిస్ నగరములోని కాన్సర్గెరి యనుఖైదునుచూచినమాట నీకు జ్ఞాపకముండ వచ్చును ఆఖైదునుచూచినప్పుడు నీవునుకూడ నుంటివా? ఈ ఖైదులో రాజుకుటుంబములోనివారును, అతనిభార్యయగు మేరీఅంటాయినటి మొదలగువా రందరు నుంచబడిరి. కొద్ది రోజుల క్రిందటనే రష్యాప్రజలు విప్లవముచేసి తమరాజగు జారును తరిమివేసిన సంగతిగూడ నీవు చదువగలవు.

కనుక రాజులొకప్పుడుచ్ఛస్థితిలో నుండిరిగాని ప్రస్తుతము చాలదేశములలో రాజులులేరు. ఫ్రాన్సు, జర్మనీ, రష్యా స్విట్జర్లండు. అమెరికాలోని దేశములు, చీనా మొదలగు చాల దేశములకు రాజులులేరు. ఇవి ప్రజారాజ్యములు. అనగా సామాన్యప్రజలు తమపరిపాలకులను, నాయకులను, అప్పు డప్పుడు యెన్నుకొనుచుందురు. ఈపరిపాలకులును, నాయకు లును, వంశపారంపర్యమగు హక్కుగలవారుకారు.

ఇంగ్లండు దేశములో రాజున్నాడుగాని అతని కధికార మేమియు లేదు. అతడు స్వయముగా చేయకలిగినది చాల తక్కువ. ప్రజానాయకులసభయగు పార్లమెంటునకే అంత యధికారమును గలదు. లండనులో పార్లమెంటునుచూచిన సంగతి నీకు జ్ఞాపకమున్నదనుకొందును.

మన దేశములో నింకను రాజులు, మహారాజులు, నవాబులు చాలమంది గలరు. వారు విలువగలదుస్తులను ధరించి ఖరీదైన మోటారు కార్లలో తిరుగుచు చాలధనమును స్వంత ఖర్చునకై వినియోగించుచుండుట నీవుచూచియుందువు. ఈధన మంతయు వారి కెక్కడినుండి వచ్చుచున్నది?

దానిని వారు ప్రజలవద్దనుండి పన్నులమూలమున వసూలు చేయుచున్నారు. పాఠశాలలు, ఆసుపత్రులు, గ్రంథాలయములు, మ్యూజియములు, మంచిబాటలు మొదలగు ప్రజోపయోగ కార్యములకై పన్నులీయబడుచున్నవి. కాని మన రాజులలోను మహారాజులలోను చాలమంది వెనుక నేను చెప్పిన ఫ్రెంచి రాజువలెనే 'రాజ్యాంగమన మరెవరు? నేనే' అని భావించుచున్నారు రాజులిట్లు భోగములతో కాలముగడుపుచుండ చెమటయూడ్చి వారికి ధనమిచ్చు వారి ప్రజలు తిండి లేక మలమలమాడుచున్నారు. ప్రజలపిల్లలు చదువుకొనుటకు తగినన్ని పాఠశాలలు లేవు.

# 18

## ఆదిమనాగరికతలు

కులపెద్దలనుగూర్చియు, రాజులనుగూర్చియు, చాల వరకు చెప్పుకొనియుంటిమి. కొంచెము వెనుకకుపోయిఆదిమ నాగరికతలను గూర్చియు నాకాలపు ప్రజలనుగూర్చియు నాలోచింతము.

ఈయాదిమ ప్రజల విషయమై మనకంతగా తెలి యదుగాని పూర్వ నవీన శిలాయుగపు ప్రజలకంటెమాత్రము వీరిని గూర్చి చాలసంగతులు తెలియును. వేలకొలది యేండ్ల కు పూర్వము నిర్మింపబడిన బ్రహ్మాండమగు కట్టడముల శిథి లము లిప్పటికినిగలవు. ఆకట్టడములను, దేవాలయములను, భవనములనుచూచి యాదిమప్రజ లెట్లుండిరో వారెట్లుసంచ రించుచుండిరో తెలిసికొనగలము. ఆ ప్రాచీన కట్టడములందలి ప్రతిమలును చెక్కడములును మనకు విశేషముగ తోడ్పడు చున్నవి. ఈప్రతిమలవలన నాకాలపుప్రజ లెట్టిదుస్తులను ధరించుచుండినదియు ఇంక ననేకవిషయములును తెలియు చున్నవి.

మానవులు మొట్టమొదట నెచట స్థిరనివాస మేర్ప రచుకొని నాగరికతాభివృద్ధి జేసిరో నిశ్చయముగా జెప్పలేము అట్లాంటిక్ మహాసముద్రములో నిపుడు అట్లాంటిసు అని పిలువబడుచున్న యొకగొప్పదేశ ముండెనని కొందరు చెప్పు చున్నారు.

ఈ దేశములోని ప్రజలు గొప్పనాగరికత కల్గి యుండి రనియు, నా దేశము తరువాత కొంత కాలమునకు అట్లాంటికు మహాసముద్రములో మునిగిపోయెననియు నప్పుడందులో గొంచెముకూడ మిగిలియుండలేదనియు చెప్పుచున్నారు. దీని కేమియు ఋజువులేదుగాని కొన్నికథలుమాత్రముగలవు. కనుక దీనినిగూర్చి యంతగ నాలోచింపనక్కర లేదు.

పూర్వకాలములో అమెరికాయందు గొప్పనాగరికత లను వృద్ధిచేసిన జనులుండిరని కొందరు చెప్పుదురు. అమెరి కాను కొలంబసు కనిపెట్టెనని చెప్పుట నీకు తెలియును. కోలంబసు వెళ్ళక పూర్వము అమెరికా లేదని యర్థముగాదు. కొలంబసు చూడకముందు అమెరికానుగూర్చి ఐరోపాప్రజ లకు తెలియదని దీనియభిప్రాయము. కొలంబసు అచటికి వెళ్ళుటకు చాలపూర్వమే అచట ప్రజలునివసించుచు కొంత నాగరికతనుగల్గి యుండిరి. ఉత్తర అమెరికాలోనున్న మెక్సి కోయందలి యకటానులోను, దక్షిణమెరికాయందలి పెరూ లోను ప్రాచీనభవనముల శిధిలములుగలవు. చాలప్రాచీన కాలమునందే యుకటానులోను, పెరూలోను నాగరికతగల ప్రజలు నివసించుచుండిరని నిశ్చయముగ జెప్పగలము. కాని వారినిగూర్చి ప్రస్తుతమింతకంటె నెక్కువ చెప్పలేము. కొంత కాలము తర్వాత మరికొన్ని సంగతులు బయటపడవచ్చును.

యూరేషియాయందు (యూరపు, ఆసియాలు. మెస పొటేమియా, ఈజిప్టు, క్రీటు, హిందూ దేశము, చీనా దేశము

లలో) ప్రాచీననాగరికతలు వృద్ధియైయుండును. ఈజిప్టు ఇపు డాఫ్రికాలోనిదైనను అది యూరేషియాకు చాలసమీపమున నుండుటచే వాటితో బాగుగనే దానినిగూర్చియు ఆలోచింప వచ్చును. దేశద్రిమ్మరులుగనుండిన పూర్వపు నాగరికులొకచోట స్థిరనివాసమేర్పరచుకొనదలచినచో సహజముగ నెట్టిప్రాంత ము నెంచుకొందురు? ప్రతిదినమును వారికాహారము దొరకు నట్టి ప్రాంతమును వారుచూచుకొందురు. వారికాహారము చాలవరకు వ్యవసాయమువలన లభించునదై యుండవలెను. వ్యవసాయమునకు నీరవసరము. నీరులేకపోయినచో పొల ము లెండిపోయి వానిలో నేమియుపండవు. వర్షకాలములో వానలు సరిగా పడనపుడు పంటలుపోయి కరవులు ఏర్పడునని నీకు తెలియును. బీదలకు తినుటకు తిండిలేక మాడిపోవుదురు. కనుక నీరు అత్యవసరము. అందుచే పూర్వకాలపు ప్రజలు నీరు సమృద్ధిగా దొరకు ప్రదేశములందే స్థిరనివాసము లేర్ప రచుకొనుచుండిరి. దీనికనేకములగు నుదాహరణములు కలవు. మెసపొటేమియాలో టైగ్రిస్, యూఫ్రటిస్ అను రెండు పెద్దనదులమధ్య కొందరు స్థిరపడిరి. ఈజిప్టులోవారికి నైలు నది గలదు. హిందూదేశములో ప్రాచీననగరములన్నియు సింధు, గంగా, యమునానదుల సమీపమున నుండెను. వారికి జల మత్యవసరమగుటచే వారి కాహారమును ఇతర పదార్థములను గలుగజేయు నదులను వారు పవిత్రముగ నెంచిరి. ఈజిప్టులో నైలునదిని అచటివారు 'నైలుతండ్రి'

యని పూజించిరి. హిందూ దేశములో గంగాభవానీ యెంత పవిత్రమైనదో నీకు తెలియును. ఆనదిని గంగమ్మతల్లి యని చెప్పు యాత్రికులు గంగమ్మతల్లికిజై యని కేకలిడుట నీవు వినియుందువు. ఈనదులు వారికనేకవిధముల నుపయోగించుటచే వారు వీని నంతపవిత్రముగ నెంచుకొనుటలో నాశ్చర్యము లేదు. నదులు వారికి నీటినేగాక, పొలములను సారవంతముగా జేయు నొండ్రుమట్టిని, యిసుకనుగూడ తీసికొనివచ్చుచుండెను. నదిలోని నీటిచేతను, మట్టిచేతను, వారికి సమృద్ధిగ నాహారము లభించుచుండెను. కనుక నదులు తండ్రి యనియు, తల్లియనియు పిలువదగియే యున్నవి. కాని తాము చేయుపనులకు కారణములను ప్రజలుక్రమముగామరచిపోవుదురు. అనాలోచితముగ నితరుల ననుకరించుచుందురు. నైలును, గంగయు నీటిని ఆహారము నొసగుటచే పవిత్రమైనదిగ భావింపబడెనని మనము జ్ఞప్తియం దుంచుకొనదగును.

## 19

### ప్రాచీనకాలపు మహానగరములు

నీరును, ఆహారమును, సమృద్ధిగనుండు పెద్దనదుల వద్దను సారవంతమగు మైదానము లందును ప్రజలారంభమున నివాసముల నేర్పరచుకొనుచుండిరని తెలిసికొంటిమి,

వారి పెద్దనగరములుగూడ నదీతీరములందే యుండెను. ప్రాచీననగరముల పేర్లను కొన్నింటిని నీవు వినియుందువు. మెసపొటేమియాలో బేబిలను, నినెవా, అస్సూరు మొదలగునవి యుండెను. ఇవన్నియు చాలకాలముక్రిందటనే నశించినవి. భూమియడుగున లోతుగా త్రవ్వినచో నొక్కొకప్పుడు వీనిశిథిలము లగుపడుచుండును. వేలకొలది యేండ్లలో నవి యిసుక, మట్టి, మున్నగువానిచే కప్పబడిపోయి వాటిజాడ తెలియకుండ బోయెను. కొన్నిచోట్ల కప్పబడినవానిపైననే క్రొత్తనగరములు వెలసినవి. ఈప్రాచీన పట్టణములనుగూర్చి తెలిసికొనగోరువారు లోతుగ ఖననముచేయగ నొక్కొకప్పుడొకదానిపై నొకటిచొప్పున ననేకనగరము లగుపడనారంభించెను. ఇవన్నియు నొకేకాలమున నొకదానిపై నొకటి యుండలేదు. ఒక్కనగరము వందలకొలది యేండ్లుండి, యందు తరతరములుగ కొందరు నివసించి యుండవచ్చును. క్రమముగా నచట ప్రజలుతగ్గి యది జనశూన్యముకాగా చివరకెవ్వరు నచటలేక ఆప్రదేశమంతయు పాడువడియుండును. ఇసుక, మట్టి మున్నగువానిచే నవి కప్పివేయబడెను. కొంతకాలమునకచట నగరముండినదన్న మాటయే ఎవరికిని తెలియకుండెను. వందలకొలది యేండ్లు గడచినపిదప మరి కొందరు క్రొత్తజనులచటికివచ్చి మరియొక క్రొత్తనగరమును దానిపై నిర్మించియుందురు. తిరిగి కొంతకాలమున కీనగరము కూడ పాడుపడి మట్టిచేతను ఇసుక చేతను కప్పబడియుండును.

ఇట్లొక్కొకప్పు డనేక నగరముల శిధిలము లొకదానిపై నొకటి కనపడుట తటస్థించును. ఇట్టిది ముఖ్యముగ నిసుక ప్రదేశములలో నెక్కువగ జరుగుచుండును. ఏలయన, నిసుక అన్నివస్తువులను త్వరగా కప్పగలుగును.

ఒకేచోట నగరముపిదపనగరము వెలసి ఆబాలగోపాలమునకును నిలువ నీడయొసగి కాలక్రమమున నవి నాశన మొందుట చిత్రముగ నున్నదిగదా! పూర్వపునగరములున్న చోటనే క్రొత్తది యుద్భవించి తిరిగి జనులచటికిచేరి నివసించుచుండిరి. కొంతకాలమున కవిగూడ జాడలేక నశించుచుండినవి. ఈనగరములనుగూర్చి నే నొకటిరెండు వాక్యములలో ముగించితినిగాని యవి వృద్ధిజెంది నశించి క్రొత్తనగరము లేర్పడుసరికి వేలదరబడి యేండ్లయి యుండును. ఒకమనుష్యునికి డెబ్బది యేండ్లుకాగానే అతనిని ముసలివాఁడందుము. కాని వేలకొలది సంవత్సరముల ముందర డెబ్బది యెనుబది యేండ్లు లెక్కయేమి! ఈనగరములు వెలసినకాలములో నెందరుపిల్లలు ముసలివారై చనిపోయి తిరిగి క్రొత్తవారు పుట్టి మరణించుచుండిరి. ప్రస్తుతము 'బేబిలన్, నినెవాలు' నామమాత్రావశేషములుగ యున్నవి.

సిరియాలోని డెమాస్కసు మరియొప్రాచీననగరము. కాని డెమాస్కసు నశింపలేదు. అది యిప్పటికిని మహానగరమైయున్నది. ప్రపంచమున నిప్పటికిగల నగరములలోనెల్ల డెమాస్కసే ప్రాచీనమైనదని కొందరి యుద్దేశము,

హిందూ దేశములోని ప్రాచీననగరములుగూడ నదీ తీరములందేయున్నవి. ఢిల్లీకి సమీపమున నుండిన ఇంద్రప్రస్థ మన్నిటిలోను పూర్వపు నగరము కాని యింద్రప్రస్థమిప్పుడు లేదు. కాశీనగరముకూడ నిప్పుడు ప్రపంచముననున్న ప్రాచీన నగరములలో నొకటియైయుండును. అలహాబాదు, కాన్పూరు, పాట్నా మొదలగు ననేక పట్టణములునదీతీరములందేయున్నవి. వానిని నీవే యూహింపవచ్చును. ప్రయాగ (అలహాబాదు) యు, పాటలీపుత్రమును (పాట్నా) కొంచెము పూర్వపువే యయునను అవియంత ప్రాచీనములుగావు.

# 20

## ఈజిప్టు క్రీటు

ప్రాచీన కాలమున గ్రామములందును పట్టణములందును నివసించుచుండిన ప్రజలెట్టివారు? వారు నిర్మించిన కట్టడముల నుండియు భవనములవలనను వారినిగూర్చి కొంత మనకు తెలియుచున్నది. వారువ్రాసిన శిలాశాసనములవలనగూడ కొంత తెలియుచున్నది. ఆ కాలపువిషయములను తెలుపుప్రా చీన గ్రంథము లనేకములుగలవు.

ఈజిప్టులోని పిరమిడ్లు (గోపురములు) స్ఫింక్సు, లుక్సా రువద్ద దేవాలయములు ఇట్టిప్రాచీనపుకట్టడము లిప్పటికిని గలవు. సూయజ్ కాలువద్వారా మనమువచ్చినప్పు డవి

సమీపముననే యుండినవిగాని నీవు వానిని చూడలేదు. వానిబొమ్మలు నీవు చూచియున్నావు. బహుశః వానిచిత్రములకార్డులు నీవద్ద నున్నవనుకొందును. స్ఫింక్సు అనునది స్త్రీశిరస్సుగల సింహము. అదిచాలబ్రహ్మాండమైనది. అది ఎందులకు నిర్మింపబడినదో' అది దేనినిచూపుట కుద్దేశింపబడినదో, ఎవరికిని తెలియదు స్త్రీముఖము చిరునవ్వు గలిగి యున్నది. ఈచిరున వ్వెందులకో యని ఆశ్చర్యమును గలిగించుచు. ఒక్కవ్యక్తిని స్ఫింక్సుతో పోల్చిన యావ్యక్తిస్వరూపస్వభావములు గ్రహించుట కష్టసాధ్యమని యర్థము.

పిరమిడ్లును బ్రహ్మాండమగు కట్టడములే. అవి ఈజిప్టులో పూర్వకాలమునం దేలినరాజులగు ఫేరోలసమాధులు. లండనులో బ్రిటీషుమ్యూజియమునందు ఈజిప్షియన్ మమ్మీలను చూచినసంగతి నీకు జ్ఞాపకమున్నదా? ఒకమనుష్యునియొక్కగాని జంతువుయొక్కగాని మృతకళేబరమునకుకొన్ని తైలములనుపూసి చెడిపోకుండనుంచిన నట్టిదానికి 'మమ్మీ' లని పేరు ఫేరోలు చనిపోయినపిదప వారి శవములను 'మమ్మీ'లుగ జేసి ఈబ్రహ్మాండమైన పిరమిడ్లలో (గోపురము) నుంచిరి. వాటివద్ద వెండిబంగారు ఆభరణములును, ఇతరమగు బంగారుసామానుల నుంచిరి. ఏలయన చనిపోయిన పిదపగూడ మనుజులకవి యవసర ముండునని యప్పటి ప్రజలు భావించిరి. రెండుమూడేండ్లక్రిందటటుటాన్ కామెన్ అను పేరుగల ఒక ఫేరోశవము ఈపిరమిడ్లలో కనబడెను.

ఆశవముదగ్గ నెన్నో అందమగు విలువగలవస్తువు లుండినవి. ఆరోజులలో ఈజిప్టులో వ్యవసాయపుపనులకొఱకు మంచి కాలువలను చెరువులను త్రవ్వించియుండిరి, 'మొరిడు' అను పేరుగలది చాలప్రసిద్ధమగు సరోవరము ప్రాచీనకాలపు ఈజిప్టుప్రజలెంత జ్ఞానాభివృద్ధి గలిగియుండిరోదీనివలన స్పష్ట మగుచున్నది. ఈపిరమిడ్లను, కాలువలను, సరోవరములను నిర్మించినవారు గొప్ప ఇంజనీర్లు అయియుందురు. క్రీటు లేక కేండియా యనబడు చిన్నద్వీపము మధ్యధరాసముద్రమున గలదు. పోర్టుసెడ్ నుండి వెనిసునకు వెళ్ళినపుడు మనము దాని దగ్గరనుండియే పోయియుంటిమి. ప్రాచీనకాలమున ఈ ద్వీపముపై గొప్పనాగరికత వెలసెను. క్రీటులో నాసాసునద్ద బ్రహ్మాండమగు భవనముండెను. దానిశిథిలము లిప్పటికని గలవు. ఈభవనములో స్నానశాలలు, నీటికుళాయిలు మొద లగునవిగలవు. లజ్ఞాను లిట్టివన్నియు కొద్దికాలముక్రిందటనే కనిపెట్టబడినవని తలంచుచున్నారు. చాలయందమగుపాత్రలు చిత్తరువులు, రంగుచిత్రములు, నాజూకగులోహపువస్తువులు దంతపుపనిముట్లుగూడ నపుడుండెను. ఈచిన్నద్వీపములో జనులు శాంతముగ నివసించుచు మిగుల నభివృద్ధిబొంది యుండిరి.

మైడాసు రాజుకథ నీవుచదివియున్నావు. తానుముట్టిన దంతయు బంగారముకావలెనని వరము పొందుటచే నత డెన్నియోచిక్కులలో పడెను. అతడు స్పృశించిన వెంటనే

ఆహారపదార్థములుగూడ బంగారమైపోవుచుండెను. బంగారము తినుటకు పనికివచ్చునా! అతనిదురాశచే నాతడిట్టిశిక్ష ననుభవించెను. ఇదియంతయు కట్టుకథయే. బంగారము మన మనుకొనునంత యుపయోగకరమైన వస్తువుకాదని చూపుటకే ఈ కథ కల్పింపబడెను.

క్రీటులోని మరియొకకథకూడ నీవుచదివియుందువు. సగము మనుష్యునను సగము ఎద్దుగానుండిన మినోటార్ అను రాక్షసునికథకూడ నట్టిదే. ఈరాక్షసునికిప్పుడు పిల్లలాహారమట. మనకు తెలియని ఒకానొకవస్తువు విషయమై మనకుగల్గు భయమే మతమునకు మూలమయ్యెనని ఇదివరలో చెప్పియుంటిని. ఇట్టిభయముచే ప్రకృతి మనచుట్టును జరుగు ననేకవిషయములను సరిగా గ్రహింపక ప్రజలు అనేకములగు తెలివితక్కువ పనులనుచేయ నారంభించిరి. బాలబాలికలను ఈకట్టుకథలోని రాక్షసునికప్పటి ప్రజలు బలియిచ్చియుందురు. ఇట్టిరాక్షసు డొకడుండెననుట నమ్మదగినవిషయము కాకపోవుటచేత నతనిని గూర్చినకథ కేవలము భ్రాంతిమయమే.

ప్రాచీనకాలమున ప్రపంచమం దంతటను నరబలులు సాగుచుండెను. తానునమ్మిన దేవతలనుపూజించుచు ఆదేవతల తృప్తికై ప్రజలు స్త్రీపురుషులను బలిగా నొసంగుచుండిరి. నైలుతండ్రికి ప్రీతిగల్గించుటకై ఈజిప్టులోని ప్రజలు బాలికల నానదిలో విసరివేయుచుండిరట.

ప్రపంచమున నెచ్చనో నూరుమూలలందేగాని నర బలు లిప్పుడు తరుచుగ జరుగకపోవుట యొకవిశేషమే కాని యిప్పటికి దేవతాప్రీతికై జంతువులను బలియిచ్చుట గలదు. ఇట్టిపూజలు చాలచోద్యమయినవిగదా!

## 21

### చీనా హిందూదేశము

ప్రాచీన నాగరికతలు మెసపొటేమియా, ఈజిప్టు, మధ్యధరాసముద్రములో చిన్నద్వీపమగు క్రాటు మొదలగు చోట్ల వృద్ధిచెందెనని తెలిసికొంటిమి. ఆసమయముననే చీనాలోను, హిందూదేశములోను గొప్ప నాగరికతలు వెలసెను.

మిగిలినచోట్లవలెనే చీనాలోగూడ ప్రజలు నదీమైదానములందె స్థిరనివాసము లేర్పరచుకొనిరి. వీరికే మంగోలియనులనిపేరు. వీరు కంచుతోను, ఇనుముతోను పాత్రల జేయుచుండిరి. కాలువలును కట్టడములును నిర్మింపబడెను. వ్రాతలో నొకక్రొత్తపద్ధతికూడ నేర్పడెను. హిందీ, ఇంగ్లీషు, ఉర్దూవ్రాతలకును దీనికిని భేదముగలదు. అదియొక విధమగు చిత్రలేఖనము. దీనినిపుడు హేయిరోగ్లిఫిల్ వ్రాతయందురు. ఇట్టి వ్రాతను మ్యూజియములలోను కొన్ని పుస్తములందును నీవు చూచియుందువు. ప్రతిపదమును చిన్నవాక్యము

లను, బొమ్మలమూలముననే వ్రాయబడుచుండెను. ఈజిప్టు, క్రాటు, బెబిలోనియాలలోగూడ నిట్టిచిత్ర లేఖన విధాన ముండెను. ప్రస్తుతము ఈజిప్టులోను, కొన్ని పాశ్చాత్య దేశములలోను ప్రాచీనపు కట్టడములలోనిది యిప్పటికిని కన్పడుచున్నది. కాని ఇట్టిలిపి యచటను చాలకాలమువర కుండ లేదు. చీనాలో నిప్పటికిని యిట్టి చిత్రలేఖనమే గలదు. హిందీలోవలె ఎడమనుండి కుడికి గాని, ఉర్దూలోవలె కుడి నుండి ఎడమకుగాని గాక చీనాయక్షరము లొకదానిక్రింద నొకటి వ్రాయుదురు. హిందూదేశములో ప్రాచీనపుకట్టడముల శిథిలము లనేకములు మట్టిలో పూడ్చబడియున్నవి. ఎవరైనను త్రవ్వువరకు నవి మరుగుపడియుండును. అట్టి ప్రాచీన శిథిలములు కొన్నియుత్తరహిందూదేశమున కన్పడినవి. ఆర్యులు హిందూదేశమునకు వచ్చుటకు చాలకాలమునకు పూర్వమే 'ద్రావిడులు' అను జాతివారిచ్చటనుండిరనియు వారి నాగరికత గొప్పదిగ నుండెననియు గూడ మనకు తెలియుచున్నది. వారితర దేశపు ప్రజలతో వ్యాపారముచేయుచుండిరి. వారు మెసపొటేమియా. ఈజిప్టులకు చాల సరకులు పంపుచుండిరి. ఓడలలో బియ్యమును, మిరియములవంటి సుగంధద్రవ్యములను, టేకుకలపను వారు పంపుచుండిరి. మెసపొటెమియాలోని ఉర్ నగరములోని ప్రాచీన భవనము లెన్నియో దక్షిణ హిందూదేశమునుండి పంపిన కలపతో నిర్మింపబడినవి. బంగారము, ముత్యములు.

దంతములు, నెమళ్ళు కోతులునుగూడ హిందూదేశమునుండి పశ్చిమదేశములకు పంపబడినట్లు తెలియుచున్నది. ఆరోజులలో హిందూదేశ మితరదేశములతో నెక్కువ వ్యాపారము జరుపుచుండెనని దీనివలన స్పష్టమగుచున్నది. నాగరికతగల ప్రజలే వ్యాపారము జరుపగలరు.

హిందూదేశములోను;చీనాలోనుగూడ నప్పుడుచిన్న చిన్న రాజ్యములుండెను. ఈదేశములలో నేదియు నొకేప్రభుత్వముక్రింద నుండలేదు. కొన్నిగ్రామములును, భూములును కలసి యొక్కొక్క నగరముగ నేర్పడి ఆనగర మొక్కొక్క ప్రభుత్వముక్రిందనుండెను. వీనికే నగర రాజ్యాంగములని పేరు. ఆప్రాచీన దినములలోగూడ వీనిలో చాలవరకు ప్రజారాజ్యములుగ నుండెను. ఆరోజులలో రాజులు లేరు. ఈరాజ్యాంగములు ప్రజలచే నెన్నుకొనబడిన పంచాయితీలచే పాలింపబడుచుండెను. వానిలో కొన్ని చిన్నరాజ్యములుగూడ నుండెను. రాజ్యాంగములకు ప్రత్యేక ప్రభుత్వము లున్నప్పటికిని ఒకదానితో నొకటి సహకారమునందుచు పరస్పరసహాయము చేసికొనుచుండెను. ఒక్కొక్కపుడొక పెద్దరాజ్యాంగములు కొన్ని చిన్ని రాజ్యాంగములకు కలసి నాయకస్థానముపొందుచుండెను.

చీనాలో కొలదికాలములోనే ఈచిన్న సంస్థానములన్నియుపోయి యొకపెద్దసామ్రాజ్య మేర్పడెను. ఈసామ్రాజ్యముండిన కాలమునందే చీనాదేశపు సరిహద్దులో బ్రహ్మాం

డమగు గోడ నిర్మింపబడెను. ఈగోడ యెంతబ్రహ్మాండమైన దో నీవు ఇదివరకు చదివియున్నావు. ఇతర మంగోలియను ప్రజల దాడినాపుటకై యీగోడ సముద్రమునుండి యుత్తర మునను పర్వతములవరకు నిర్మింపబడినది. దీనిపొడవు 1,400 మైళ్ళు; 20 మొదలు 30 అడుగులవర కెత్తు; 25 అడుగులవెడల్పు, అచ్చటచట కోటలును బురుజులునుగలవు. హిందూదేశములో నట్టిగోడ కట్టబడినచో నది లాహోరు నుండి మద్రాసువరకు వ్యాపించును. ఈగోడ యిప్పటికిని గలదు. చీనా వెళ్ళినచో నీవు చూడవచ్చును.

## 22

### సముద్రయాత్రలు; వ్యాపారము

ప్రాచీనకాలమున మరియొక చిత్రమగు జాతికిజెందిన ఫినీషియనులు. వారు యూదు అరబ్బుజాతికి జెందిన వారు. వారు చిన్న ఆసియాలో పడమటిభాగమున ఇప్పటి టర్కీలో నివసించియుండిరి. మధ్యధరాసముద్ర తీరములోని ఏకరు, టైరు, సిడోను మున్నగునవి వారి ముఖ్యపట్టణములు వారు సముద్రయాత్రలకును వ్యాపారమునకును పేరుపొందిన వారు. వారు మధ్యధరాసముద్ర మంతటిలోను తిరిగి యింగ్లండువరకుగూడ బోయియుండిరి. హిందూదేశమునకుగూడ వచ్చి యుందురు.

సముద్రయానము, వ్యాపారము అను రెండు ముఖ్య విషయములు లిపుడారంభమయ్యెను. ఇవి రెండును పరస్పర సహాయముతో వృద్ధిజెందెను. ఇప్పటివలె మంచిపొగయోడలు మొదలగునవి అపుడు లేనిమాట నిజమే అప్పటిపడవలు చెక్కబడిన చెట్లమ్రానులచే నేర్పడినవై యుండెను తెడ్లను తెరచాపలు నుపయోగింపబడుచుండెను. ఆరోజులలో సముద్రయానము చోద్యముగను, మనస్సునకు కలవరము గల్గించునదిగను వుండియుండును. అరేబియా సముద్రమును తెడ్లను, తెరచాపయుగల పడవపై దాటుట ఎట్లుండునో ఊహింపుము. దానిలోని స్థలములు చాల యిరుకుననుండి యెంతచిన్నగాలికైనను అది యటునిటు నూగులాడుచు తరచుగ మునిగిపోవుచుండెను. సాహసవంతులే సముద్రయానమపుడు చేయగల్గియుండిరి; ప్రయాణము ప్రమాదభూయిష్ఠముగనుండెను. ఒక్కొక్కపుడు నెలలదరబడి నేలయే కనపడకుండెను. నడిసముద్రములో నాహారపదార్థము లయిపోయిన చేపలనైన పట్టవలెను; పక్షిని దేనినైన పట్టుకొనవలెను. సముద్రము సాహసకృత్యములకు మంచియవకాశము కల్పించుచుండెను. పూర్వకాలమున నావికుల వింత చర్యలనుగూర్చియు, చిత్రసంఘటనలగూర్చియు నెన్నియో కథలు గలవు.

ఆకాలమున ఇన్నిప్రమాదము లున్నప్పటికిని సముద్రయానమును ప్రజలుచేయుచునే యుండిరి. కొందరు కేవలము

సాహసకార్యములందలి యభిలాషవలననే సముద్రప్రయాణము చేసిరి; కాని చాలమంది బంగారమును, ధనమును సంపాదింప వచ్చునని బయలుదేరుచుండిరి. వస్తువుల నమ్ముకొనుచు వ్యాపారముచేసి ధనము గడించుచుండిరి.

వ్యాపారమననేమి? అది యెట్లారంభమయ్యెను? ప్రస్తుతము పెద్దయంగడు లనేకమైనవిగలవు; వానిలోనికిబోయి కావలసినవి కొనవచ్చును. కాని నీవు కొనువస్తువు లెచ్చట నుండి వచ్చుచున్నవో నీవెప్పుడైన యోచించితివా? అలహాబాదులో నీవొక ఉన్ని శాలువను కొంటివనుకొనుము. అది చాలదూరమునయున్న కాశ్మీరదేశమునుండి వచ్చియుండవచ్చును. దానియున్ని కాశ్మీరముతోని పర్వతములమీదనడవులలోనున్న గొర్రెలమీదిదై యుండును. నీవుకొను పండ్లపొడి సీసా అమెరికానుండి రైళ్ళలోను, స్టీమర్లమీదనువచ్చియుండును. అట్టి చీనాలోగాని, జపానులోగాని, పారిసులోగాని, లండనులోగాని తయారైన వస్తువులు నీవుకొనుచుందువు ఇచట బజారులో నమ్మె ఒకచిన్నవిదేశపు బట్టను గూర్చి యాలోచింపుము. మొదట హిందూదేశములోపండిన ప్రత్తి ఇంగ్లండుకు పంపబడుచున్నది. అచట నొకయంత్రాలయములో నది శుభ్రపరుపబడి నూలుగా వడుకబడి బట్టగా నేయబడుచున్నది. ఈ బట్టతిరిగి హిందూదేశమునకు పంపబడి యిచట బజారులో నమ్మబడుచున్నది. అమ్మకమునకు సిద్ధమగుసరికి అది యటు నిటు ఎన్ని వేలమైళ్ళు ప్రయాణముచేసి

నదా! హిందూదేశములో పండిన ప్రత్తి బట్టగా తయారగు
టకు అంతదూరముననున్న ఇంగ్లండువరకుపంపి తిరిగి తెప్పిం
చవలసివచ్చుట చాల తెలివి తక్కువతనముగ గన్పడు
చున్నది. దీనివలన చాలవ్యయప్రయాసలు కలుగుచున్నవి.
హిందూదేశములోని ప్రత్తి నిచటనే బట్టగానేయుట చాల
చౌకయేగాక చాలమంచిపద్ధతిగగూడ నుండును. మనము
విదేశపుబట్టలను కొనము, కట్టము అని నీవెరుగుదువు.
సాధ్యమైనంతవరకు మనదేశములో తయారైన వస్తువులనే
వాడుట తెలివితేటలతోగూడిన పనియగుటచేతనే మనము
ఖద్దరుధరించుచున్నాము. అంతేగాక ఖద్దరుధరించుటకు మరి
యొక కారణముగలదు. ఖద్దరుకొనుటచే మనదేశములో
నూలు వడకి బట్టలునేసి జీవించు బీదవారికి మనము కొంత
సహాయము చేయగల్గుచున్నాము.

వర్తకమనునదెంత క్లిష్టవిషయమో నీవిపుడు గ్ర
హించియుందువు. ఈకాలమున ఒకదేశమునుండి మరియొక
దేశమున కెప్పుడును ఓడలు సరకులను మోసికొనిపోవుచున్న
విగాని పూర్వమట్లుకాదు.

మానవుడు స్థిరనివాస మేర్పరచుకొనిన యారంభపు
దినములలో వర్తకమనునదివిశేషముగ లేకుండెను. మనుజున
కవసరమైనవస్తువులను తానే స్వయముగ తెచ్చుకొనవలె
ను; లేక తయారుచేసికొనవలెను. అప్పటిరోజులలో మాన
వునకు కావలసినవస్తువు లెక్కువలేవు. పిదపనొక్కొక్క తెగ

గలోను వ్యాపారవిభాగ మేర్పడెను. ప్రజలు వేర్వేరుకార్యములనుచేయుచు వివిధమగువస్తువులను తయారుచేయ నారంభించిరి. ఒక్కొక్కప్పు డొక తెగవద్ద నొకపదార్థము సమృద్ధిగనుండగా మఱియొక తెగవద్ద మరియొకపదార్థము యెక్కువగానుండియుండవచ్చును. అప్పుడు వారాపదార్థములనుఒకరినుండియొకరు మార్చుకొనుట సహజముగాజరిగియుండును. ఉదాహరణకు ఒక తెగ మరియొక తెగ కొకఆవునిచ్చి, ఒకబస్తాధాన్యము తీసికొనియుండవచ్చును. ఆరోజులలో ధనము నాణెములరూపమున లేదు. పదార్థములు ఒకరినుండి మరియొకరు మార్చుకొనుచుండిరి. ఇట్లే మారకమారంభమయ్యెను. అది ఆరంభములో కొంతచిక్కగనే యుండెను. ఒకబస్తాధాన్యము కొరకు కొకయావునో, లేక రెండుగొర్రెలనో మోసికొనిపోవలసియుండెను. ఇట్టికష్టమన్న నువర్తకముృద్ధిజెందును.

బంగారమును వెండిని కనుగొన్న పిదప ప్రజలు వ్యాపారమునకై వానినుపయోగింపసాగిరి. వీనిని మోసికొని పోవుట సులభము. క్రమముగా బంగారమును, వెండినిచ్చి వస్తువులనుకొను నాచార మేర్పడును. ఈసంగతి మొట్టమొదట తెలిసికొన్నవాడు చాల బుద్ధిమంతుడై యుండవలెను. బంగారమును వెండియు వర్తకమునుచాలసులభముగ జేసెను అప్పటికిని నేటివలె నాణెములులేవు. బంగారమును త్రాసులోతూచియిచ్చుచుండిరి. చాలకాలము పిదప నాణెము లేర్పడెను. వీనివలన వ్యాపారమును, మారకమును మరింత సుల

భమయ్యెను. నాణెముయొక్క విలువయందరకును తెలియుట చే తూనికఅవసరము లేకపోయెను. ఇప్పుడన్నిచోట్లనునాణెము లుపయోగింపబడుచున్నవి. కాని ధనము దానంతటనది యెక్కువయుపయోగకారి కాదని మనము గ్రహింపవలెను. మనకు కావలసిన వస్తువులను కొనుటకదియుపయోగించుచున్నది. వస్తువుల మారకమున కదితోడ్పడుచున్నది. సమృద్ధిగాబంగారముండియు తినుట కేమియు దొరుకని మైదాసురాజుకథ నీకుజ్ఞాపకమున్నదికదా! కనుక మనకు కావలసినవస్తువులసేకరింపలేక పోయినచో ధనమునిష్ప్రయోజనమైనదే.

ఇప్పటికిని పల్లెటూళ్ళలో ఒక్కొక్కపుడునాణెములు చెల్లింపనవసరములేక వస్తువులను మార్చుకొనుట మనము చూచుచుందుము. కాని నాణెము లుపయోగించుటయే సులభమైనపద్ధతి గనుక ఆపద్ధతియే మిక్కిలి సాధారణముగ నవలంబింపబడుచున్నది. కొందరు తెలివితక్కువవాండ్రు ధనమే సర్వమని తలచి దాని నుపయోగింపక దాచియుంచుదురు. ధనమునసల్లేర్పడినదో దాని యథార్థమగు ప్రయోజనమేమో వారికి తెలియదని స్పష్టమగుచున్నది.

## 23

### భాష, వ్రాత, అంకెలు

భాషలను గూర్చియు, వానికిగల సంబంధము గూర్చియు నిదివరలో కొంతచర్చించి యుంటిమి. భాషయొక్క ఆరంభమును గూర్చి యిపుడాలోచింతము.

కొన్ని జంతువులు కొన్ని కొన్ని కూతల నుపయోగించుట మనకు తెలియును. కోతులలో కొన్ని వస్తువులను సంజ్ఞలవలన తెల్పునని కొందరు చెప్పుదురు. జంతువులకు భయము కలిగినపుడును, తనమందలో మిగిలినవాని నపాయము నుండి మందలింపదలచినపుడును వింతయగు కూతలు పెట్టును.

మనుజులలోకూడ నిట్లే భాష ఆరంభమయియుండును ఆరంభమున మాటలు భయమునకును, మందలింపునకును సంబంధించినవే యైయుండును. తర్వాత బహుశః పనిపాటులు చేయునపుడు కేకలారంభమైయుండును. చాలమందిజనులు కలిసి పనిచేయునపుడు సాధారణముగ నందరుకలిసి కేకలు వేయుచుందురు. అనేకులుకలిసి దేనినైనను లాగుటగాని, పైకెత్తుటగాని నీవుచూచియున్నావుగదా! అందరుకలిసి కేకలు వేసిన పనిచేయువారికికొంత సులభముగ నుండునుకాబోలు. ఇట్టిపనిపాటులలోని కేకలే మనుష్యు లుపయోగించిన మొదటిమాటలై యుండును.

క్రమక్రమముగా నీరు, నిప్పు, గుర్రము, ఎలుగుబంటి మొదలగు చిన్నమాటలు బయలుదేరి యుండును. అప్పుడు వస్తువులపేర్లేగాని పనులను తెల్పుమాటలు లేవేమో! ఎలుగుబంటినిచూచితినని చెప్పదలచినచో 'ఎలుగుబంటి' అనిచిన్న పిల్లలవలె సంజ్ఞచేయుచుండెను. అప్పుడు సంభాషణ చాల యరుదుగ నుండెను.

అంతకంతకు భాష వృద్ధియై చిన్న వాక్యములును పెద్ద వాక్యములు నేర్పడెను. వేర్వేరుజనులందరకును ఒకేభాష యెప్పుడునుండియుండదు. కాని మొదటిరోజులలో నెక్కువ భాషలుండుట, కవకాశములేదు. మొదట కొద్దిభాషలుండ క్రమముగా నొక్కొక్కభాష యొక్కొక్క కుటుంబముగ వృద్ధియయ్యెను.

మనమిదివరలో చర్చించుచుండిన యాదిమనాగరకతల కాలమునకు భాష బాగుగా నభివృద్ధి చెందియుండెను. అపుడనేకములగుపాటలుండెను. గాయకులు వానిని పాడుచుండిరి ఆకాలమున వ్రాతగాని, పుస్తకములుగాని లేకపోవుట చేజను లెక్కువగ జ్ఞాపకశక్తిపైననే యాధారపడియుండిరి. గేయములును, పద్యములును జ్ఞాపకముంచుకొనుట సులభము. కనుక ఆదిమనాగరకతలు వృద్ధిబొందిన దేశములలో గేయములును, కీర్తనలు నెక్కువగా ప్రజాదరణపొందియుండెను.

గాయకు లెక్కువగా మరణించిన వీరుల ఘనకార్యములను పొగడుచుపాడుచుండిరి. అప్పుడు యుద్ధము లెక్కువగా నుండుటచే యుద్ధములందలి పరాక్రమమే యీపాటలందు వర్ణింపబడుచుండెను. హిందూదేశములోను. ఇతర దేశములందునుగూడ నిట్లేజరుగుచుండెను.

వ్రాతయొక్క ఆరంభదశ కొంచెము చిత్రముగనే యుండెను. చీనాదేశపు వ్రాతపద్ధతినిగూర్చి కొంత చెప్పియుంటిని. అన్ని దేశములందును చిత్రములతోనే ఆరంభించి యుం

డును. నెమలినిగూర్చి చెప్పదలచుకొన్నవాడు నెమలిబొమ్మ వ్రాయుచుండెను. ఈవిధముగా చాలసంగతులు వ్రాయుట కష్టమే! క్రమముగా బొమ్మలు సులభమగు సంజ్ఞలుగ మార జొచ్చెను. చివరకు అక్షరసమామ్నాయ మేర్పడెను. దీని వలన వ్రాత సులభమైత్వరలో నభివృద్ధి గల్గజొచ్చెను.

అంకెలును లెక్కపెట్టుటయుగూడ. నొక ఘనమగు క్రొత్తవిషయముగ నప్పుడు తోచియుండెను. అంకెలులేనిదే ఏవ్యాపారముగాని జరుగుట కష్టము. అంకెలను కనిపెట్టిన వాడు సాధారణ ప్రజ్ఞానంతుడై యుండును. ఐరోపాలోని అంకెలు మొదట చాలచిక్కుగానుండెను. రోమను అంకె లనేమియో నీకు తెలియును. **I, II, III, IV, V,VI VII, VlI, IX, X** మొదలగునవి, చాల చిక్కయినవి. వీనిని ఉపయోగించుట కష్టము. అన్నిభాషలలోను ఇప్పుడు మనము వాడు అంకెలు చాల సులభము. ఇవి 1, 2. 3, 4, 5, 6, 7, 8, 9, 10. మొదలైనవి. వీటికి అరబిక్ అంకెలని పేరు; ఏలయన ఐరోపాలోనివారు వీనిని అరేబియాదేశము ద్వారా నేర్చుకొనిరి. కనుక వీనిని హిందూదేశపు అంకెలు అనుటయే సమంజసము. కాని నేను కొంచెము తొందర పడుచున్నాను. అరబ్బీలవరకు మనమింకను రాలేదు,

# 24

## వేర్వేరు తరగతులు - ప్రజలు.

బాలబాలికలను, ఒక్కొక్కపుడు పెద్దవారనుగూడ చరిత్రను చోద్యమగు రీతి నభ్యసించుచుందురు. రాజుల పేర్లు, యుద్ధముల తేదీలు మొదలగునవియే వారికి బోధింపబడును. కాని యథార్థముగా జూచిన చరిత్ర యనగా రాజులయొక్కయు, సేనానులయొక్కయు, పేర్లను, కొన్ని యుద్ధములును మాత్రమే కాదు. చరిత్ర మన కొక దేశపు ప్రజలనుగూర్చి తెలుపవలెను. ప్రజల జీవిత మెట్లుండునో, వారి చర్య లేవో, వారి భావము లెట్లుండునో మనకు వివరింపవలెను. వారికష్టసుఖములను, వారెదుర్కొనిన క్లిష్ట సమస్యలును వానిని వా రెట్లెదుర్కొనినదియు మనకు విశదీకరింపవలెను. మనము చరిత్ర నారీతిగ బంధించినచో మన కెంతయో జ్ఞానముగల్గును. మనకుగూడ నట్టిక్లిష్టసమస్య లేర్పడినచో చరిత్రపఠనము ఆసమస్యల నెదుర్కొనుటకు మనకు తోడ్పడ వచ్చును. ముఖ్యముగా చరిత్రపఠనము మనకు ప్రజలు వృద్ధి పొందుచుండిరో, క్షీణదశ జెందుచుండిరో తెలుపును.

పూర్వకాలమున నుండిన ఘనులగు స్త్రీపురుషుల జీవితములనుండి మనము కొన్ని యంశముల నేర్చుకొనవలసి నవే. కాని పూర్వకాలమున వేర్వేరుప్రజ లెట్లుండిరో కూడ తెలిసికొనవలసి యుండును.

నేను నీ కనేకమగు లేఖలు వ్రాసియుంటిని. వానిలో నిది ఇరువదినాల్గవది. ఇంతవరకును మనము చాల ప్రాచీన కాలమునుగూర్చి చర్చించుచుంటిమి. వానినిగూర్చి మనకంత గా తెలియదు. కనుక నిది చరిత్ర యనిపించుకొనదు. దానికి చరిత్రారంభమని చెప్పవచ్చును. కొద్దికాలములోనే నవీన యుగచరిత్రను గూడ తెలిసికొందము. వానినిగూర్చి మన కెక్కువ సంగతులు తెలియును. దానికే చారిత్రక కాలమని పేరు. కాని యీయాదిమనాగరికతలనుగూర్చినసమాలోచన వదలుటకు ముందువానిని మరియొకసారి తరచిచూచియాదిన ములలో నెట్టిప్రజలు నివసించుచుండిరో చూతము.

పూర్వకాలము తెగలలో జనులు వేర్వేరుకార్యముల నెట్లు చేయనారంభించిరో యిదివరకు తెలిసికొని యుంటిమి. అప్పుడు శ్రమవినిమయము లేక వ్యాపార విభాగ ముండెను. తెగయొక్క నాయకుడైన కులపెద్ద తన కుటుంబమును వేరు చేసికొని మిగిలిన ప్రజలపై నధికారముచలాయించు కార్యము నిర్వహించు చుండెను. ఇట్లతడు మిగిలినవారికంటె నెక్కువ వాడయ్యెను. అతనికుటుంబము మిగిలిన ప్రజలకంటె వేరుగ పరిగణింపబడు చుండెను. ఇట్లు రెండు తరగతుల ప్రజలేర్పడిరి. అధికారము చలాయించువా రొకతరగతి. మామూలుపనులు చేయువా రొకతరగతి. అధికారము చలాయించువారి బల మెక్కువగుటచే వారికి కావలసినన్ని పదార్థములను వారు తీసి కొనుచుండిరి. ఇట్లు వారంతకంతకు భాగ్యవంతు లగుచుండిరి.

వ్యాపారవిభజన మెక్కువై కొలది మూడ్రో త్తతరగతు లేర్పడుచుండెను. రాజు, అతనికుటుంబమును, అతనిఆస్థానపు ప్రజలునుండిరి. వారు దేశమునం దేర్పాట్లుచేయుచు నవసర మైనపుడు యుద్ధములుచేయుచుండిరి. వారు మరేసీపనియు చేయుటలేదు.

దేవాలయములలోని పురోహితులును దేవాలయము లకు సంబంధించిన యితరప్రజలు నుండిరి. ఆరోజులలో వారుచాలముఖ్యమైనవారు, వారినిగూర్చి ముందుముందు చర్చింతము.

మూడవవారు వర్తకులు, వీరు ఒక దేశమునుండి మరి యొక దేశమునకువస్తువులు తీసికొనిపోయి క్రయవిక్రయముల జరుపుచుండిరి, అంగడులు తెరచుచుండిరి.

నాల్గవతరగతివారు వివిధవస్తువులను తయారుచేయు పనివాండ్రు, నూలువడుకుట, బట్టలు నేయుట, కుండలు, పాత్రలు చేయుట, బంగారము, దంతములతో వస్తువులు చేయుట, మొదలగునవి వారు చేయుపనులు. ఇట్టివారిలో చాలమంది పట్టణముల సమీపమున నివసించుచుండిరి; కొం దరు గ్రామములలోకూడ నుండిరి.

పొలములలోను. నగరములందును పనిచేయు కాపు లును పాటకపు జనమునుగూడ నుండిరి. వీరే యెక్కువ మందిగల తరగతి. మిగిలిన తరగతుల వారందరును వీరిచే నేదియో యొకపని చేయించుకొనుచునే యుండిరి.

# 25

## రాజులు, దేవాలయములు, పురోహితులు

ప్రజలలో నైదుతరగతు లేర్పడెనని వెనుకటిలేఖలో తెలిసికొనియుంటిమి కాపులును, పాటకపు జనమును కలసి పెద్దతరగతిగ నుండెను. కాపులు నేలనుదున్ని పంటలు పండించుచుండిరి. కాపులు కష్టపడకపోయినచో నాహారపువస్తువులు లేకుండపోవలసినది. కనుక కాపులు చాలముఖ్యమైన వారు. వారు లేనిచో నందరును పస్తుండవలసినదే. పాటకపు జనులుగూడ పొలములందును, పట్టణములందును ఉపయోగకరమగు పనులు చేయుచుండిరి. వీరింత ముఖ్యమైన పనులు చేయుచు నంగరకును వీరితో నవసరమున్నప్పటికిని వారికి లబ్ధిచాల తక్కువగ నుండెను. వారుత్పత్తిచేసినదానిలో చాలభాగ మితరులవశమగుచుండెను. ముఖ్యముగ రాజును, రాజకుటుంబమువారును, ఎక్కువలాభము పొందుచుండిరి.

రాజును అతని సన్నిహితులు నెక్కువ యధికారము గల్గియుండిరి. ఆరంభపురోజులలో భూమి తెగకంతయు సాముదాయకముగ చెందియుండెను; కాని ప్రత్యేకముగ నేవ్యక్తికిని కాదు. రాజవంశమువారి బలమెక్కువైన కొలదియు, నేల యంతయు రాజవంశమునకే చెందినదని వారు చెప్పసాగిరి. వారేభూస్వాములైరి. భూములలో కష్టపడి పనిచేయు కాపులు

వారికొక విధముగ సేవకులైరి. కాపులు భూమిలోనుత్పత్తిచేసి నదంతయు విభాగముచేయబడ నారంభించెను. ఎక్కువవంతు భూస్వామికి బోవుచుండెను.

కొన్ని దేవాలయములకుగూడ భూములుండుటచేనట్టి ఆలయములకు భూస్వాములహోదా యుండెను.

దేవాలయములు, పురోహితులు, అన - నేమియో తెలిసికొందము. ప్రాచీనకాలపు టడవిమనుష్యులసృష్టిలో చాలవిషయములను గ్రహింపలేక వారు గ్రహింపలేనివానిని జూచి భయమునెంది దేవతలు, మహిమ మున్నగువానిని గూర్చి తలపదొడంగిరని యిదివరకొక లేఖలో జెప్పియుంటిని. నది, పర్వతము, సూర్యుడు, చెట్లు, జంతువులు మొదలగువాని నన్నిటిని వారు దేవతలుగ జేసిరి. తమవలెనే తమ దేవతలు గూడ కఠినులును క్రూరులునని భావించి వారిని బలులచే తృప్తిపరుప జూచుచుండిరి.

ఈ దేవతలకొరకు దేవాలయములు నిర్మింపబడెను. దేవాలయములోని గర్భగుడిలో వారు పూజించు దేవతయొక్క విగ్రహముండెను. వారికి దృగ్గోచరముకానిదానిని వారు పూజింపలేరు. ఇట్టిపూజ కొంతకష్టము కండ్లకు కనపడుచున్నవానినిగూర్చి చిన్నపిల్లలు సులభముగ గ్రహింపగలరు. ఆదిమానవులుగూడ కొంతవరకు చిన్నపిల్లలనుపోలినవారే. కనుక విగ్రహములేనిదే పూజింపలేరు గనుక వారు దేవాలయములలో విగ్రహములనుంచిరి. ఈవిగ్రహము లతిభయంకరముగనుండుట యొకచిత్రము. ఇవియొక్కొక్కపుడుజంతు

వులగను, ఒక్కొక్కప్పుడు సగముజంతువు, సగముమనుష్యు డుగను ఉండెను. ఈజిప్టులో ప్రజలు కొంతకాలముపిల్లిని, మరి కొంతకాలము కోతిని పూజించుచుండిరి. ఇట్టిజంతువుల భీకర విగ్రహమును ప్రజలేల పూజింపవలెనో గ్రహించుట కష్టసాధ్యము. విగ్రహమునే పూజింపవలెనన్న దాని నంద ముగ నేలచేయరాదు? బహుశః దేవతలన్న భయంకరులని వారియుద్దేశమైయుండెను. అందుచేతనే యిట్టి భీకరవిగ్రహ ములు నిర్మింపబడెను.

ఇప్పటివలె నారోజులలో సర్వాంతర్యామియగు నొక దేవునిగూర్చిగాని, యొకే గొప్పశక్తినిగూర్చిగాని, ప్రజలు తలచి యుండరు. ఎందరో లెక్కలేనన్ని దేవతలుండిరనియు వారిలోవారొక్కొక్కప్పుడు పోరాడుచుండిరనియు గూడ నప్పటి ప్రజలు భావించుచుండిరి. వేర్వేరు దేశములందును వేర్వేరు నగరములందును వేర్వేరు దేవతలు పూజింపబడు చుండిరి.

దేవాలయములలో పురోహితులు - స్త్రీలును పురు షులునుగూడ-నెందరోయుండిరి. సాధారణముగ పురోహితు లు మిగిలిన ప్రజలకంటె నెక్కువ చదువుకొన్న వారైయుం డిరి. కనుక వారు రాజులకు సలహాచెప్పువారైరి. ఆరోజుల లో గ్రంథములను పురోహితులే వ్రాయుచుండిరి. వారికి కొంచెము చదువుండుటచే నప్పుడు వారేజ్ఞానులుగ పరిగ ణింపబడుచుండిరి, తమ తెలివితేటలను ప్రదర్శించుటకై వారు

కొన్ని యుక్తులను పన్నుచుండిరి. అప్పటి ప్రజలు చాల అమాయకులగుటచే పురోహితులు మంత్రశక్తిగలవారని వారిని చూచి భయపడసాగిరి.

పురోహితులు ప్రజల సామాన్యజీవితముతో ననేక విధముల నన్వయించియుండిరి వారు జ్ఞానులగుటచే నెవరికైనను కష్టము తటస్థించినపుడుగాని వ్యాధి సంభవించినపుడుగాని సామాన్యప్రజలు వారివద్దకు వెళ్ళుచుండిరి. వారు పెద్దయుత్సవముల నేర్పాటుచేసి ప్రజల కుత్సాహము గల్గించుచుండిరి. ఆరోజులలో సామాన్యప్రజల కర్థమగు పంచాంగములు లేవు. పండుగలనుబట్టియే రోజులను లెక్కించుచుండిరి.

పురోహితులు సామాన్యప్రజలకు తరచుగ ననేకవిషయములలో భ్రాంతి కలుగజేయుచుండిరి. కాని వారి కనేక విధముల దోడ్పడి వారివృద్ధికి కారకులగుచుండిరి.

కొన్నిస్థలములలో ప్రజలు మొదట పట్టణములలో స్థిరనివాసము లేర్పరచుకొన్నపుడు వారి పరిపాలకులు పురోహితులే యైయుండవచ్చును. రాజులుగారు తర్వాత రాజులకు యుద్ధనైపుణ్య మెక్కువగ నుండుటచే పురోహితులను పారద్రోలి రాజులు వానినాక్రమించియుందురు. ఈజిప్టులోని ఫారోలవలె కొన్నిచోట్ల రాజును పురోహితుడు నొకేవ్యక్తి గూడనైయుండెను. ఫారోలు బ్రతికియున్నపుడు దేవాంశ గలవారనియే అప్పటి ప్రజల నమ్మకమై యుండెను. వారి మరణాంతరము దేవతలవలెనే ఫారోలు పూజింపబడుచుండిరి.

## 23

## వెనుక చూపు

నా లేఖలు నీకు విసుగు గల్గించుచున్నవేమో? నీకు కొంచెము విశ్రాంతి కావలెననుకొందును. కొంతకాలము వరకు క్రొత్త విషయములు వ్రాయదలచుకొనలేదు. మనమిదివరకు నేర్చుకొన్న యంశముల నొకసారి తిరిగి స్మరింపకోరుచున్నాను. కొద్దిపాటి లేఖలలో మనము కోట్లకొలది యేండ్ల కాలమును గూర్చి ప్రశంసించుకొంటిమి. భూమి సూర్యునిలో నొక భాగముగా నుండినపుడు మొదలిడి పిదప నది వేరై చల్లబడినదని తెలిసికొంటిమి, అప్పుడు చంద్రుడు వేరుపడెను. చాల యుగముల వరకు భూమిపై జంతువులు జీవితమభివృద్ధి జెందినవి. కోటియేండ్లన నెంతయో నీవు గ్రహింపగలవా? కోటియేండ్లన నెంతకాలమగునో యూహించుట చాలకష్టమగుపని. నీవు పదేండ్ల పిల్లవైనను అప్పుడే ఎన్నో యేండ్లు గడపినదానివలె నున్నావు! నీవింకను బాలికవు. నూరేండ్లన్న నీకు చాల దీర్ఘకాలముగ దోచును. వేయి, లక్ష, కోటి–ఇవి ఊహింపశక్యమా? మన యల్పబుద్ధుల కింతకాలమును గూర్చి యోచించుట సాధ్యము కాదని తలచెదను. మనమెంతో ప్రముఖులమని మనము భావింతుము. ఎంతస్వల్ప విషయములైనను ఒక్కొక్కపుడు మనకు చికాకు కలుగజేయును. ప్రపంచ చరిత్రను బట్టి చూచిన నిట్టి సంఘటనలొక లెక్కయేమి? చరిత్రయందు ఇట్టి మహాయుగములగూర్చి చదువుట మనకెంతయో లాభ

కారిగ నుండును. ఏలయన నపుడు చిన్న చిన్న విషయము లకు చికాకుపడుట మానుదుము.

భూతలముపై జీవనమేలేని బ్రహ్మాండమగు కాలమును గూర్చి జ్ఞప్తిదెచ్చుకొందము తర్వాత సముద్రజంతువులు మాత్రముండిన కాలము చూడుము. భూమిపైనపుడు మానవుడెచ్చటను లేనేలేడు కోట్లకొలది యేండ్లు భూమిపై జంతువులు స్వేచ్ఛగా తిరుగాడుచుండెను. అప్పుడు వానిని చంపువారు లేరు. మానవుడు భూమిపై ప్రవేశించిన మొదటిరోజులలో నతడు చాల అధమస్థితియందుండి చాలబలహీనుడుగ నుండెను. క్రమముగా వేలకొలది యేండ్లలో బలమును బుద్ధిని వృద్ధిచేసికొని తుదకు భూమిపై జంతువులన్నిటికిని యజమాని యయ్యెను. తుదకు మిగిలిన జంతువులన్నియు నాతనికి బానిసలై యతని యాజ్ఞలకు కట్టుబడిపోయెను.

ఇక నాగరకతాభివృద్ధిని జూతము. దాని యారంభమెట్టిదో చూచియుంటిమి. అది తర్వాతయుగములలో నెట్లు వృద్ధిపొందెనో ముందుముందు చూతము. ఇక మీదట మనము కోట్లకొలది యేండ్లను తెలిసికొన నవసరము లేదు. ఇంతవరకు మన లేఖలలో నిప్పటికి నాలుగైదు వేల యేండ్ల పూర్వమువరకు మానవచరిత్ర కొంత తెలిసికొంటిమి. కాని యింతకుపూర్వము గతించిన కోట్లకొలది యేండ్ల విషయముకంటె నీనాలుగు వేలయేండ్లను గూర్చి మనకెక్కువసంగతులు తెలియును. మానవుని చరిత్రయు, మానవజాతిఅభివృద్ధియు వాస్తవముగ

నీ నాలుగువేల యేండ్లలోనే యిమిడియున్నది. నీవు పెద్దదానవైన పిదప యీచరిత్ర నీవు విస్తారముగ చదువగలవు. మానవుని కీప్రపంచమున నేసంఘటనలు తటస్థించెనో నీకు కొంతపరిచయముగల్గజేయుటకై దానినిగూర్చి తగుమాత్రము నీకు నేను వ్రాయబూనితిని.

## 27

### జవశేషములు, శిథిలములు

నేను నీకు లేఖలు వ్రాసి చాలకాలమైనది. నేను వ్రాసిన చివరి రెండు లేఖలలో ప్రాచీనయుగములనుగూర్చి పునస్మరణ చేసితిని. చేపల జీవశేషములెట్లుండెనో తెలియుటకై నీకు కొన్ని జీవ శేషములనుచూపుబొమ్మల కార్డులనుపంపితిని. మసోరీలో మనము కలిసికొనినపుడు మరికొన్ని జీవశేషముల బొమ్మలను చూపితిని.

సరీసృపముల జీవశేషములగూర్చి నీకు జ్ఞాపకమున్నదనుకొందును. సరీసృపములనగా ప్రాకుజంతువులు పాములు బల్లులు, మొసళ్ళు, తాబేళ్ళు మొదలగునవి ప్రాచీనకాలపు సరీసృపము లీకుటుంబములకు జెందినవే యైనను అవి చాల పెద్దవిగ నుండెను. సౌత్ కెన్సింగు టన్ మ్యూజియములో మనము చూచిన బ్రహ్మాండమగు జంతువులు నీకు జ్ఞాపకముండవచ్చును. వానిలో నొకటి ముప్పదినలుబది యడుగుల పొడవుండెను. మనుష్యునికన్న పెద్దదిగనున్న కప్పయు సుమా

రంత యేయున్న తాబేలును గూడ నుండెను. పెద్దవియగు గబ్బిలము లెగురుచుండెను. ఐగువానోడన్ అనబడు జంతువు నిలబడినపుడు చిన్న చెట్టంత పెద్దదిగా నుండెను.

ప్రాత మొక్కలవి శేషములనుగూడ నీవు చూచియుంటివి. రాతిలో నందమగు పొదలయొక్కయు, ఆకులయొక్కయు గుర్తులుండెను.

సరీసృపములకు చాలకాలము తర్వాత మమ్మాలులు లేక స్తను లనబడు పాలుకుడుపు జంతువు లేర్పడెను మన చుట్టును మనము చూచు చాల జంతువులును, మానవులును గూడ స్తనులే. పూర్వపు మమ్మాలు లిప్పటి జంతువులనే చాలవరకు పోలియుండెను. అవి కొంచెము పెద్దవిగనే యుండెనుగాని సృరీసపములంత పెద్దవిగాను బ్రహ్మాండమగు దంతములుగలఏనుగులును, చాల పెద్దవగుఎలుగుబంటులు నుండెను.

మానవ జన శేషములను నీవు చూచియుంటివి. ఇవి ఎముకలును పుర్రెలునే గనుక అంత యెక్కువ చిత్రముగా కనుపించలేదు. ప్రాచీన మానవులు నిర్మించిన రాతిపనిముట్లు చిత్రముగ నుండెను

ఈజిప్టు దేశపు సమాధులను మమ్మీలనుచూపుకొన్ని బొమ్మలుగూడ నీకు చూపితిని. వీనిలో కొన్ని చాల యందముగ నుండెను కర్రతో చేయబడిన శవపేటికలపై పెద్దపెద్ద కథలు వ్రాయబడియుండెను. తీబ్సులోని ఈజిప్టుగోరీల చిత్తరువులు చాల చోద్యముగ నుండెను.

ఈజిప్టులో తీబ్సువద్దనుండిన భవనములయొక్కయు; దేవాలయములయొక్కయు, శిథిలముల బొమ్మలుగూడ నీవు చూచితివి. పెద్దవియగు స్తంభములతో గూడ నాకట్టడము లతిబ్రహ్మాండమైన రాతివిగ్రహము గలదు.

ఉత్తర ఈజిప్టులోని కర్నాకువద్దనుండిన భవనముల యొక్కయు, దేవాలయములయొక్కయు, శిథిలములబొమ్మలు గూడ చూచియుంటివి. వీనినిబట్టి ప్రాచీనకాలపు ఈజిప్టు దేశీయులు శిల్పవిద్యయందతి నేర్పు గలవారని తెలియు చున్నది. భవననిర్మాణమెంతో బాగుగ తెలిసినగాని యింత టి పెద్ద దేవాలయములను ప్రాసాదములను వారుకట్టలేరు.

వెనుకటివిషయములనుక్లుప్తముగనొకసారిపునఃస్మరణ చేసితిమి. తర్వాతి లేఖలో ముందుసంగతులు తెలిసికొందుము.

## 28

### హిందూదేశమున కార్యులరాక

ఇంతవరకు మనము మిక్కిలి ప్రాచీనకాలమునుగూర్చి చర్చించితిమి. ఇప్పుడు మానవునిచర్యలును. వానియభివృద్ధి యు గమనింతుము. ఇదివరకు మనముచర్చించినకాలమునకు పూర్వచరిత్రయుగమనిపేరు; ఏలయన నాకాలపుయథార్థవి షయములు చాలవరకు మనకు తెలియవు. ఆకాలపుసంగతు లలో చాలవరకు ఊహపై నాధారపడవలసియుండెను. ఇప్పు డు మనము చరిత్రకాలమును సమీపించుచున్నాము.

హిందూ దేశములో నేమిజరిగెనో చూతము. ఈజిప్టు వలె నేహిందూ దేశములోగూడ ప్రాచీన కాలమున నాగరికత వృద్ధి జెందియుండెను. వ్యాపారము విరివిగ నుండెను. ఓడలలో హిందూదేశపుసరకుల ఈజిప్టు, మెసపొటేమియాం మొదలగు దేశములకు తీసికొనిపోబడుచుండెను. ఆరోజులలో హిందూ దేశములోనుండిన ప్రజలకు ద్రావిడులని పేరు వీరిసంతతివారిపుడు దక్షిణహిందూ దేశములో మదరాసు చుట్టును నివసించుచున్నారు.

ఈద్రావిడులపై ఉత్తరప్రాంతములందుండిన ఆర్యులుదండెత్తిరి. మధ్యఆసియాలో నార్యులధిక సంఖ్యాకులుగ నుండిరి. అచట వారికి తగినంత యాహారములేకపోవుటచే వారితర దేశములకుకూడ వ్యాపించిరి. వారు పర్షియా, గ్రీసు మొదలగు పాశ్చాత్య దేశములకుగూడ వ్యాపించిరి. కాశ్మీరమువద్దనున్న పర్వతములమీదనుండి వారు గుంపులు గుంపులుగా హిందూ దేశమునకును వచ్చిరి.

ఆర్యులు యుద్ధనిపుణులగుటచే వారు ద్రావిడులను వెనుకకుతరిమివేసిరి. వాయవ్యభాగమునుండి సముద్రతరంగములవలెనార్యులనేక సమూహములతర్వాతనేక సమూహముగ రాజొచ్చిరి. ద్రావిడులు మొదట కొంతవరకు వారి నాటంకపరుపగల్గినను తుదకు వారినడ్డగింపలేకపోయిరి. చాలకాలము వరకార్యులు ఆఫనిస్థానము, పంజాబు మొదలగు ఉత్తర దేశములందే యుండిరి. క్రమముగా వారిపుడు మనము నివసించు సంయుక్తపరగణాలవరకు వ్యాపించిరి. మధ్యహిందూ దేశమం

దలి వింధ్యపర్వతములవరకు వారువిస్తరించిరి. అచట దట్టమగు నరణ్యము లుండుటచే నవి దాటుటకష్టమయ్యెను. కనుక చాలకాలమువర కార్యులువింధ్యపర్వతముల కుత్తరమున నే యుండిపోయిరి. తర్వాత వారిలో చాలమంది అరణ్యముల నెట్లో దాటి దక్షిణదేశమునకు వెళ్ళిరి. కాని విస్తారము దూర మార్యులు వెళ్ళలేకపోవుటచే దక్షిణభాగము ద్రావిడులవశముననే యుండెను.

హిందూ దేశమున కార్యులరాకగూర్చి తెలిసికొనుట చాల ఆసక్తి గల్గించువిషయమై యుండెను. మన ప్రాచీనసంస్కృతగ్రంథములనుబట్టి వారినిగూర్చి మన కెక్కువగా తెలియును. వేదములవంటి కొన్ని గ్రంథము లప్పుడే రచింపబడీయుండెను. వేదములలో ఋగ్వేదము ప్రాచీనమైనది. దానినిబట్టి ఆర్యులాక్రమించిన ప్రాంతములను గూర్చి తెలియుచున్నది. మిగిలిన వేదములవలనను, పురాణములవలనను ఆర్యులెట్లువ్యాపించిరో తెలియుచున్నది. ఈప్రాచీనగ్రంథములనుగూర్చి నీ కెక్కువగా తెలియదేమో! నీవు పెద్దదానవైనపిదప వానిని గూర్చి తెలిసికొందువు. పురాణములలోని కథలు నీ కెక్కువగా తెలియును. పురాణములకు చాలతర్వాత రామాయణమును, ఆపిమ్మట భారతమును పుట్టినవి.

ఆర్యులు పంజాబులోను, ఆఫ్ఘనిస్థానములోను ఉండినపుడు, దానినార్యావర్తమని పిలుచుచుండిరని ఈగ్రంథమువలన తెలియును. ఆఫ్ఘనిస్థానమున కప్పుడు గాంధార మని పేరు. మహాభారతములోని గాంధారినిగూర్చి నీకు జ్ఞాపకము

న్నదా? ఆ మెగాంధారమునుండి వచ్చుటవే నామెకాపేరు వచ్చినది. ఇప్పుడు ఆఫ్ఘనిస్థానము హిందూదేశమునుండి వేరుపడియున్నది గాని అప్పుడు కలిసియుండెను.

ఆర్యులింకను దక్షిణముగా గంగా యమునా మైదానములకు వచ్చినప్పు డుత్తర దేశమునకు ఆర్యావర్త మని పేరిడిరి.

పూర్వకాలమునం దితర ప్రజలవలెనే వారు నదీతీరపు పట్టణములందే స్థిరనివాస మేర్పరచుకొనిరి. కాశీ, ప్రయాగ మొదలగుపట్టణములు నదీతీరములందే నిర్మింపబడినవి.

## 29

### హింద్వార్యు లెట్టివారు?

ఆర్యులు హిందూదేశమునకు ఇప్పటికి అయిదారువేల యేండ్లకుపూర్వమే వచ్చియుందురు. వారందరు నొకసారిగా రాలేదు. ఒక దండుతర్వాత నింకొక దండు, ఒక తెగ పిదప మరియొక తెగ, ఒక కుటుంబము తర్వాత మరియొక కుటుంబము ఇట్లువందలకొలది యేండ్లలో వచ్చియుందురు. వారిసామానులన్నియు బండ్లలోను, ఒంటెలమీదను వేసికొని పెద్ద బిడారులుగ నేర్పడి వారు వచ్చుచుండుట నూహించి చూడుము. వారిప్పటియాత్రికులవలె రాలేదు. వారిచ్చటనేయుండి యుద్ధములుచేసి స్థిరనివాస మేర్పరచుకొనుటయో, లేక ఇచ్చటనే చచ్చుటయో వారియుద్దేశము. వారిలోచాలమంది వాయువ్య

పర్వతములను దాటివచ్చిరి. కొందరు పర్షియా సింధుశాఖ నుండి సముద్రమార్గముగ వచ్చి సింధునదిలో చిన్న యోడలపై ప్రయాణముచేసి దానియెగువభాగమును చేరిరి

ఈ ఆర్యు లెట్టివారు? వారు రచించిన గ్రంథముల నుండి యెన్నియోయంశములు మనకు తెలియుచున్నవి. వేదములవంటి కొన్నిగ్రంథములు ప్రపంచమంతటిలోనుప్రాచీనమైనవి. మొదట నవి వ్రాయబడిలేదు. వానిని సంతలు చెప్పుకొని వల్లెవేయుచుండిరి. అవి చాలనందమగు సంస్కృతభాషలో వ్రాయబడియున్నవి. అవి గానముచేయుటకు దగియున్నవి. ఇప్పటికని సంస్కృతభాషను తెలిసినవారు మంచి కంఠముతో వేదములు పఠించిన వినుట కెంతయో హాయిగ నుండును. హిందువులు వేదములను మిక్కిలి పవిత్రగ్రంథములుగ జూతురు. వేదము అన నర్థమేమి? వేదమనగా జ్ఞానమని యర్థము. ఆకాలపు జ్ఞానులగు ఋషులు సేకరించిన జ్ఞానముతో వేదములు నిండియున్నవి. ఆరోజులలో రైళ్ళు, టెలిగ్రాఫులు, సినిమాలును లేవు. అంతమాత్రముచే వారి నజ్ఞానులుగ పరిగణింపరాదు. అప్పటిబుద్ధిమంతు లిప్పటివారి కంటె చాలయెక్కువ జ్ఞానము కల్గియుండిరని కొందరు తలచుచున్నారు. వారి బుద్ధికుశలత మాట యెట్లున్నను వారు రచించిన గ్రంథములు మాత్రమిప్పటికిని చాలయుత్తమమైనవిగ గణింపబడుచున్నవనుట నిర్వివాదాంశము. అప్పటివారెంత బుద్ధిమంతులో దీనివలన తెలియుచున్నది.

వేదములు మొదట వ్రాయబడలేదని చెప్పియుంటిని. అవి వల్లెవేయబడి తరతరముగా సంతతులకు చేరుచుండెను. అప్పటి వారి జ్ఞాపకశక్తి ఆశ్చర్యకరమైనది. పుస్తకములు మొదటినుండి చివరివరకు కంఠస్థముగ చదువగలవారు మనలో నిప్పటికాలమున నెంతమందిగలరు?

వేదములు రచింపబడిన కాలమునకు వేదయుగమని పేరు. వేదములలో మొదటి ఋగ్వేదము. ప్రాచీనార్యులు గానముచేసిన సూక్తములతో నది నిండియున్నది. అప్పటివారు మనోవ్యధయనునది యెరుగక ఉల్లాసవంతులై యుండెడివారు. ఆయుల్లాసముచే వారు గేయములను పూరించుచుండిరి.

తమజాతివిషయమై వారెక్కువఅభిమానముగలవారై యుండిరి. "ఆర్య" అను పదమునకు పూజింప దగినవాడని యర్థము. వారికి స్వేచ్ఛయందు చాలప్రీతి. ప్రస్తుతము హిందూదేశములోనున్నవారి సంతతివారివలె వారు పిరికివారును, స్వాతంత్ర్యము పోయినను విచారములేనివారును కారు. ప్రాచీనార్యులు అవమానమును, దాస్యమును పాపిపతనమును సహించుటకంటె మరణమే మేలని తలచెడివారు.

వారు గొప్ప పరాక్రమవంతులు; వారికి శాస్త్రపాండిత్యముకలదు; వ్యవసాయము బాగుగ తెలియును. వారికి వ్యవసాయమునందెక్కువ యభిలాష గనుక వ్యవసాయమునకు సంబంధించినదానినంతయు మిగుల ప్రీతిగజూచుచుండిరి. నదులు వారికి జలమునిచ్చుటచే వానిని మిక్కిలి గౌరవింప

దగినవిగ భావించుకొనుచుండిరి. ఎడ్లను, ఆవులును వారికి వ్యవసాయమునకును, పాలిచ్చుటచేతను నుపయోగించునవి గనుక వాని నెక్కువైనవిగా చూచుకొనుచుండిరి. వీనిని బాగుగాపోషించిస్తోత్రము చేయుచుపాటలబాడిరి. ఈయదార్థ కారణమును మరచిపోయి తర్వాతకాలపుప్రజలు ఆజంతువులను పూజింప నారంభించిరి. నిజతత్వమెరుగని కేవలపూజ యేమియు లాభములేని పనిగాదా!

ఆర్యులు అభిజాత్యము గలవారగుటచే నితరజంతువులతో కలియుటకు వెనుదీయుచుండిరి. కనుక ఆర్యులకితరులతో వివాహములు నిషేధించుచు కట్టుదిట్టములచేసిరి. ఇదియే కొంతకాలమునకు వర్ణపద్ధతిగ మారెను. ఇప్పటికాలపు వర్ణాశ్రమ పద్ధతి చాలవిచిత్రముగనున్నది. కొందరుప్రజ లితరులను ముట్టుకొనుటకును, ఇతరులతో భుజించుటకును వెనుకదీయుచుందురు. అదృష్టవశమున నిప్పుడిప్పుడే ఈపట్టుదలలు కొంచెము తగ్గుచున్నవి.

## 30

### రామాయణ మహాభారతములు

వేదయుగము తర్వాత పురాణయుగము నడచెను. ఈ కాలమున గొప్పవీరులకథలదెల్పు రెండుపురాణములువ్రాయబడెను. వీనికి రామాయణ మహాభారత యుగమని పేరు.

పురాణయుగములో ఆర్యు లుత్తరహిందూస్థానమంతయు, వింధ్యపర్వతములవరకు వ్యాపించిరి. దీనికంతటికిని ఆర్యావర్తమను పేరుండెనని చెప్పియుంటిని. ఆకాలమున ఇప్పటిసంయుక్త పరగణాలకు మధ్యదేశమనియు, బెంగాలుకు వంగదేశమనియు పేర్లు.

ఇచ్చట నొక చిత్రమగు విషయము గలదు. దానిని తెలిసికొనుటకు నీకు కుతూహలముగా నుండును. హిందూదేశపు పటమును చూచినచో హిమాలయ పర్వతములకును వింధ్యపర్వతములకును మధ్యగా నుండిన ఆర్యావర్తము అర్ధచంద్రాకారముగ నున్నదని నీవు గ్రహింపగలవు. కనుక ఆర్యావర్తమునకు చంద్రదేశమని పేరుండెను. "ఇందు" అనగా చంద్రుడు అనియర్థముగనుక ఆర్యావర్తము ♦'ఇందు దేశము' అనబడెను.

ఆర్యుల కర్ధచంద్రుడన్న చాలప్రీతి. అర్ధచంద్రాకారముగనున్న వస్తువు లన్నియు వారు పవిత్రముగ నెంచుచుండిరి. కాశివంటి చాల పట్టణములు అర్ధచంద్రాకృతిగా నుండెను. అలహాబాదులోగూడ గంగానది అర్ధచంద్రాకారముగ వంపుతిరుగుచున్నది.

రామాయణములో సీతారాముల కథయు సింహళదేశపు (లంక) రాజగు రావణునితో యుద్ధమును వర్ణింపబడినవి. మొదట ఆకథ వాల్మీకిచే సంస్కృతమున వ్రాయబడి

♦ ఇందిరకు "ఇందు" అనునది ముద్దుపేరు.

నది. తరువాత నితర భాషలలో ననేకమగు పాఠాంతరముల బొందినది. హిందీలో తులసీదాసు రచించిన 'రామచరిత మానస' మనునది సుప్రసిద్ధమైనది.

దక్షిణహిందూదేశములో రామునికి వానరములు సహాయము చేసెననియు వానరములలో హనుమంతుడు మహావీరుడనియు రామాయణములో చెప్పబడియున్నది. ఆర్యులకును దక్షిణదేశస్థులకును జరిగినయుద్ధమే రామాయణకథయైనను గానచ్చును. బహుశః దక్షిణదేశమున నివశించుచుండిన ఏలనవర్ణులే 'వానరము' లేమో!

రామాయణములో ననేకమగు మంచికథలున్నవి. వీనినిగూర్చి నేనిక్కడ చెప్పజాలను. నీయంతటనీవే వానిని చదువుకొనగలను.

రామాయణమునకు చాలపిమ్మట మహాభారతము వ్రాయబడెను. అది చాల పెద్దగ్రంథము. దానిలో నార్యులకును ద్రావిడులకునుగాక ఆర్యులలో నార్యులకే జరిగినయుద్ధము వర్ణింపబడినది. యుద్ధముమాట యటుండనిచ్చి దానిలోని మంచి సందర్భములను యద్భుతకథలనుబట్టిచూచినను అది మహాగ్రంథమనిపించుకొనుచున్నది. ఇవన్నియు నట్లుండ

దానియందు భగవద్గీతయగు రత్నమువంటి పద్యకావ్యముండుటచే నది మనకందరకును పూజనీయమైనది.

దక్షిణ హిందూదేశమున వేలకొలది యేండ్లక్రిందట నిట్టి గ్రంథములు వ్రాయబడెను. మహాజ్ఞానులుగాక మఱెవరట్టివానిని రచింపగలరు? అవి యెంతో పూర్వకాలమున రచింపబడినను ఇప్పటికిని జీవకళతో ప్రకాశించుచున్నవి. మన దేశమున ఆబాలగోపాలమును వాని నెఱుంగుదురు. యుక్తవయస్కు లందరును వానిచే సన్మార్గవర్తనకు ప్రేరేపింపబడుచున్నారు.



శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి.

# దస్తావేజులమతలబు.

లోకవ్యవహారమునందు ప్రవేశముగల ప్రతివానికిని అత్యంత ప్రయోజనకరమైన గ్రంథము. అర్జీలు - పిటీషనులు - ప్రోనోట్లు - ఇల్లు భూమి తనఖాదస్తావేజులు-పంచాయితీతీర్పులు-డిక్రీట్రాన్సుఫర్లు ప్రోనోట్లుట్రాన్సుఫర్లు-పారిఖత్తులు-మరణశాసనములు-వీలుదత్తత దస్తావేజులు దత్తత అధికారపత్రములు-దానపత్రములు-మనోవృత్తి దస్తావేజులు-కౌళ్ళుకదపాలు - ఖండగుత్తకౌళ్ళు-అద్దెచీట్లు- హక్కువిడుదలదస్తావేజులు-గోడసందుహక్కులనుగూర్చి-మనోవృత్తిహక్కులనుగూర్చి - ఇల్లుక్రయమురద్దు-పవర్ ఆఫ్ ఎటర్నీలు-పారివ్యాపారపుదస్తావేజులు-రశీదులు-అదియిదియననేల ? వ్యవహారసంబంధమైన సర్వవిషయము లిందుగలవు. ప్లీడర్లయొక్కగాని ప్రయివేట్లయొక్కగాని సహాయములేకయే స్వయముగా సర్వవిషయములను ఈగ్రంథసహాయమున నిర్వహించుకొనవచ్చును. గృహమున నీగ్రంథమొక్కటి యున్నచో గొప్పసలహాల నిచ్చు ప్లీడరునొకని కొనియుంచుకొనినంత ఫలమిచ్చును.

వెల రు 0-12-0.

# భోజరాజు చరిత్రము.

గ్రంథకర్త:—అయినాపురపు సోమేశ్వరరావుగారు.

కాళిదాసునిపేరు చెప్పుకొనుటయేగాని పూర్వోత్తరములు ఇంతవరకు యెవరికిని తెలియవు. కాళిదాసు కాళికాదేవిని ప్రత్యక్షమొనర్చుకొని యామెవలన వరంబులవడసి సకలవిద్యాపారంగతుడై భోజరాజాస్థానమునజేరి అందలి పండితాగ్రేసరులకన్న నత్యధికుడై యామహారాజుచే నియ్యబడిన అద్భుత సమస్యలను పూర్తిచేయుటయు మొదలగు చిత్రవిచిత్రచరిత్రంబు లెన్నియో వ్రాయబడియున్నవి.

వెల రు 0-8-0.

వలయువారు:—కురుకూరి సుబ్బారావు,

సరస్వతీబుక్ డిపో, బెజవాడ.

# వేములవాడ భీమకవి చరిత్రము.

బ్రహ్మశ్రీ

మద్దూరి శ్రీరామమూర్తి కవిగారిచే

రచియింపఁబడినది.




పబ్లిషరు,

కురుకూరి సుబ్బారావు,

ప్రొప్రయిటరు, సరస్వతీబుక్‌డిపో, బెజవాడ.


రెండవకూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1938.




[వెల 0—8—0.

# ప్రకటన.



కురుకూరి సుబ్బారావు,
ప్రొప్రయిటరు, సరస్వతీబుక్ డిపో,
బెజవాడ, కృష్ణాజిల్లా.

# పీఠిక.

భాషాభిమానులారా !

పూర్వకవుల చారిత్రము లెఱుంగుటకు సరియైన యాధారము లిపుడు లభింపకున్నవి. లభించిన స్వల్పములగు నాధారములతో నెట్లో ఈగ్రంథమును రచించి యాంధ్రలోకమున కర్పించితిని. మున్నీవర కీమహాకవిపుంగవునిచారిత్రమును యెందఱో వ్రాసియుండిరి. ఇందు మరికొన్ని నూతనాంశములు జేర్పబడినవి.

అభిప్రాయభేదముల కాకరమైన యీగ్రంథమును రచించుపట్టున నేను పొరబడియున్న క్షమించి, కవిరాక్షసబిరుదాంకితుఁడగు వేములవాడ భీమకవిపైగల యభిమానము పెంపునైన నీచిన్ని గ్రంథము నాదరింతురని నమ్ముచున్నాను.

ఇట్లు,

బుధజనవిధేయుడు,

మద్దూరి శ్రీరామమూర్తికవి.

కాకినాడ,
30-1-38.

# విషయసూచిక.

శుభమస్తు.

# వేములవాడ భీమకవి చరిత్రము.

శాపానుగ్రహసమర్థుండును, నుద్దండకవిపుంగవుఁడును నైన నీ వేములవాడభీమకవిపుంగవుఁడు, క్రీస్తుశకము 12 వ శతాబ్దారంభము ననుండి యుండెనని తలంపవలసి వచ్చుచున్నది. ఆంధ్రకవులచరిత్రము వేములవాడభీమకవి 14 వ శతాబ్దమువాఁడై యుండునని చెప్పుచున్నది. కొన్నిసంవత్సరములకు ముందు జయంతి రామయ్యపంతులు వారు భీమకవివిరచితకవిజనాశ్రయమును ప్రచురించి యాగ్రంథముయొక్క పీఠికయం దీతఁడు 12 వ శతాబ్దమువాఁడై యుండు నని స్థిరపరచియుండిరి. మఱియు మలకపల్లి పెదశేషగిరిరావుగారు తమ "వేములవాడ భీమకవి" యనుగ్రంథమున ప్రప్రథమమున నీతఁడు 11 వ శతాబ్దపువాఁడనియు, యటుపిమ్మట (53 పుట) భీమన మైలమభీమన రణతిక్కన యున్న నెల్లూరుపురమునకు వారిని గననేగుచుండువాఁడనియు, తిక్కనాదు లిరువురును మనుమసిద్ధిభూపాలుని కాలమువారై యుండుటచే మనుమసిద్ధికాలమున కూడ భీమకవి యుండెననియు, నక్కారణమున భీమకవి నాలుగువందల సంవత్సరములు జీవించెనని తలంపవలసియున్న దనియు వ్రాసియున్నారు.

ఈ కవిపుంగవుని కాలమును గూర్చియు, జన్మస్థలమును గూర్చియు వాదోపవాదములు జరుగుచునే యున్నవి. కొంద రీతఁడు గోదావరీ జిల్లాలోని రామచంద్రపురం తాలూకాలో చేరిన ద్రాక్షారామభీమేశ్వరవరప్రసాదియనియు, ద్రాక్షారామమున కించుక దూరముననున్న వేగులవాడ యనియిపుడు పిలువఁబడుచున్న వేములవాఁడను జన్మించియుండెన

నియు, మరికొందఱు నైజాంరాజ్యములోని యోరుగల్లుప్రాంతమునందలి వేములవాడగ్రామమున జన్మించియుండె ననియు వాదించుచున్నారు.

ఈ కవిపుంగవుని జన్మమును గూర్చియు, జన్మస్థలమును గూర్చియు తెలిసికొనుటకు సరియైన మార్గములు గానరావు. కొన్నికొన్ని దృష్టాంతరములవలన నీత డిప్పటివాఁడై యుండునని భావింపవచ్చును. అప్పకవీయమున నప్పకవి యీతనిగూర్చి వ్రాయుచు నీతఁడు నన్నయకు సమకాలికుఁడై యుండెనని సూచించియుండెను. అందువలన నప్పకవి కాలమునకే యీత డెప్పటివాఁడో నిర్ణయించుటకు దగినయాధారములు లభించియుండ లేదనిగాని, యీతఁడు చెప్పినదే సత్యమైనయెడల భీమకవి నన్నయ లిరువురును నొకేకాలమువారనియు దలంపవలసివచ్చుచున్నది. అప్పకవీయములోని పద్యముల నీక్రింద బొందుపరచుచున్నాను.

తే. ఆంధ్రశబ్దచింతామణి వ్యాకరణము
ముందు రచియించి తత్సూత్రములను దెనుంగు
బాసచే జెప్పె నన్నయభట్టు తొల్లి
పర్వములు మూడు శ్రీమహా భారతమున.

తే. భారతము దెనిగించుచు దా రచించి
నట్టి రాఘవపాండవీయము నడంచె
ఛందము నడంప నీభక్తి సంగ్రహించె
ననుచు భీమన యెంతయు దాని నడచె.

ఉ. ఆదిని శబ్దశాసన మహాకవి జెప్పిన భారతంబులో
నేది వచింపగాబడియె నెందును దానినె కానిసూత్ర సం
పాదన లేమిచే దెలుగు పల్కు మరొక్కటి గూర్చి చెప్పగా
రాదని ద్రాక్షపాటికవి రాక్షసు డీనియమంబు చేసినన్.

క. ఆమూఁడు పర్వములలో
నా మాన్యుఁడు నుడువు తెనుఁగు । లరసికొని కృతుల్
తామరచించిరి తిక్కన
ధీమణి మొదలైనతొంటి । తెనుఁగు కవీంద్రుల్.

తే. రాజరాజనరేంద్ర తనూజుఁ డార్య
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించు నెడ బఠనంబొనర్చె
నన్యు లెవ్వరెఱుంగ రీ యాంధ్రఫక్కి.

క. ఆదిని భీమకవీంద్రుఁడు
గోదావరిలోన గలిపె । గుచ్ఛితమున నా
మీఁదట రాజనరేంద్ర
త్మాదయితుని నెట్టి దాని । మహి వెలయించెన్.

ఈపద్యమున భీమకవి నన్నయకాలముననే యుండెననియు భీమన రచించిన రాఘవపాండవీయ మను ద్వ్యర్థికావ్యమును నన్నయ ధ్వంసము చేయుటచే భీమకవి యాతని వ్యాకరణమును గొనిపోయి గోదావరిలో గలిపెననియును, నన్నయ రచించునప్పుడే యా వ్యాకరణమును జదివియుండిన రాజరాజనరేంద్రుని కుమారుడైన సారంగధరుఁ డా వ్యాకరణమును దిరుగ భూమిపై వెలయించెననియు దెల్లమగుచున్నది.

కావున వీరేశలింగము పంతులవా రాంధ్రకవులచరిత్రమున భీమకవిచే రచింపఁబడిన యీ క్రిందిపద్యమున జెప్పబడిన కళింగగంగు చరిత్ర మాధారముగా దీసికొనియున్నారు.

ఉ. వేములవాడ భీమకవి । వేగమె చూచి కళింగగంగు తా
సామము మాని కోపమున । సందడిదీర రమ్మి పొమ్మనెన్
మోమును జూడఁగూడ దిక । ముప్పదిరెండు దినంబులావలన్
జామున కర్ధమందతని । సంపద శత్రుల పాలుగావుతన్.

ఈ కళింగగంగుయొక్క వంశవృక్షమును యీ విధముగా నొసంగియున్నారు.

కళింగరాజ్యమును 9 వ శతాబ్దము మొదలుకొని 11 వ శతాబ్దము ప్రాంతమువరకు పరిపాలించిన కళింగరాజుల వంశవృక్షము.



పై వంశవృక్షమువలన కళింగగంగు శా. శ. 1041 కి సరియైన క్రీస్తుశకము 1116 సంవత్సరం ప్రాంతమున నుండెననియు ఆతనికాలమునసే భీమన యున్న యెడల భీమన చేర్కొనిన సాహిణిమారుడు మున్నగు వారికాలములతో పైకాలము సరిపోకుండుటచేతను భీమన యాకళింగ గంగుకాలమున కాక మరియొక కళింగగంగుకాలములోనివాఁడని నిర్ణ యించియున్నారు.

మఱియు వీరేశలింగముపంతులవారు సోమదేవరాజీయమున సాహిణిమారాదులు 13 వ శతాబ్దపువారై యుండుటచే చోడభూ పాలుఁడును భీమకవియును 13 లేక 14 శతాబ్దముల నుండియుందురని నిర్ణయ మొనరించియున్నారు.

మఱియు కవిజనాశ్రయములో గాన్పించుచున్న యీ రెండు పద్యములును విన్నకోట పెద్దనచే రచింపఁబడిన కావ్యాలంకారచూడా మణియం దుండెననియు ఆకారణమున భీమన విన్నకోట పెద్దన తరువాత నుగాని యాతనితో సమకాలికుఁడు గాని యైయుండునని తలంపవలసి యున్న దని వ్రాసియున్నారు.

ఉ. ద్వీపుల గ్రుంచి విశ్వజగ త్కీర్తి యుత్తమశక్తి జాంబవ
ద్ద్వీపమునందు గోపులకు నిమ్ముగ సేయుటకుం బ్రసన్నయై
గోపతిధేను నవ్విభునకుం దనవైభవమిచ్చెగాక యే
భూపతు లీవదాన్యగుణ బుద్ధుల నిల్పవహించి రుర్వరన్.

క. నీకరవాలము పాలై
నాకంబున కరిగి రాజనారాయణ యా
భూకాంతు లెంతచనునో
నాకవిటోత్తములదూల నడతురు కడిమిన్.

మఱియు వీరేశలింగముపంతులువారు సాహిణిమారనను గూర్చి చర్చించుచు,

ఉ. చక్కఁదనంబు దీవియగుసాహిణిమారఁడు మారుకైవడిన్
బొక్కఁపడంగలందు చలమూనుఁ బలముంగల మాచళుక్యపున్
జొక్కనృపాలుఁ డుగ్రుఁడయి చూడ్కులమంటలు రాలఁజూచినన్
మిక్కిలి రాజశేఖరుని మీఁపికివచ్చిన రిత్తమోపునే.

ఈపద్యమున భీమకవిచే శపింపఁబడినమారన ప్రతాపరుద్రుని యాస్థానమునకరుదెంచెనని సోమదేవరాజీయమున చెప్పఁబడియుండుటచే నీతఁడు ప్రతాపరుద్రునికాలమున నుండెననియు ఆ కాలమున చోక్కనృపాలుఁడును భీమనయు నుండెనని సూచియగుచున్నదని వ్రాసి యున్నారు.

మఱియు, యీక్రిందిపద్యమును వీరేశలింగముపంతులవారిట్లు సవరించియున్నారు.

మ. ఘనుఁడన్ వేములవాడవంశజుఁడ ద్రాక్షారామభీమేశనం
దనుఁడన్ దివ్యవిషామృతప్రకటనానాకావ్యధుర్యుండ భీ
మన నాపేరు వినంగ జెప్పితి దెలుంగాధీశ కస్తూరికా
ఘనసారాది సుగంధవస్తువులు వేగందెచ్చి లాలింపుమా.

ఈపద్యము రెండుమూడుపాఠభేదములతోఁ గాన్పించుచున్నది. వీరేశలింగముపంతులవారు దెలుంగాధీశయను పాఠమును గైకొనిరి. శ్రీరామమూర్తిపంతులువారు వెలుంగాధీశ యను పాఠమును గైకొనిరి. జయంతి రామయ్యపంతులుగారు ఈరెండింటిని పోవిడచి కళింగాధీశ యను పాఠమే యుచితమైన దని జెప్పియున్నారు.

పంతులువారు తాము గైకొనినపాఠము ననుసరించి తెలుంగాధీశుని తెలుంగురాయ డగునని తలంచి,

క. ఆమాచనృపతిసుతుఁడు మ
హామహుఁడెఱపోతన క్షమాధీశ్వరుఁడా

శ్రీమంతు సుతులు జగదభి
రాములు శ్రీతెలుంగురాయ రామనరేంద్రుల్.

అని రామరాయ విలాసమున చెప్పఁబడిన గుడిమెట్టరాజగు నెఱిపోతన కుమారుఁడైన తెలుంగురాయఁడొకఁడు గాన్పించుచున్నాఁడనియు భీమకవి యాతనిఁగూర్చియే పైపద్యముఁ జెప్పియున్నాఁడనియు ఆ తెలుంగురాయలు 13 వ శతాబ్దమధ్యమునను౦డెననియు కావున భీమనగూడ (పైపద్య మీతెలుంగురాయలను గూర్చియేయైనయెడల) తిక్కనకాలమునవో లేక తిక్కనకుఁ గొంచెమీవలనో యుండియుండు నని వక్కాణించియున్నారు. మఱియు తిక్కన యీతని పూర్వకవిస్తుతులలో జేర్పనందున భీమన తిక్కనకు పూర్వుఁడుకాఁడనియే తోఁచుచున్నదనిరి. కాని కస్తూరికాదానము చేయుటయందు బ్రసిద్ధిగన్న తెలుంగురాయలు సాంబరాయుని కుమారుఁడు పదునాలుగవశతాబ్దమువాఁడైయున్నాఁడు గావున భీమనవర్ణించిన యాతఁడు సాంబరాయుని కుమారుఁడుగాని నెఱిపోతన కుమారుఁడు కాఁడని సిద్ధాంతీకరించియున్నారు. అందువలన భీమన 14 వ శతాబ్దమువాఁడయ్యెను.

గురజాడ శ్రీరామమూర్తిగారు పైపద్యమున తెలుంగాధీశయను చోట వెలుంగాధీశయని యుండవలయునని యు, అపుడు వెలుంగాధీశ యనగా విపులాదిత్యుఁడనియు నర్థముచేసి భీమకవి ప్రాచీనుఁడని నిర్ణయించియున్నారు. రామయ్యపంతులుగారు పైపద్యమున రెండు పాఠభేదములను విడచిపెట్టి కళింగాధీశయనియున్నచో నిరువురివాదములు సమంజసముగానుండుననియు పైగా భీమన కళింగరాజులయొద్దకుఁ బోయిన ట్లితరపద్యములవలన గూడ తెలియవచ్చుటచే నాపాఠమే సమంజసమనియును పైరెండుపాఠములందును వ్యాకరణదోషముండుట నవి భీమనప్రయోగములు కావనియు వానిని ద్రోసివైచి తమపాఠమునే స్థిరపరచి భీమకవి

12 వ శతాబ్దమువాడని వ్రాసియున్నారు. వీరు పై పాఠభేదముల నిట్లు పదవిభాగము చేసియున్నారు.

తెలుంగు + అధీశ.; వెలుంగు + అధీశ. ఈపదవిభాగము సరి కాదనియు వెలుంగు + అధీశయని యుండవలెననియు భారతి 3 వ సంపుటమున వేములవాడభీమకవిజన్మస్థానాదికముల విమర్శించుచు శేశపల్లి కామరాజుగారు వ్రాసియున్నారు. "తెలుంగాధీశ" అనునది సాధుప్రయోగమని శ్రీనాథుని యీచాటువువలన దెలియవచ్చుచున్నది.

శా. అక్షయ్యంబుగ సాంపరాయుని తెలుం గాధీశ కస్తూరికా
భిక్షాదానము సేయరా సుకవి రాడ్బృందారకశ్రేణికిన్
దక్షారామచళుక్య భీమవరగంధ ర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించు దద్వాసనల్.

కావున "తెలుంగాధీశ" యనునది సాధువే యగును. కాని భీమన జెప్పినపద్యమున వెలుంగాధీశ కళింగాధీశ " అను పాఠభేదము లెట్లు కలిగినవో గనుగొనుటకు వీలుగాన్పింపదు. వీరేశలింగము పంతులవారు జూపిన యాధారము ఖండింపఁబడుట కాధారములు పెక్కులు గాన్పించుచున్నవి.

1 రాజకళింగగంగును గూర్చి వ్రాయుచు నీతనికాలము సాహిణిమారనకాలముతో సరిపోవకుండుటచే భీమకవి కళింగదేశమును బరిపాలించిన మరియొక కళింగగంగుకాలములోనివాడనియు, ఆకాలముననే సాహిణిమారన యుండినట్లును వ్రాసియున్నారు. ఈసాహిణిమారన ప్రతాపరుద్రుని యాస్థానమున నుండినట్లు దెలుపు సోమదేవరాజీయము నాధారముగాగొని భీమనకూడ ప్రతాపరుద్రునికాలమునాఁడని సమర్థించియున్నారు. కాని సాహిణిమారన (భీమకవిచే దిట్టబడిన యాతఁడు) ప్రతా

వరుద్రుని కాలమునను న్నవాడు కాక యంతకుపూర్వ ముండిన యింకొకఁడై యుండినయెడ వారియాధారము నిరాధారమగును. భాస్కరరామాయణమును కృతిగొన్న సాహిణిమారన యొకఁడు గాన్పించుచున్నాఁడు. మరియు సాహిణిమారన యను నొకనినిగూర్చి కొన్ని చాటువులు కాన్పించుచున్నవి. వాని నిట నొసఁగుచున్నాఁడను.

క. అప్పులిడునతఁడు ఘనుఁడా
అప్పులొసగిమరలఁ గొంచు నాతఁడు రాజా!
చెప్పగవలె సాహిణిమా
రప్పను దానమున ఘనుఁడు రాజనటంచున్.

క. మాటాడరాదు సభలన్
మాటాడినదప్పరాదు మగసింగమునకున్
మాటయె మానము కాదా
సాటువుగలవారికెల్ల సాహిణిమారా.

క. ఇంతులమనముల నరిసా
మంతుల మనములను బుద్ధిమంతుల మదిలో
జింతింపని బ్రతుకేటికి
సంతతసత్కీర్తిహార సాహిణిమారా.

శ్లో. అజాగళస్తనస్యేవ తస్య జన్మ నిరర్థకమ్ (?)
నాసాంతరే కేశమథాండయుగ్మమ్
వృథాసృజంసాహిణిమారభూపం
పూజాం నలేభే భువిపద్మయోనిః.

ఈపద్యములవలన సాహిణిమారన భూపాలుఁడని చెప్పఁబడినది. భీమకవి సాహిణిమారనపై జెప్పియున్న పద్యమును,

ఉ. చక్కఁదనంబుదీవియగు సాహిణిమారుఁడు మానుకైవడిన్
బొక్కఁబడంగలండు చల ముంబలముంగల యాచకుల్కృపన్

జొక్కనృపాలుఁ డుగ్రుఁడయి ౼ చూడ్కులమంటలురాలజూచినన్
మిక్కిలిరాజశేఖరుని ౼ మీఁదికివచ్చిన రిత్తవోవునే !

ఈపద్యమువలన సాహిణిమారన యొక భూపాలుఁడై గాని, భూపాలునకు ప్రతినిధియై గాని, చొక్కభూపాలునిపైకి దాడివెడలెనని తోఁచుచున్నది.

భాస్కరరామాయణమును కృతిగొన్న సాహిణిమారననుగూర్చి భాస్కరరామాయణమేమి దెలుపుచున్నదో యించుక విచారింతము.

బాలకాండమున నీసాహిణిమారననుగూర్చి జెప్పబడినపద్యములుగాని యీతనివంశచారిత్రమునుగూర్చినపద్యములు గాన్పింపవు. అయోధ్యాకాండము మొదట,

క. శ్రీరమణీరమణసుధా
ధారాళదయాకటాక్ష ౼ ధామస్మిత దృ
క్కైరకవితరణకరణ వి
శారదబుద్ధియకుమార ౼ సాహిణిమారా.

ఆశ్వాసాంతమున.

ఉ. రాజకిరీటకీలితవి ౼ రాజితనూతనరత్నరాజి నీ
రాజనమంగళాచరణ ౼ రంజితపాదసరోజఖడ్గ ధా
రాజయలభ్యమానరుచి ౼ రద్యుతిమన్మణిశాతకుంభ వి
భ్రాజిత సద్వితీర్ణరిపు ౼ పార్థివఖండన కీర్తిమండనా ?

యనియు, యరణ్యకాండమున యాశ్వాసాంతమున.

మాలిని. వితరణఖనియుద్య ౼ ద్వీర్యశౌర్యప్రభావో
న్నతుఁడు భుజబలాత్యు ౼ న్మాదవిద్విడ్ధరిత్రీ

పతి'' హారణసమద్భా శ్రీ భాగగమ్యుండు సంభా
వితపరిణతచిత్తో శ్రీ ర్వసురుండుర్వి నెందుఁ గ.

యరణ్యకాండము ద్వితీయాశ్వాసమున,

క. రామాకుచయుగళీ
హారిద్రోల్లసితవత్స శ్రీ హరిచరణసరో
జారాధ్యుఁడు మారయ ధర
ణీ రమణో త్తముఁడు'' సాహి శ్రీ ణీతిలకమిలన్.

ఈపద్యములవలన నీతఁడు నృపాలుఁడై యుండునని తెలియ వచ్చుచున్నది.

సాహిణి మారన యశ్వసైన్యమున కధిపతియనియు భాస్కరరామాయణమును భూపాలుఁడు కృతిగొన తిరస్కరించినంతనే తద్గ్రంథకర్త భూపాలునిపై గోపించి యీకృతిని గుఱ్ఱపువానికైన కృతియిచ్చెదనని బలుకగా సమీపముననున్న మారన యాకవిపుంగవునకు సమస్కరించి దేవా! తమమాట నిలుపుకొనుఁడు. గ్రంథమును నాకు కృతియొసంగుఁడు. అని వేడుకొని యుండెననియు జెప్పబడుకథ సత్యమునకు దూరమైయుండునని జెప్పుట కిసుమంతయేని సందియముండదు. సాహిణిమారన నిక్కముగా యశ్వసైన్యమున కధిపతియైయున్నయెడల భాస్కరుఁడు తన రామాయణమున నాతని నిజపదవిని కప్పిపుచ్చి యాతని ధాత్రీపతియనియు, ధరణీరమణోత్తముడనియు వర్ణించియుండడు.

ఈవిషయమువిమర్శన మాచరించుట నిరువురు ముగ్వురు మారలుండి యుండిరేమోయని తలంచుట కవకాశము కలుగుచున్నది. కాన వీరిలో నెవ్వఁడు చొక్కభూపాలునెదిర్చి భీమకవి శాపోపహతుడై మడసియుండెనో నిర్ణయించుట కవకాశము గాన్పింపదు.

ఇంకొకవిషయమునుగూడ నిట విమర్శింపవలసియున్నది "చక్కదనంబుదీవియగు సాహిణిమారఁడు" అను పద్యము వేములవాడభీమకవి విరచితమని వ్రాసిన యాతఁడు యప్పకవీయమును రచించిన యప్పకవి. ఈ యప్పకవియొకచో భీమన నన్నయభట్టుతో సమకాలికుఁడని వ్రాసియున్నాఁడు. ఈరెండిటికిని సమన్వయముకుదురుటకై నన్నయభట్టుకాలమున కించుక యావలీవల సాహిణిమారనయను నృపాలుఁడుండె నని తలంపవలసివచ్చుచున్నది. అట్లు సమన్వయము చేయుట సమంజసము కాకున్నచో పై పద్యము భీమకవి రచించినదై యుండదు. ఈయప్పకవి సాక్ష్యముదప్ప నీవిషయనిర్ధారణ మొనర్పగల నితరసాక్ష్యములు గాన్పింపకుండుటచే పైన వ్రాసినరీతి సమర్థించుట యుక్తమని దోచుచున్నది.

2. కావ్యాలంకారచూడామణిలోని పద్యములు కవిజనాశ్రయమున నున్నవనియు నాకారణమున భీమన 14 వ శతాబ్దమువాఁడని జెప్పుట దగదు. ఏలననగా కొన్నిప్రతులలో మాత్రమే యట్లుండెను గాని యన్నిటను యట్లు లేదు. భీమన లక్ష్యములను లక్షణములను దానే జెప్పియుండెనుగాని యితరులపద్యము లెన్నడును యుదాహరించి యుండలేదు. కాని యీపద్యములనుబట్టి భీమనకాలమును నిర్ణయింపగడంగుట సరియైనమార్గముగాదు. పైగా నీపద్యములు కావ్యాలంకారచూడామణియందు యాదేశవళికి లక్షణలక్ష్యములుగా నున్నవి. కవిజనాశ్రయమున భీమన యాదేశవళి జెప్పియుండలేదు. అప్పకవీయమున జెప్పబడినట్లు.

ఆ. వె. ... ... ...
... ... ...
వికటకవులుకొన్ని వింతలుగల్పించి
కవిజనాశ్రయమున గలిపినారు.

ఎవరోకొంద రీపద్యములు రెంటిని కవిజనాశ్రయమున గలిపి యుంచరు.

3 రాజకలింగగంగు కాలము పీరేశలింగం పంతులవారొసంగిన కలింగదేశపు పరిపాలకుల వంశవృక్షము ననుసరించి రాజకలింగ గంగు 1026 సం॥రము ప్రాంతముననుండి యుండెనని తెలియవచ్చుచున్నది.

కాని పంతులవారు ఈకళింగగంగు కాలము సాహిణిమారనమున్నగు వారికాలముతో సరిపోవనియు నందువలన భీమకవి కళింగరాష్ట్రమును పరిపాలించిన మరియొక కళింగగంగుకాలమువాడై యుండుననిమాత్రము సూచించి వదలిపైచిరి. అట్లు విడచుట సమంజసము కాజాలదు. సాహిణిమారనమున్నగువారికాలమున నున్న కళింగగంగెవ్వడో యేయేటే డేసంవత్సరమున రాష్ట్రపరిపాలనాభారము వహించెనోకూడ జూడవలసి యున్నది. ఇంతియెకాక భీమన బేర్కొనియున్న చొక్కభూపాలుఁడు మున్నగువారుకూడ సాహిణిమారనయున్నకాలమున నుండినట్లు జూప వలసి యున్నది. అట్లుచేసి యుండ లేదు.

గురజాడ శ్రీరామమూర్తిగారు భీమకవి నన్నయభట్టునకు బూర్వుడై యుండునని వ్రాసియున్నారు. వారు శ్రీనాథవిరచితమైన యీక్రిందిపద్య మాధారముగా గొనియుండిరి.

సీ. వచియింతువేముల 5 వాడ భీమనభంగి
నుద్దండలీల నొ 5 క్కొక్కమాటు
భాషింతునన్నయ 5 భట్టమార్గంబున
నుభయభాషాప్రౌఢి 5 నొక్కమాటు
వాకృత్తుదిక్కయ 5 జ్వప్రకారము రసా
భ్యంచితబంధముగ నొ 5 క్కొక్కమాటు

వరిఢవింతు ప్రబంధ కౌ పరమేశ్వరునిసేవ
సూక్తివైచిత్రి నాకౌ కొక్కమాటు
నైషధాదిమహాప్రబంధములు చెక్క
జెప్పినాడవుమాకు నా కౌ శ్రీకృడవనఘ
యిపుడు చెప్పదొడంగిన కౌ యీప్రబంధ
మంకితముసేయు వీరభ కౌ ద్రయ్యపేర.

ఈపద్యమువలన భీమకవిపుంగవుఁడు శ్రీనాధునికాలమునాటికే నన్నయకు పూర్వుడని కొందరభిప్రాయపడుచుండిరను విషయము స్పష్టపడుచున్నది. శ్రీనాధుఁడు 14 వశతాబ్దమువాఁడై యుండెను. (1380-1450 ప్రాంతములవరకుండెనని తెలియవచ్చుచున్నది.) వీరేశలింగంపంతులవారు వేములవాడభీమకవి 14 వ శతాబ్దమువాడని వ్రాసియున్నారు. అదియే నిక్కమవమైనయెడల తనకించుమించుగ 50 లేక 60 సంవత్సరములకు పూర్వుడై యున్న భీమకవిని నన్నయకుపూర్వము స్తుతించుటకు శ్రీనాధుడంత తెలియనివాఁడాయనుసందియ ముదయించుచున్నది. కావున భీమన 14 వ శతాబ్దమువాడుకాడని దృఢముగా జెప్పవచ్చును.

మరియు వీరేశలింగముపంతులువారు భీమకవిచరిత్రమును వ్రాయుచు దిక్కన మంచెనమున్నగువారు భీమనను పూర్వకవిస్తుతిలో జేర్పలేదని వ్రాసియున్నారు. కవిస్తుతి దేవుడుగాని, తండ్రితాతలు గాని స్వప్నమునగాన్పించి కావ్యనిర్మాణమునకు గడంగుమని ప్రోత్సహించుటమున్నగునవి గావించుటకు తిక్కనయే మొదటివాఁడని వీరేశలింగముపంతులువారు వ్రాసియున్నారు. అట్టిసమయమున దిక్కనగాని దిక్కనసమకాలీనులుగాని దిక్కన కించుమించుగ నాటిలీవలవారు గొందఱు కవిస్తుతిలో భీమనను జేర్కొనకుండుటచే భీమన పదునాల్గవశతాబ్దమువాడనవచ్చునా?

భీమనను పూర్వకవిస్తుతిలో ననంతామాత్యుఁడు జేర్చియుండెనని మ. రా. రా. మలకపల్లి పెద శేషగిరిరావుగారు తమ "వేములవాడభీమకవి" అను గ్రంథమున వ్రాసియున్నారు. వారుదాహరించిన పద్యమియ్యది.

ఉ. నన్నయభట్టుతిక్కకవి నాచనసోముని భీమనార్యుఁబే
రెన్నికఁదిమ్మప్రాడి యమరేశ్వరు భాస్కరు శంభుదాసుసి
సన్నుతిఁజేసి వాక్యసరసత్వము వీనులకింపుమీఱ న
త్యున్నతిగా నొనర్తు నెఱిమోఘులు మేలన మేలుగావుతన్.

కాని భోజరాజీయమున నీ పద్యము విశేషభేదములతో నున్నది. ఆపద్యమును గూడ నిచ్చట యొసంగుచున్నాడను.

ఉ. నన్నయభట్టు దిక్కకవినాయకు భాస్కరు రంగనాథు బే
రెన్నిక కెక్కినట్టి యమరేశ్వరు నెఱ్ఱనమంత్రి నాదిగా
జన్నకవీంద్రులన్ నవరసస్ఫుటవాణు లనంగ ధాత్రిలో
నున్నకవీంద్రులన్ దలతు నుల్లమెలర్పగ వాగ్విభూతికిన్.

ఈ పద్యమునకు మొదట నొసంగబడిన పద్యము పాఠాంతరమై యుండెనేమో కాని కవులచరిత్రమున గాని, భోజరాజీయము అచ్చుప్రతిలోగాని మొదటి పద్యము గాన్పింపదు. మ॥ రా॥ రా॥ మ. పెద శేషగిరిరావుగారి కాపద్యమెట్లు యెచ్చట లభించినదో యెఱుఁగుటకు వీలు గాన్పింపకున్నది.

పరికించిచూడగా భీమకవి నన్నయభట్టున కించుకపూర్వము జనించి 12 వ శతాబ్దమున నించుమించుగ నేబదిసంవత్సరములవరకు జీవించియుండునని దోచుచున్నది. అందువలన భీమకవి 1070 ప్రాంతము ల జన్మించి యించుమించుగా యెనుబది సంవత్సరములు అనగా 1150 సంవత్సర ప్రాంతమువరకు జీవించియుండెనని చెప్పవచ్చును. అప్పుడు

అప్పకవి జెప్పినపలుకులు యథార్థమగును. అప్పకవి జెప్పినట్లు "చక్కదనంబుదీవియగు" యనుపద్యమునకు గుఱియైన మారన వేరొకఁడై యుండునేగాని ప్రతాపరుద్రీయవ్యాఖ్యానమునకు జనుదెంచిన మారననే భీమన దిట్టి యుండెనని దలంచుట సరికాదు.

మ॥ రా॥ రాజశ్రీ మలకపల్లి పెద శేషగిరిరావుగారు తమ వేములవాడభీమకవిచరిత్రమున పావులూరి మల్లన రాజరాజనరేంద్రునిచే నవఖండవాడయను గ్రామమును దానముగా బొందియుండెనని జెప్పుచు నీ క్రిందిపద్యము నొసంగియున్నారు.

ఉ. శ్రీలలనేశు డాంధ్రనృపశేఖరుఁడై చనురాజరాజభూ
పాలకుచేత బీఠపురపార్శ్వమున న్నవఖండ వాడయన్
ప్రోలు విభూతితోఁబడసి భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడ రాజపూజితుఁడ శివ్వనపుత్రుఁడ మల్లనాఖ్యుఁడన్.

కాని యీ పద్యము యించుక మార్పుజెందినట్లు దోచుచున్నది. కందుకూరి వీరేశలింగము పంతులవారు యీ పద్యమును గూర్చి యధికముగా విమర్శించి యిట్లా పద్య ముండెనని జెప్పియున్నారు.

ఉ. శ్రీలలనేశు డాంధ్రనృప శేఖరుఁడై చనురాజరాజభూ
పాలకుచేత బీఠపుర పార్శ్వమున న్నవఖండవాడయన్
బ్రోలు విభూతితోఁబడసెఁ భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు శివ్వనపుత్రుఁడు మల్లఁడున్నతిన్.

మఱియు యీ పద్యములనే గాక మ. రా. రా. శేషగిరిరావుగారు పీఠికాపురము కుక్కుటేశ్వరస్వామివారి యాలయములో నొక శాసన మున్నదనియు దానియడుగుభాగమున "నిది వేములవాడ భీమకవి కృతమ్" అని యున్నదనికూడ వ్రాసియున్నారు. కాని ఆశాసనమును యిచ్చి యుండలేదు. అదియే నిక్కువమై పైన వారొసంగిన

పద్యమే మల్లనకవిప్రోక్తమైనయెడల భీమకవి నిక్కముగా నన్నయ భట్టుకాలమున నుండినట్లే తలంపవసియుండును.

ఈవిషయమున నింకొక్కవిషయమును గూడ విమర్శింపవలసి యున్నది. ఎఱ్ఱాప్రెగడ భారతారణ్యపర్వమును పూరించుటనుగూర్చి కట్టుకథయొకటి యున్నది. జనశ్రుతముగా వచ్చుచున్న అయ్యది యసత్యమనుటకు వీలుకాన్పింపదు.

భీమకవి నన్నయభట్టును అరణ్యములోననే మరణింపుమని శపించినట్లును, ఆవిధముగానే నన్నయ యరణ్యపర్వమును ముగింపకయే మరణించినట్లును, తదుపరి యెవ్వరును భారతముజోలికిపోక యట్టె విడచిపెట్టిరనియు, కొంతకాలము చనినపిమ్మట, తిక్కనసోమయాజి భారతమును దెనిగించుటకు పూనుకొని యరణ్యమును పూరింప యత్నించిన నన్నయవలె తనకెక్కడచావుకలుగునోయని యాపర్వమును పూరింప కట్లే యుంచివైచి శేషించిన 15పర్వములను రచించెను. ఆతనితరువాత కొన్నిసంవత్సరములకు ఎఱ్ఱాప్రెగడ అరణ్యమును పూరింపనిశ్చయించి, భీమకవిశాపము తనకుగూడ తగులునే మోయనుభయమున శేషించినభాగమును రాజరాజనరేంద్రునకే యంకిత మొసంగినట్లుగ వ్రాసి పూరించెను.

ఇప్పటికిని చాలమంది భారతమునంతను వరుసగా చదువరు. చదువదలంచినచో విఘ్నముగలుగుటో హానిసేకూరుటో గలుగుచునే యున్నది. ఇక్కథకూడ భీమకవి నన్నయకు సమకాలీనుడని తెలుపుచున్నది. నన్నయభట్టునకు పిమ్మట రాజరాజనరేంద్రునియాస్థానమున నుండెననియు, ఆకాలమున గ్రంథములేమియు రచింపలేదనియు, కొన్ని శాసనముల మాత్రమే రచించియుండెననియు మ. రా. రా. మలకపల్లి పెదశేషగిరిరావుగారు వ్రాసియున్నారు. భీమకవివిరచితములైన శాసనములలో నందంపూడి శాసనము ముఖ్యమైనదనిరి.

## భీమకవిజన్మస్థానము.

వేములవాడభీమకవి గోదావరీమండలమున ద్రాక్షారామమున కైదామడక్రోసులదూరముననున్న వేములవాడ (ఇపుడు వేగులవాడ యని వ్యవహరింపబడుచున్న) గ్రామమున జన్మించియుండెనని పలువు రభిప్రాయపడుచున్నారు. మఱికొంద ఱీతఁడు గోల్కొండకు సమీపముననున్న వేములవాడ యనుగ్రామమున జన్మించియుండెనని దలంచుచున్నారు. ఈతనిజన్మస్థలనిర్ణయమునుగూర్చి వాదోపవాదములు జరుగుచున్నవి.

క. వేములవాడను వెలసిన
భీమేశ్వరు కరుణగల్గు భీమసుకవి నే
గోమటి రేచనమీదను
సీమహి గవులెన్న చంద మెలమి రచింతున్.

కవిజనాశ్రయమును ముద్రించుచు జయంతిరామయ్యపంతులు వారీపద్యమును యవతారికలోఁజేర్చి ముద్రించియున్నారు. వారు యీపద్యము నాధారముగాగొని యీభీమకవి గోల్కొండప్రాంతమువాఁడై యుండునని నిశ్చయించిరి. వారుపరిశీలించిన కవిజనాశ్రయప్రతులన్నిటిలోన నీపద్యము లేదు. ఒక్కప్రతియందుమాత్రమే యిది యున్నది. అందువలన నిది ప్రక్షిప్తముగునేమో యనుసందియ ముదయించుచున్నది. ఇంకను పంతులవారు భీమకవి నైజామిల్లాకా గోల్కొండసమీపస్థుడని రుజువుచేయుటకు గొన్నియాధారముల జూపినారు. వానినిగూడ నించుక పరిశీలింపవలసియున్నది.

వేములవాడ యనుటకు మాఱుగా శాసనములలో గొన్నిటియందు వేమ్బులవాడయనియు, వేమ్బులవాడయనియు నున్నదనియు నాటియు నచట భోగస్త్రీలు విశేషముగా నాట్యాలయముతనుండినకారణమున

నది వేములవాడయని వ్యవహరింపబడి క్రమక్రమముగా నది వేముల వాడయనియు వేమనవాడయనియు బిలువబడియుండెనని యూహింప వలసియున్నదనియు వ్రాసియున్నారు. "వేమనవాడను వెలసిన భీమేశ్వర కిరణగల్లు" ఈవిషయము నిట్లుదృఢపరుచుటకు యీక్రింద నొసంగ బడినయాధారముల నిచ్చియున్నారు.

"వేములవాడభీమకవి యీగ్రామ నివాసియని యీగ్రామములో పరంపరా చెప్పుకొనువాడుక కలదు."

"భీమకవి యీగ్రామములో జన్మించి ప్రబుద్ధుడై ప్రాగ్దేశమందు కళింగరాజుండేగ్రామమునకుపోయినట్లు వినుకిలి యున్నది."

"ఆభీమకవి వైదికుడే. పూర్వమందు మాకువారికి సంబంధంబులు వుండెనని చెప్పంగ వినియున్నాము."

పైవాక్యములు లాగ్రామమందలి తగుమనుష్యులు వ్రాతమూలక ముగా తెలియపరచి భీమకవిచే నన్నము సున్నము అప్పలుకప్పలు అయ్యెనను కథనుగూడ నుదాహరించి, "ఏయింటిలోపల ప్రయోజనం అనగా అన్నసంతర్పణ అయియుండెనో ఆయింటివారునాటనుంచి అప్పాల (పప్పుల) వారని పేరుగలవారై యున్నారు. అంతకుముందు వీరియింటిపేరు కొండపలక అనియుండెను. ఆవంశపరంపరా యిదివరకు జరుగు చున్నది."

ఈవాక్యములను గూడ వ్రాసియుండిరని జయంతి రామయ్య పంతులువారు వ్రాయించియుండిరి. మఱియు వేములవాడక్షేత్రమహాత్మ్యములో నాస్థలమునకు దక్షవాటియనుసంజ్ఞకూడ నున్నదని యీ క్రిందివాక్యముల బ్రమాణముగా నొసగియున్నారు.

శ్లో. ఏవంశ్రుత్వావచోదేవా వీరభద్రముఖేతం
ప్రణేముశ్చ శివా తత్రపూజయామాసు రుత్తమా

ఉపయాతౌ తతో భూయోమిహ వక్త్ర శిఖరంశివౌ
జనయామాసతు స్తత్రశివలింగం సనాతనమ్
దక్షవాట్యాంభీమలింగం యత్రరాజేశ్వరశ్శివః
అస్యలింగస్యమహాత్మ్యం దృష్ట్వాన శ్వేహావిర్ముఖాః
పుపూజుస్సర్వ కామైశ్చ వీరభద్రస్యసన్నిధౌ,
సదేవతౌ ఘైరపి పూజ్యమానం
విలోక్య భీమేశ్వర మప్రమేయం
అథోక్షుజాద్యై రభినంద్యకామాన్
దదౌ మహాత్మాశివ సద్గుణేభ్యః.

ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే రాజేశ్వరమహాత్మ్యే శివ స్వరూప దర్శనం నామచత్వారింశోధ్యాయః.

పైశ్లోకములవలన భీమేశ్వరప్రతిష్ఠకు పూర్వము అక్కడ రాజేశ్వరు డున్నట్లు గాన్పించుచున్నది. కాని గ్రామస్థులు చెప్పినట్లుగా రాజేశ్వరునకే భీమేశ్వరుడను నర్థము వచ్చుటలేదు. గ్రామస్థులు జైనవిగ్రహములు దేవాలయమున లేనట్లు వ్రాసియున్నట్లు జెప్పిరి. జైనవిగ్రహములు పెక్కులుగలవని శ్రీ మాచార్యులవారు వ్రాసియుండిరి. శ్రీ శేషాద్రిరమణకవులుగూడ జైనవిగ్రహములు గలవని వ్రాసియుండిరి. ఇట్లు పరస్పరవిరుద్ధమైన యీప్రమాణము లెంతవఱకు నమ్మదగినవో పాఠక మహాశయులే యూహింతురుగాక.

గోదావరీమండలములోని ద్రాక్షారామమునకు సమీపమున నున్న వేములవాడ (ఇప్పుడు వేగులవాడయని పిలువబడుచున్నది) భీమన జన్మస్థానమై యుండుననుటకు గల యవకాశములగూడ పరికింతము. ద్రాక్షారామమున కనాదినుండియు దక్షవాటికయనియు నందున్న దేవాలయమునకు భీమేశ్వరాలయమనియు గ్రంథస్థములైన యాధారములు పెక్కులున్నవి. వానిలో కాశీఖండము భీమఖండము మున్నగునవి.

సీ. పట్టిసశ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథు నంఘ్రులకు నెరగి
పురశాసను ననంత భోగేశ్వరస్వామి
హిమశైల కన్యకాధీశుఁ గొల్చి
పద్మాద్రిపై రుద్రపాదంబు లర్చించి
చేరి మార్కండేయ శివు భజించి
కోటిపల్లీతీర్థకుండలాముఖముల
నర్ధేందుధరు విహారపాత్రుఁ దలచి
పల్వలస్థానమున భూతభర్త నిలిపి
కణకగాంతేయమున వృద్ధగంగఁ గ్రుంకి
దక్షవాటిక సప్తగోదావరమున
మునిగి భీమేశ్వరుని గాంచె మునివరుండు.

కాశీఖండము ఆ 3 ప 16

శా. ప్రాతఃకాలము తీవ్రభానుఁ డుదయింపన్ సప్తగోదావరీ
స్రోతఃపూరమున న్మునింగి యభవున్ సోమార్ధచూడామణిన్
జ్యోతిర్లింగమయస్వరూపుఁ గొలిచెన్ శుద్ధాంతరంగంబునన్
ఖ్యాతిప్రత్యమహాప్రభావనిధి లోపాముద్ర భీమేశ్వరున్.

... ... ... ...

క. దక్షిణవారాణసియగు
ద్రాక్షారామంబు సొచ్చి తరుణేందు ధరుఁ
వీక్షించిన గోలెను గా
శీక్షేత్రాలోకసుఖము చేకుఱె ఋషికిన్.

కాశీఖండము.

సీ. కాంతిసంపద నేల కైవారమొనరింప
విధుబింబమున నుద్భవించిరనిన

మాధుర్యగుణమేల ♦ మాటిమాటికి జెప్ప
నమృతాబ్ధి నవతార ♦ మందిరనిన
దేజోవిశేషంబు ♦ తెలుఁగుపల్కఁగ నేల
విద్యుల్లతలలోని ♦ వెడలిరనిన
మోహనాకృతియేల ♦ మనుపూడికొనియాడ
బుష్పచాపునివింట ♦ బుట్టిరనిన
సంభవించిరి గంధర్వ ♦ జాతిననిన
గలితనంబేల వెన్నాట ♦ కంబుసేయ
ననగ భీమేశ్వరునిగొల్తు ♦ రప్పురమున
సానులనుపేరి యప్సర ♦ శ్చంద్రముఖులు.

సీ. గజచర్మమెన్నఁడో ♦ కాని నిచ్చలుగట్టు
పసిఁడిజమ్మలపట్టు ♦ పచ్చడంబు
భసితమెన్నఁడో కాని ♦ ప్రతిదినంబు నలందు
మలయజంబుకురంగ ♦ మదము గూర్చి
నిడుదపాములరాజు ♦ తొడవులెన్నఁడో కాని
తారహారములు ని ♦ త్యము ధరించు
నృకరంకరుండ మా ♦ లికలెన్నఁడో కాని
ధరియించు కల్హార ♦ ధామ మెపుడు

తే. కాటనడుచక్కి నెన్నఁడో ♦ కానియుండు
దక్షవాటీసువర్ణ ♦ సౌధముల మీఁద
నెన్నఁడో పిశాచులకుఁగాని ♦ యిందుముఖుల
నెల్లకాలములదలచు భీ ♦ మేశ్వరుండు.

సీ. ఒకవేళధరియించు ♦ యువనాశ్వుఁడిచ్చిన
కట్టాణిముత్యాల ♦ కంఠమాల

మాంధాతృ డిచ్చిన § మాణిక్యఖచితకే
యూరంబు ధరించు § నొక్కవేళ
నిషధాధిపుడిచ్చిన § హీరాంకురంబుల
యుంగరంబుల ధరించు § నొక్కవేళ
ఘనచక్రవర్తి యి § చ్చిన ప్రవాళంబుల
యొడ్డాణము ధరించు § నొక్కవేళ
తే. వేడ్కధరియించు నొక్కొక్క § వేళయందు
భరత దుష్యంతనా § భాగసహుష
నలభగీరథ నృగమహీ § నాథదత్త
హేమమణిభూషణములు భీ § మేశ్వరుండు.

సీ. పర్యంత మందార § పారిజాతకవనీ
రమమాణ నిర్ఝరీ § సముదయంబు
సరస రసాసిద్ధ § వరవారిసంపూర్ణ
గంభీరతరపరి § ఖాపయోధి
ప్రబల చింతారత్న § పాషాణ సంఘాత
వప్రరేఖాచక § వలయితంబు
గామధేనుసహస్ర § కఠినరింఖాటంక
దళనదంతురితర § థ్యాముఖంబు
తే. భద్రపాతాళ భైరవ § పాలితంబు
గుహ వినాయక రక్షణా § కుంఠితంబు
సప్తమాతృక పరివార § సంకులంబు
వసుమతీనూపురము దక్ష § వాటిపురము.

మ. అదె సంవేద్యము; కోటిపల్లెయదె; ద § క్షారామమున్ బట్టణం
బదె; యభ్రంకష సౌధకూటఘనహే § లావాసము ద్రాక్షాయసం

పదసొంపారెడు భీమలింగము మహా ప్రాసాద భూమీధరం
బిదె; సప్తర్షినదీప్రవాహమిదె; సం వీక్షింపు మేకాగ్రతఁ.

సీ. అగ్రజుండైనను నంత్యజుండైనను
బూబోడియైననుఁ బురుషుడైన
బరమ మూర్ఖుండైనఁ బండితుండైనను
దారిద్ర్యకుండైనఁ ధనికుడైన
బలవంతుడైనను బలహీనుడైనను
బ్రాయంపువాడైన బంగువైన
నాస్తికుండైనను నన్నృతవాదియునైన
బరగ గార్దభమైన బందియైన
గీ. గీటకంబైన బకమైన గ్రిమియునైన
బాదపంబైన దృణమైన బ్రాణరహిత
మై రహిని దక్షవన చతుర్ద్వారసీమ
బొందు గైవల్యకళ్యాణ భోగలక్ష్మి.
సీ. దక్షప్రజాధినా థ మహాధ్వరక్రియా
దీక్షాప్రజాధిగమ పుణ్య దేశమునకు
బ్రహ్మవిష్ణు పురంద ర ప్రధానసుపర్వ
పరమ సంయమి సభా భవమునకును
దాక్షాయణీ యోగ దహనార్చి రున్మేష
సామిధేనీమంత్ర జాతమునకును
వీరభద్రభుజావి హార హేలాసమా
రంభనాటకనాట్య రంగమునకును
నమృతమయ దివ్యతేజస్వ యంభులింగ
శాంతభీమేశ్వరేశ్వర స్థానమునకును.

దక్షవాటంబునకు మోక్ష । ధామమునకు
భోగజన్మస్థలమునకీ । పురముసరియె.

సీ. దక్షవాటీమహా । స్థానంబులో లేని
యమరులేస్థానంబు । నందు లేరు
దక్షవాటీ మహా । స్థానంబులో లేని
యర్థమేస్థానంబు । నందు లేదు
దక్షవాటీమహా । స్థానంబులో లేని
యమృతమేస్థానంబు । నందు లేదు
దక్షవాటీమహా । స్థానంబులో లేని
యజ్ఞమేస్థానంబు । నందు లేదు
దక్షవాటికసకల తీ । ర్థముల కిరవు
దక్షవాటిక సకల వి । ద్యలకుగరిడి
దక్షవాటికవిభవంబు । తానకంబు
దక్షవాటిక విభవంబు । తానకంబు
దక్షవాటికశివుని యం । తఃపురంబు. భీమఖండము.

క. సారమతి దక్షవాటిక
తూరుపుగవర్ణి బ్రసిద్ధి । తోవసియించున్
హేరాళ క్రీడాసం
చారిణి నూకాంబభక్త । జనరక్షణకై

క. మట్టయిన యట్టిదక్షుని
పట్టణమున దక్షిణంబు । పార్శ్వపుగవర్ణిన్
నెట్టుకొని వెలసి నిలిచిన
ఘట్టాంబిక గొల్వగలుగు । గామిత ఫలముల్.

భీమఖండము.

మరియు కాశికిని ద్రాక్షారామమునకు గల సామ్యములను వివరించుచు శ్రీనాథకవిసార్వభౌముడు భీమఖండములో యీదిగువ పద్యమును జెప్పియున్నాడు.

సీ. జహ్నుకన్యాతీర । సన్నివేశమునకు
దక్షిణాంభోరాశి । తటముసాటి
కమనీయమణికర్ణి । కాప్రవాహమునకు
సప్తగోదావరీ । జలముసాటి
కటకరక్షకుడైన । కాల భైరవునకు
బ్రకటపాతాళ భై । రవుడుసాటి
విశ్వాధి పతియైన । విశ్వనాయకునకు
భీమనాథేశ్వర । స్వామిసాటి,
మోక్షవిభవంబునకు సాటి । మోక్షలక్ష్మి
భోగమహిమంబునకు సాటి । భోగమహిమ
వారణాశికి శ్రీదక్ష । వాటమునకు
దారతమ్యంబు జర్చింప । ధర్మమగునె.

భీమఖండము.

సీ. కామ్యార్థ ఫలసమ । త్కారకల్ప తరువాటి
దళితపాతక కోటి । దక్షవాటి
ప్రణుతకల్యాణైక । గుణమణి వ్రజపేటి
ధాత్రీకటి శాటి । దక్షవాటి
సమ్మనీంద్రారామ । సస్యమేఘస్ఫోటి
దమితరోగనిశాటి । దక్షవాటి
రథ విమానాతప । త్రపతాకగజఘోటి
తాపాద్రిశతకోటి । దక్షవాటి

గీ. దర్పితాశాలతాకోటి కే దక్షవాటి
డనరునిగ మావిపురిచేటి కే దక్షవాటి
ద్వారసేవితకర్ణాటి కే దక్షవాటి
రక్షితేందు కిరీటి శ్రీ కే దక్షవాటి. రుక్మాంగదచరిత్రము-మల్లన.

ఈపద్యము లిట్టివలనను గోదావరీమండలములో ద్రాక్షారామము చాలపురాతనమైనదనియును, దక్షిణకాశి, దక్షవాటిక యనుపేరుల బరగుచుండుననియు, తేటతెల్లమగుచున్నది. ఆంధ్రదేశమునందంతటను పర్యటనమొనర్చిన శ్రీనాథుని వ్రాతలను పోవిడచి నిజాం రాష్ట్రములో వేములవాడ, వేమ్బలవాడయని పిలువబడు గ్రామమే దక్షవాటి యని తలంచుట సమంజసముకాదు.

జయంతి రామయ్యపంతులవారు గోదావరీమండలమునపూర్వము జైనమతప్రచారము గలదనుటకు సందేహము లేదని వ్రాయించియున్నారు. (చూ॥ కవిజనాశ్రయపీఠిక పే. 11.) కావున రేచనయు నీగోదావరీమండలమువాడై అయియుండును. భీమకవి గోదావరీమండలమువాడని చెప్పుటకాధారములు లభింపలేదు. రామయ్యపంతులువారు వ్రాసియుండిరి.

భీమన కళింగనగరము రాజమహేంద్రవరము మున్నగుపట్టణములకుబోయినట్లు గాన్పించుచుండుటయే యాధారముగానుండునా ? ఎక్కడో నైజాములోపుట్టినవాఁడు ఈరాజమహేంద్రవరము కళింగనగరమునకు వచ్చియుండెననుట నమ్మదగ్గినదిగా నుండలేదు. పైగా కవిజనాశ్రయావతారికలో నీయబడిన పద్యములన్నియు నొక్క 'జ' యను ప్రతిలో మాత్రమే యుండెనని రామయ్యపంతులువారు వ్రాసియుండిరి. తొమ్మిదిప్రతులలో లేక ఒక్కప్రతియందున్నదే సత్యమని వాదించుటకు దగునా? అవియేల ప్రక్షిప్తములు కాగూడదు. ఎవ్వరో

గ్రంథమునువ్రాసికొనుచు నాకద్యములను దానుస్వయముగారచించి తానువ్రాసినదాని కవతారికగా వ్రాసియుండును.

---

## భీమకవి జననము.

లోకమున నుద్భవించిన మహానుభావుల జన్మచారిత్రములలో నధికసంఖ్యాకము లొకవింతతో గూడియున్న చారిత్రములై యున్నవి. క్రీస్తుమత బోధకుడై యున్న యేసుక్రీస్తొక బాలికకుజన్మించియుండెనని యు, కావ్యత్రియమును నాటకత్రయమును రచించి లోకైకవిఖ్యాతి గన్న కాళిదాసకవిసార్వభౌముడొక త్రికాలవేదియగు మునిపుంగవునకు జన్మించినట్లును యిట్లే మహానుభావుల జననమునుగూర్చి వింతకథాంశ ములు జెప్పబడుచున్నవి. ఈభీమకవిజననమును గూర్చి గూడ నొకవింత జరిగినట్లుగ వనుశ్రుతముగ వినవచ్చుచున్నది. ఇందిమెకొక వేములవాడ భీమకవి రచించిన నొక యపూర్వజ్యోతిషగ్రంథమున కాంధ్రీకరణము జేయుచు నొక యాంధ్రకవిపుంగవుడాతని జన్మచారిత్రమునునిట్లభివరిం చియున్నాడు.

సీ. శ్రీకరంబైధర ॥ చెవులుగాంచినయట్టి
భీమ పురంబున ॥ ప్రేమమీర
భీమేశ్వరుండును ॥ ప్రియముతో భక్తుల
కోర్కెలొసంగుచు ॥ కొమరుమిగుల
నొక నాడుతత్పురి ॥ యువతులు గొండఱు
భక్తిభీమేశ్వరు ॥ భవమునకు
బోయిపుత్రులవేడ ॥ ముగ్ధత్వముననొక్క
విధవ కుమారుని ॥ వేడ్కగోర

నా లేమ ముగ్ధత ఁ కపహసించుచునల
భీమేశ్వరుడు పుత్రి ఁ ప్రీతినొసగ
నా కాంతగర్భిణి ఁ నై కాంచెదనయుని
కలియుగాదిని ప్రేమ ఁ గడలుకొనగ
బ్రిభవవర్షంబున ఁ శ్రావణమాసంపు
శుక్లపక్షంబున ఁ శోభనంబు
మీఱఅపంచమిశుక్ర ఁ వారంబుననుహస్త
యందు కన్యాలగ్న ఁ మందు వెలయు
వెలివెట్టిరక్కాంత ఁ విధవయై పుత్రిని
గాంచెనటంచును ఁ గడమజనము
లంతదత్తనయుండు ఁ నై దేండ్ల బాలుడై
పురిబాలకులతోడ ఁ బోసగనాడ
జనులెల్ల గోళకుం ఁ డని నిందజేసిన
రోషించి యాతండు ఁ దూషితయని
ఆయెత్తి తనతల్లి ఁ నేయబోయినయది
భీమేశ్వరుడు తండ్రి ఁ క్రేయుమనిన
వెసజని యాతని ఁ క్రేయనుంకించిన
భీమేశ్వరుడుదయ ఁ పెద్దగలిగి
ప్రత్యక్షమైవత్స ! ఁ రమ్మని తగజీరి
శశుపక్షిమృగముల ఁ బ్రాణికోట్ల
గలిగించుశక్తియు ఁ గరమొప్పజనులకు
బిడ్డనాయువు ఁ బెంపుదనర
సంపదలొసగెడి ఁ సామర్థ్యమునునిడి
కానిదియాసని ఁ యైనదెల్ల

గాదనినట్టుల ॥ గావింపుబలమును
ముసు రాగలుగునది ॥ యును దెలువగ
ప్రావీణ్యమును నిచ్చి ॥ ప్రబలుము నీవని
వరమిచ్చె వడియూరు వర్గములకు
నాతనికి సహాయమై ॥ సరస్వతియును

... ... ... ...

వతడెట్లుచెప్పిన ॥ జగతివెలసి
సరిలేనికీర్తిచే ॥ జగతివెలసి

యతడు.

ఒకదినంబున వేగులవాడ (వేములవాడ)నున్న కొందఱు సువాసి నీజనంబులు దాక్షారామ భీమేశ్వరసందర్శ వార్త మరుగుచుండ నొకవి తంతువు వారితోగూడ ప్రయాణమయ్యెను. పుణ్యతీర్థముల సందర్శిం చువేడుక యెల్లరకుండుట సహజమేకదా? వారెల్లరును ద్రాక్షారామ ముచేరి సప్తగోదావరి యనంబరగు వాహినియందు స్నానముల గావించి భీమేశ్వరుని సందర్శింపనేగిరి. ఆవితంతువుయు వారితోడనే భీమేశ్వరుని సందర్శింపనేగెనని వేరుగజెప్పవలయునా?

ఆలయమున జనులకోలాహల మెడతెరపిలేకుండ నుండెను. భీమేశున కభిషేకముల జేయించువారు కొందఱును, కొందఱు దమ తమ గోత్రనామములు పురోహితులు మరచిపోదురేమో యనుచింత తోస్వయముగా స్వామిసన్నిధిని నిలచి యభిషేకముచేయుచుండిరి. మరి కొందఱు మనవంతు డబ్బిచ్చి యభిషేకము చేయించుచున్నాము. ఆబ్రాహ్మణుడు సరిగాచేసిన పుణ్యమునొందుదుము లేనియెడల మనల మోసపుచ్చిన పాపమునబోవును. మనమేల యీతొక్కుడుబడి నలగి పోవలయునని యించుకదూరమున ప్రసాదస్వీకారమునకై వేచి యుండిరి.

మేము కథారంభమున బేర్కొనిన స్త్రీ లెట్లో గర్భాలయము ను బ్రవేశించి స్వామికి ఫలాదికముల దమకుదోచినట్లుగా నొసంగిరి. వారిలో చాలమంది సంతానహీనులై యుండుటచే వారందఱును భీమేశ్వరునకు మరల మ్రొక్కి భీమేశ్వరా! మాకు చక్కని కుమారు నను గ్రహింపవలసినది. మాకోర్కె నీడేర్చినయెడల నీకు సహస్రఘటా భిషేకము చేయింతుమని మ్రొక్కిరి. ముగ్ధయైన యాావితంతువుకూడ వారితో బాటుగ భీమేశ్వరా! నాకు కుమారుని ప్రసాదించినయెడల నీకు సహస్రఘటాభిషేకము చేయింతుననెను. ఆపలుకులాలించి యాామె తోనున్న సువాసినీజనంబులు యిట్లు పరిహసించిరి. ఇదే మిట్లు కోరితివి భర్తలేనినాడు పుత్రుడెట్లుకలుగును. ఇట్లు కోరుటతగదు. అనిన విని యాావితంతువ యేమో అది నాకు తెలియదు. మీరందఱును బిడ్డల ను, గోరుచుండగా నేనును బిడ్డలపైగల వ్యామోహమున పుత్రుని గోరితిని. ఈభీమేశ్వరుడు మీకందఱకు కుమారుల ననుగ్రహించిన నాకుమాత్ర మేలయనుగ్రహింపడు. అని వారికి సమాధానముజెప్పి యుండెను. కొందఱామెను యీామె యికపుత్రుని గని లోకముద్ధరించు ననియు, యీామెకుమారునివలన భూదేవియొక్క వెలితిదీరుననియు, నామెయెదుట బలుకుచు పరిహాసముచేయుచుండిరి. ఎట్లో వారిమాట లకు సహించి యాావితంతువ స్వగ్రామమును జేరుకొనియెను.

భీమేశ్వరాలయమునకు బోయినసువాసినీ జనంబులందఱికిని సంతుచేకూడెనో లేదో తెలియదుగాని యాావితంతురాలికిమాత్రము గర్భము నిలచి నవమాసములు నిండినపిమ్మట నొక్కశుభముహూర్త మున నొకపుత్రుడు జన్మించెను. అతడే భీమకవియయ్యెను. ఆమెయు లోకాపవాదమునకు వెరువక, భీమేశ్వర వరప్రసాది యగుటచే నాతనికిభీమనయని పేరుపెట్టి యల్లారు ముద్దుగా బెంచుచుండెను.

క్రమక్రమముగా శుక్లపక్షమునందలి చంద్రునివోలెఁ నా బాలకుఁ డభివృద్ధినొంది నైదాఱేఁడుల బాలుడయ్యెను.

ఆబాలుకు డితరబాలురతో నాటలకుఁబోయి తన యీడువా రందఱిలోన మేటియై ప్రవర్తించుచుండెను. కొందఱాతనిపై నీర్ష్యఁ గొని యాతని రండాపుత్రుడనియు, గోళకుడనియుచు దిట్టుచు నాక్షే పించుచుండిరి. కాని భీమనకాపలుకుల కర్థము దెలియకుండుటచే గొన్ని దినములవఱకును నవిగూడ తిట్టులేయని భావించి యూరకుండెను. ఆతఁడు క్రమక్రమముగ నుపనయనమునకు దగినవయస్కుఁడయ్యెను. కాని యాగ్రామముననున్న వారెవ్వరును యాతని కుపనయనము చే యుటకు పూనుకొనరైరి. రండాపుత్రున కుపయనముగావించినచో తాము కులమునుండి వెలిపెట్టబడుదు మనుశంకతో నెవ్వరును నందు లకు సాహసింపరైరి.

వాడుకప్రకార మాబాలకుఁడు బాలురతో నాడుచుండ గొం దఱుబాలురాతని యెప్పటియట్లె గోళకుడవనియు రండాపుత్రుడవనియు నిందించిరి. అదిగాంచి భీమనతో నున్నబాలకులు సైతము నవ్వి గేలిసే యసాగిరి. భీమనకది సహింపరానిదయ్యెను. తోడనే యతఁడు తనతో నున్నబాలకు నొకనిని రహస్యముగా దీసికొనిపోయి ఓయీ! ఆతడట్లు మాట్లాడుట కేమికారణము? దెలుపుమని ప్రశ్నించెను. వాఁడును భీతుఁడై చెప్పకున్న భీమన దండించునేమో యనుభయంబున నాతని కిట్లనియెను. ఓయీ! నీజనకుఁడు గతించినపిమ్మట నీవు పుట్టితివి. అం దులకై వీరందఱును నిన్ను రండాపుత్రుడవనియనుచుండిరి. అని యా పలుకుల యర్థమంతయును వివరించెను.

భీమనకు తల్లిపై నెంతయో కోపమువచ్చి, తల్లి వ్యభిచరించి తన్ను గనియుండెనని తెలిసినపు డాతఁడెంతయో శోకించి యాప్త

త్తాంతమంతయు తల్లిముఖంబుననే వినవలయునని గృహంబునకేగి యొ
కపెద్దరాతినెత్తి అమ్మా! ఈయూరనున్న బాలురందఱును నన్ను రం
డాపుత్రుఁడని గేలిచేయుచున్నారు. నాజనకుఁ డెవ్వఁడు? నీవు నే నెట్లు
జన్మించితిని? ఈవృత్తాంతమంతయు సవిస్తరముగా జెప్పుము? లేకు
న్నయెడల నిన్నీ చాపరాతితో గొట్టి చంపెదను. అని పలికిన యాత
ని వాక్యములాలించి భీతిల్లి యాముగ్ధ కుమారుని కిట్లనియెను. ఓయీ!
నీవు నిక్కముగా నీతండ్రి గతించినపిమ్మటనే నాకు జన్మించితివి. కాని
నేనెట్టి నీచకృత్యమును గావించియుండలేదు. ద్రాక్షారామభీమేశుని
కుమారుని ప్రసాదింపవలసినదని ప్రార్థించితిని. ఆతనియనుగ్రహము
ననే నీవు జన్మించితివి. నాపలుకులయథార్థ మెఱుంగగోరెదవేని ద్రా
క్షారామమున కేగి యాభీమేశ్వరుని నాలయముననే సర్వము నెఱుంగుము
ని పల్కెను. భీముఁడును తల్లిపల్కుల గౌరవముంచి, అయినను ద్రాక్షా
రామమునకేగి నిక్కువ మారయవలయునని భావించి యపుడే బయలు
దేరి ద్రాక్షారామమున కరిగెను.

భీమేశ్వరునియాలయము ప్రవేశించి పెక్కువిధముల మున్ముందు
గా స్వామిని ప్రార్థించెను. కాని భీమేశ్వరుఁ డాతనికి ప్రత్యక్షము గాలే
దు. అంత కోపించి యొక్కపెద్దరాతిని గొనివచ్చి ఓభీమేశ్వరా! సహిం
పరాని యవమానమునబడియున్న నన్ననుగ్రహింప నిప్పటికేని ప్రత్య
క్షము కావైతివి. నాతల్లి నీవు నిక్కముగ నాసందియమును దీర్పగల
వని వక్కాణించియున్నది. కాని యట్టిదేదియును జరిగియుండలేదు.
కావున యీరాతితో నీలింగమును పగులగొట్టి తదుపరి యిట్టి బూటక
ములఁ గల్పించి చెప్పిన నాజననినిగూడ జంపివైచెదను. తదుపరి నేను
గూడ నీయవమానమును సహింపనేరక ప్రాయోపవేశమున నసువుల
విడిచెదను. అని పలుకుచు నారాతితో శివలింగమును గొట్టుటకు
యత్నించుచుండ నాపరమేశ్వరుఁడు ప్రత్యక్షమై వత్సా! శాంతింపుము.

శాంతింపుము. నీజనని పల్కినపలుకులన్నియు నిక్కవము లే? నీవునిక్క
ముగా నా నందనుడవే. కాని యన్యుడవుకావు. ఈరహస్యమును సా
మాన్యు లెఱుంగజాలరు. అందులకే నిన్ను నెల్లరును పరిహసించుచుం
డిరి. కాని యింతటినుంచియు నీవనర్గళకవితాశక్తి కల్గి యెల్లరచే కీర్తింపఁబ
డుచుందువు. నీవాడిన దాటగను, పాడినది పాటగను పరిగణింపబడును.
శాపానుగ్రహసమర్థుడవై యఖండప్రభావంబున ప్రవర్తించెదవు. సకల
భాషావేదివై సకలజంతుభాషాజ్ఞానముగల్గి ప్రకాశింతువుగాక యని
యనుగ్రహించి యంతర్హితుఁడయ్యెను.

---

## భీమకవి ప్రభావము వెల్లడియగుట

భీమకవి యటనుండి మరల స్వగ్రామమున కరిగి జననికి నమస్క
రించి గడచిన సంగతులన్నియు నామె కెఱిగించెను. నాటినుండియు భీమన
బాలురతో నాటపాటలకు బోక యొంటరియై విజనస్థలంబునగూర్చుండి
తనభావిజీవితమునుగూర్చి తలపోయుచుండువాఁడు.

నేను నిక్కముగ ద్రాక్షారామాభీమేశ్వరసుతుండ ననిలోకుల
కెట్లు తెలియును. నాయంతట నేను గడచిన వృత్తాంతమంతయు వారికి
దెల్పిన వారు విశ్వసింతురా ? పైగ నీను మనకులమును గంగగల్పుట
కై యాకపటతంత్రమును బన్నియుండెను. కాని యిట్టివాని కాభీమేశ్వ
రుఁడు ప్రత్యక్షమగునా ? యని నాపల్కుల నిరాకరింతురు. ఏమిచేయ
నగును. అనియే యాతడనవరత మాలోచించుచుండెను.

ఇట్లుండగా కొన్నిదినంబుల కాగ్రామముననున్న యొక్కరుని
యింట వివాహము జరుగుచుండెను. ఆతఁడు భాగ్యవంతుఁడై యుండు
టచే గ్రామస్థులనందఱిని దనగృహమున నాల్గైదుదినముల భోజన

ములకు రావలసినదని యాహ్వానించి యుండెను. భీమనమాతామ హుఁడు, భీమనతల్లియు, భీమనయు నాహ్వానింపబడి యుండ లేదని వేరుగ జెప్పవలయునా? ఏదినమున భీమనతల్లి యాతని ప్రసవించిన దో యాదినమునుండియే గ్రామములోనివారికిని వీరికిని పంక్తిభోజన ములు దూరమయ్యెను. వీరలకు సన్నిహితబంధువులుగూడ కొన్ని దినములవరకును వీరితో మాట్లాడుటకూడ మానివైచిరి. కాని కొం తకాలమైన పిమ్మట ముత్తసరిగ నేదేని యవసరముండిన మాటలాడు చుండిరి. కాని పంక్తిభోజనములకు మాత్రము వారు వీరినిగాని వీరు వారినిగాని పిలుచుట మానివైచిరి.

ఈవృత్తాంతము భీమనకు దెలియవచ్చెను. ఆతఁడు తనమనంబున బెద్దగా తలపోసి తనయొక్క జన్మరహస్యమును లోకమునకు వెల్లడిం చుటకు దగిన యవకాశము లభించినదని తలంచి వివాహదినమున నెల్లరతోపాటుగ తానుగూడ పిలువకపోయినను భోజనమునకేగ సం కల్పించుకొనియెను. ఆతనియింగితమెఱింగి యాతని తల్లి కుమారా! నేను నీవుభోజనమునకేగుటకు యత్నించుచున్నటు లున్నది, కాని నీవు వెళ్ళుట యంతమంచిదిగా నాకు గాన్పించుట లేదు. నిన్ను వారు లోనికి రానీయరు. పైగా వారు వివేకశూన్యులై నేను దోషినని యెంచి మనల బహిష్కరించి యున్నారు. అందువలన నిన్ను మర్యాదచేయు టకు మారుగ నమర్యాదగా నిందించి పారద్రోలుదురు. వారు మనలను పిలువనపుడు కూటికిలేనినిరుపేదలభంగి, పూటగడచిన కోటిగ సంతసించు బిచ్చకుని పోల్కి వారింటి కేగుటేల? వారీవైమనదినము లింటికలియో యంబలియో పడ్రసోపేతమగు భోజనమో పెట్టిన దాని తో మనస్థితియందు మార్పులుగల్గునా? నీవు దుడుకువాడవు. వారు నిన్ను లోనికిరానీయకున్న వారిని తిట్టిపోయుదువు. పరమేశ్వరుఁడు చెప్పి నదే నిక్కువమైన నీ తిట్లెల్ల వారికి తగులకుండనుండవు. ఈకారణమున

బెక్కురు హానిజెందిరి గదా. ఒక్కనికొరకై లోకమున పెక్కురు హానిజెందు టుత్తమమేమో యాలోచింపుము. తదుపరి నీయిచ్ఛవచ్చి నట్లు చేయుము. అని మందలించుచు తల్లిపలికిన పలుకులన్నియు విని యా ముగుదతల్లికి ప్రోడయగు కుమారు డిట్లనియెను.

జననీ! వారు మనల బహిష్కరించినవిషయము నాకు దెలిసి యే యున్నది. వారు మనలను పిలువలేదను సంగతిగూడ నెఱింగియే యుంటిని. మఱియు వారు నన్ను ఆదరింపరని కూడ ధృవంబుగ నెఱుంగుదును. అన్నియును దెలిసియే నీ వేలపోవుచుంటివని ప్రశ్నింతువేమో వినుము. ఎన్నిదినములవరకిట్లు మనము బహిష్కారమునందుండవలయును? ఎప్పటికైన మనకు కులములో గలియుభాగ్యమున్నదా? లేదా? యను విషయముతే నేను సర్వదా యోచించుచుంటిని. అందుకు దగిన మంచియవకాశము నేడు లభించినది. నన్ను వారు రానీయకున్నప్పటికేదో తోచినట్లొనరించి నాజన్మరహస్యమును వారికెఱింగించెదను. అంతియెగాని వారికెవ్వరికి నెగ్గు గల్గింపను. వారికేయనుమాట యటుండుము. నావలన నెప్పటికి యొరులకు నిష్కారణముగా నెట్టియాపదయు గలుగనీయనని నీకు వాగ్దాన మొసంగుచుంటిని. నేటితో మనము కులమున గలియగలము సందియమందకుము. అని యామెకు నచ్చజెప్పి యామె ననుమతింజేసి పెండ్లివారింటికి వెడలెను.

అప్పటికి జాలమంది పంక్తులుదీర్చి కూరుచుండిరి. మఱికొందరు తమకు దగినతావు లభింపకున్నందున నటునిటు సంచారముసేయుచుండిరి. ఆసందడిలో భీముని గలసిపోవుట కిష్టములేక నొకించుకసేపాయింటియరుగుపయి కూర్చుండెను. లోనికి రావలసినవారు వచ్చుటచే గాబోలును, వీధితలుపులు వేయుటకు యింటియజమానుఁ డరుదెంచి వీధిలోనున్న భీమునను చూచియు చూడనిపగిది తలుపులు వేయుట కుద్యుక్తుడయ్యెను. అంత నాతఁడు నీవులోనికి రాగూడదు. ఇక్కడ

బ్రాహ్మణసమారాధన జరుగుచున్నది. నీవు బ్రాహ్మణులపంక్తిని భుజించుటకు దగవు. పొమ్మని కసరుచు పలికెను. అంతభీమన అయ్యా తమకంత కోపమెందులకు, నేనుకూడ బ్రాహ్మణుడనే, తమకు సన్నిహితుడనే. అట్టియెడ నన్ను వేరుసేయుట మీకుచితమగునా ? యని మరల ప్రశ్నించెను. అంత నాయజమానుడు ఓయీ ! అన్నియును నిజమే, కాని నీవు రండాపుత్రుడవగుటచే కులమువారు మిమ్ములను బహిష్కరించిరి. బ్రాహ్మణధర్మములమీరి వ్యభిచరించిన స్త్రీలను, యామెకు బుట్టినవారిని కులమువారు బహిష్కరింపకుందురే యనిపల్కెను.

అంత భీమన నాతల్లి నిర్దోషి. మీ రామెవిషయమున సంశయింప బనిలేదు. నేను లోనికరుదెంచుటవలన మీబ్రాహ్మణ్యమునకేమియును లోపమురాదు అని పల్కెను. ఆయజమానుడాతని పలుకుల కలుక జెంది మితిమీరిన కోపమున లోటువచ్చిన వచ్చును. రాకున్న రాకుండును, అదియంతయు నిన్ను విచారింపుమనలేదు. నాకు నీతో మాటలాడుట కవకాశము లేదు. అని పలుకుచు తలుపులను వైచి లోనికి వెడలిపోయెను. ఆసమయమున భీమన అయ్యా ! నేను రాకుండ మీరు మాత్రము భుజించలేరు. ఈసంగతిమాత్రము తాము జ్ఞప్తియందుంచుకొనవలయునని హెచ్చరించెను. ఆకులకులాతడు వినియు నుపేక్ష చేసి వెడలిపోయెను.

లోన వడ్డన ప్రారంభమయ్యెను. కూరలు పప్పుమున్నగునవి క్రమక్రమముగా వడ్డింపబడెను. తరువాత యన్నమును అపూపములను వడ్డించిరి. వీధియరుగుపైనున్న భీమన యిదియంతయు తలుపురంధ్రముల మార్గమున దిలకించుచునే యుండెను. భోజనము లారంభమగుటకు సిద్ధముగనుండిరి.

అపుడు భీమన, అన్నమంతా సున్నంగావాలి, అప్పాలన్నీ కప్పలు కావాలి.

అని పాడనారంభించెను. తోడనే యన్నమంతయు సున్నముగా మారెను. అప్పములన్నియు కప్పలై యటునిటు దుముకులాడ జొచ్చెను. కూర్చున్న బ్రాహ్మణులందరును యీవింత మార్పునకు వెరగుపడుచు నియ్యది యేకారణమున గలిగియుండునాయని కళవళపడసాగిరి. వీధిగుమ్మముచెంతగూరుచున్న నిరుపురుముప్పుకు భీమనపాటను వినియున్న వారు విస్తరికడనుండి లేచి పరుగుపరుగున యజమానునియొద్దకేగి యాతని కిట్లనిరి. అయ్యా! వీధిలోనున్న దెవ్వరో అన్నమంతా సున్నముగావాలని అప్పాలన్నీ కప్పలుగావాలని పాటపాడుచున్నాడు. ఆవిధముగానే యన్నమంతయు సున్నమయ్యెను. అప్పములన్నియు కప్పలై గంతులువేయుచున్నవి. ఆతఁడెవ్వఁడో మహానుభావుఁడై యుండును.ఆతని సత్కరించినగాని నేఁడు సమారాధనజరుగుట కష్టము. అని తెల్పిరి. ఆగృహస్థునకు భీమన తాను తలుపులవేయునపుడు నేనురాకుండ మీరు మాత్రము భుజింపలేరని పలికినపలుకుల యర్థ మిప్పటికి బోధపడినది. ఆతఁడు త్వరితముగా గ్రామస్థుల బిలచి భీమనవృత్తాంతమంతయును దెలిపి కర్తవ్య ముపదేశింపుడని వారలప్రార్థించెను. వారెల్లరు ప్రిప్రథమమున నాతని మాటలు నమ్మకుండిరి. కాని యాగృహస్థుడు తనకును భీమనకు నడచినసంభాషణమంతయు దెలిపినపిమ్మట నాతనియూలమున నే యట్టి వింతమార్పుగల్గియుండెనని నిశ్చయించిరి.ఆగ్రామస్థులలో నొక్కఁడించుక చొరవచేసి అయ్యా! భీమన యిట్లు చేసెనని చెప్పుచున్నారు. గాన ఆతఁడు, మనమందరము చూచుచుండగ వీనినన్నిటిని యథారూపముగ మార్చినయెడ నాతని మనలో గలుపుకొనవచ్చును అని పల్కెను. ఆపలుకుల కెల్లవారును సమ్మతించిరి.

గృహాయజమానుఁడు వారినందరిని తనతో గైకొని భీమనచెంత కరుదెంచి ఓయీ! మేము తెలివిహీనులమైతిమి. మమ్మనుగ్రహింపుము. అనిపల్కెను. అంతభీమన "అయ్యా! మీభోజనములనాపుచేసి యిట్లరుదెంచితిరేల" అని ప్రశ్నించెను. అంత నాయజమాని యాతనికి జరిగినసంగతినంతయుదెల్పి వానిని యథాప్రకారముగా నొనరించి తమతో భోజనమాచరింప రావలసినదని బ్రతిమాలెను. అతనితోపాటు గ్రామస్థులెల్లరును భీమ కవిని తమతోపంక్తిభోజనమునకు రావలసినదని కోరిరి.

అంత భీమన "సున్నమంతయు సన్నముగావలెను. కప్పలన్నియు అప్పములు గావలెను" అని మరల పాడెను. తోడనే యన్నియు యథాప్రకారములుగానయ్యెను. అపుడు వారెల్లరును భీమన నెంతయో గొనియాడుచు తమపంక్తిని గూర్చుండబెట్టుకొని భుజించిరి. ఆసమయమున భీమన తన జన్మరహస్యము నంతయు దెల్పి తనకు ద్రాక్షారామభీమేశ్వరుఁడు ప్రత్యక్షమై తనతల్లి నిర్దోషురాలని వచించి తన కనేకవరంబులొసంగియుండెననియు దెల్పి వారెల్లర నమ్మించెను. ఆనాడు మొదలుగ నూరివారెల్లరు భీమన దమ్మెపుడుదిట్టునో తమకెక్కడ హానిచేయునో యని సదా భీతిల్లుచు నాతని యనుగ్రహసంపాదనమునకై ప్రయత్నించుచుండిరి.

ఇంతవరకు భీమన కుపనయనముచేయుట కెవ్వరును సాహసింపలేదు. ఆతని జన్మరహస్యము వెల్లడియైనపిదప, భీమన తల్లియు, మాతామహుఁడును బహిష్కారము లేక కులమువారితో గలసిన యనంతరము భీమకవిసన్నిహితబంధువులలో నొకరు భీమకవి కుపనయనము గావింపవలయునని సంకల్పించుకొని యాతని మాతామహునకు దనయభిప్రాయ

మెఱింగించెను. ఆతఁడును యందుల కనుమతించి వలయుసంభారములు గూర్చి త్వరలో సుముహూర్తమును నిర్ణయించెను.

భీమకవి మనుమని మనువు యథోచితముగా సలక్షణముగా నెట్టి యాటంకములును కలుగకుండగనే జరిగిపోయెను. గ్రామమునందున్న వారందఱును వారింటికి భోజనమునకు బోకున్నచో దమకెక్కడ భీమకవి శాపము గల్గునో యని భయంబున నానాల్గుదినంబులును వారింటనే భోజనముల గావించిరి.

ఈవిధముగా భీమకవి లోకమున వ్యాప్తమయ్యెను. వారిబహిష్కారము పటాపంచలయ్యెను.

---

## ఒక చాటువు.

భీమకవిపుంగవుఁ డొకానొకనాఁడు తనప్రభావము నెఱుంగగోరిన పండితులయెదుట నీక్రిందిపద్యము నాశువుగా రచించి చదివెను.

సీ. గడియలోపలఁ దాఁటి । కడఁగి నుత్తొయుగా
దిట్టిన మేధావి । భట్టుకంటె
రెండుగడియలబ్రహ్మ । దండిమూఁడ్వన్నియ
దుల్లదిట్టిన కవి । మల్లుకంటె
మూఁడుగడియలకు । మొనసియెత్తింగండి
పగులదిట్టినకవి । భానుకంటె
నఱజాములోపలఁ । జెఱుపునీళ్ళింకంగ
దిట్టిన బడబాగ్ని । భట్టుకంటె
నుగ్రకోపినేను । నోపుదు శపియింపఁ
గ్రమ్మరింప శక్తి । గలదు నాకు

వట్టిమ్రాఁకుఁజిగురుకఁ బుట్టింపఁ గట్టింప
బిరుదు వేములవాడ భీమకవిని.

ఈసీసపద్యమున భీమకవి పలువురుకవిపుంగవుల పేర్కొని యున్నాఁడు. 1 మేధావిభట్టు, 2 కవిమల్లుఁడు, 3 భానుఁడు, 4 బడబాగ్ని భట్టు, పద్యమున సూచింపఁబడిన సందర్భములలో జెప్పఁబడిన పద్యములు గొన్ని లభించుచున్నవి.

1 మేధావిభట్టు:— ఈతఁడు సాళువపెదతిమ్మభూపాలునిదర్శించుటకు వేచియుండఁగ నొకనాఁడాకస్మికముగా పెదతిమ్మభూపాలుఁడు వచ్చుటగాంచి యాతనిపై పద్యమును వ్రాసి యొసఁగవలయునని సంకల్పించుకొని చేతనున్నగ్రంథమునఁ బరికింపఁ బోఁగా, అత్యావశ్యకమగుపత్ర మొక్కటైన లేదయ్యెను. అంతనాతఁడు వచ్చి యాకుపై నైన వ్రాయుదమని సంకల్పించుకొని సమీపమునఁగల తాటిచెట్టును తానెక్కలేకుండుటచే మూఁడుముక్కలై ధరపై గూలునట్లు చేసియుండెనట.

క. సాళువపెదతిమ్మ మహీ
పాలుఁడు వీఁడె వచ్చెఁ బద్యము వ్రాయన్
గేలను లేదాకొకటియు
తాళమ ! ముత్తునుకలగుచుఁ ధరణిం బడుమా.

ఈసాళువ పెదతిమ్మభూపాలుఁడు, 15 వ శతాబ్దమువాఁడని యాంధ్రకవులచరిత్రము జెప్పుచున్నది.

2 కవిమల్లుఁడు.

ఈతఁడు గుడియన్న భూపాలునిదర్శనము వలయునని త్వరితగతిఁబోవుచుండగా నొకబ్రహ్మచెముడుముల్లు కాలియందు గ్రుచ్చుకొనియెను. అందువలనయాతఁడు త్వరితముగా నడువఁజాలక బాధనొందుచు యీక్రిందిపద్యమును నాబ్రహ్మచెముడుపై జెప్పియుండెను.

క. గుడియన్న నృపతిబోడగన
నడువంగా గొండపల్లి నగరిపడమటన్
గుడిమెడను మడమగాడిన
చెడుముండలు బ్రహ్మరండి చెట్లునడుల్లన్.

అని చదివినతోడనే ముండల్లన్నియు రాలిపోయినవట. ఈతఁడు 10 వ శతాబ్దమువాఁడని తెలియవచ్చుచున్నది.

3 కవిభాస్కరుఁడు.

ఈతఁడేసందర్భమున గండిబగులు పల్లుగా డిట్టియున్నాఁడో యాసందర్భముగాని యాతని పద్యముగాని యెక్కడను గాన్పించదు.

4. బడబాగ్ని భట్టు.

ఈతఁడొకనాఁ డర్ఘ్య మొసంగుచుండగా యాతని చేతినుండి యొక యుంగరము జారి నీటియందుఁ బడిపోయెను. అతఁ డెంతయో వెదకెను. కాని లాభము లేకపోయెను. అంతనాతఁ డధిక కోపమున చెఱువులోని నీరంతయు నింకిపోవునట్లు క్రింది పద్యమును రచించి చదివెను.

క. బడబానల భట్టారకు
కుడిచేయుంగరము రవికి నొగొబ్బున నర్ఘ్యం
బిడు వేళ జాఱినీలో
బడియె తటాకమనీరు బాయుము వేగన్.

అంతనా చెఱువు నీరంతయు నింకిపోయెను. అతనియుంగరము గాన్పించినది.

భీమకవి పేర్కొనిన మేధావిభట్టుమున్నగువారు భీమకవికించుక పూర్వముండిరని తలంపవలసియున్నది. మేధావిభట్టు 15 వ శతాబ్దమునను న్న సాళువ పెదతిమ్మభూపాలుని పేర్కొనియుండుటచే భీమకవి కూడ 15 లేక 16 వ శతాబ్దమువాఁడై యుండవలసియున్నది. అనగా భీమకవి కించుమించుగ నెనుబదివత్సరములకు తరువాతవాఁడైన యప్ప

కవి భీమనను నన్నయకాలమునందున్న వానిగ నేల వ్రాయును? మరియు 15 వ శతాబ్దమునందున్న శ్రీనాథుఁడు భీమనను పూర్వకవిస్తుతిలో నెట్లు జెప్పియుండెను? కావున భీమకవి సాళువ పెదతిమ్మభూపాలుని కాలమునగాని యటుపిమ్మటగాని యుండెననుట సమంజసము కాదు. భీమన పొగడియుండిన మేధావిభట్టు వేరొకఁడు కావచ్చును. మరియు సాళువ పెదతిమ్మ భూపాలుని దర్శించుటకేగుచు తాటిచెట్టును దిట్టికూల్చిన మేధావిభట్టునే భీమన చేర్కొనియుండెననియు తలంచుటకవకాశముండును. కవిమల్లునిగూర్చి గూడ నించుక చెప్పింపవలసియున్నది. గుడియున్న స్మృశతి 10 వ శతాబ్దమునందుండినట్లు నిదర్శనములు గనబడుచుండుటచే కవిమల్లుఁడు గూడ నాకాలపువాఁడే యగును

---

# రాజకళింగగంగు.

భీమకవిపుంగవుని జననమును గూర్చి వాదోపవాదము లెన్ని జరిగినను, ఎన్ని జరుగనున్నను ఈ క్రిందనుదహరింపఁబోవు కథమాత్రము సత్యమైయుండునని దృఢముగా నక్కాణింపవచ్చును. ఇంతియెగాక ఈతని కాలమును గూర్చి నిర్ణయము చేయుటకుగూడ నీరాజకళింగగంగు చరిత్రమే కొంతవరకు సహాయము చేయుచున్నది. వీరేశలింగము పంతులవారు ఆంధ్రకవుల చరిత్రమునందు భీమకవి శపించిన కళింగగంగును 1040 శా. శ. సంవత్సరమున దామరసంతియను నగ్రహారమును మాధవశర్మయను విప్రునకు దానమిచ్చిన కళింగగంగు వేరువేరు పురుషులైయుందురని వ్రాసియున్నారు. వారు అట్లు వ్రాయుటకుగల ప్రబల కారణము ఈ కళింగగంగు యొక్క కాలము సాహిణిమారన కాలముతో సరిపోకుండుటచే కళింగగంగు సాహిణిమారన యుద్ధప్రసిద్ధమున్న కాలముననే భీమనయుండినట్లు చాటువులవలన దెలియవచ్చుటచే ననివారు

వ్రాసియున్నారు. కాని అది సమంజసముగా కాన్పించదు. ఈవిషయమై భీమకవిజననకాలమును గూర్చి వ్రాయునపుడు విపులముగా నీవరకే విమర్శింపబడియున్నది. మరియును కళింగగంగు యొక్క పూర్వీకులవంశవృక్షము గూడ నీవరకే యొసంగబడియున్నది. గమనించునది.

ఈతండు వజ్రహస్తుని కుమారుండైన రాజరాజునకు కులోత్తుంగచోడదేవుని కుమార్తె యగు రాజసుందరియందు జన్మించినవాండు. ఈతండు దానధర్మము లాచరించుట యందాసక్తికలవాండు. తానురాజ్యమునకు వచ్చినకొలదికాలముననే అనగా 1041 శా. శ. సంవత్సరమున దామరకుంటియను గ్రామమునుమాధవశర్మయను బ్రాహ్మణునకు దానమొసంగియుండునట్లుగా శాసనములవలన దెలియవచ్చుచున్నది. ఇట్టివాండైనను భీమకవిశాపమున కెందులకు గురియయ్యెనో మాత్రము తెలియదయ్యెను.

రాజకళింగగంగును సందర్శించుటకై వేములవాడభీమకవి యొకదినము సభకుం బోయియుండెను. ఉద్దండకవిపుంగవుండును శాపానుగ్రహసమర్థుండును నగు భీమకవి జనుదెంచియుండెనని ప్రతీహారులు వచ్చి చెప్పిరి. తోడనే కళింగగంగు ఆతండు శపించునేమో యను భయంబున సపరివారుడై యెదురేగి లోనికిగొనివచ్చి యుచితాసనమున గూర్చుండబెట్టెను. కాని యాతనిమనమేలో కినుకనే శంకించుచు నెట్లుమాట్లాడిన నెట్లుగా పరిణమించునో యను భయంబున నాతనితో బలుకక తనపనియే చూచుచుండెను. ఆదినమట్లో గడచిపోయినది. కళింగగంగు మంత్రులు మొదలయినవారితో భీమకవి కెట్టిగౌరవమును కల్గింపవలదని చెప్పియుండెను.

మరునాటిదినమున భీమకవి మరల సభారంగమున కరుదెంచెను. కళింగగంగు భీతిల్లుచు గతదినంబునందువలెనే మౌనమూని తనపనియే చూచుచుకొనుచుండెను. అంతట వేములవాడభీమకవి కాలవిళంబనకోర్వ

లవలన నేశత్రు వెక్కడ నుండెనో వానిరాజ్యమందలి ప్రజల పరిస్థితు లెట్లుండెనో దెలిసికొనుచు సైన్యమును వృద్ధిచేయుచుండెను.

వంగదేశభూపాలుండగు విక్రమదేవుండు కళింగనగరముపయి దాడివెడలెను. కళింగగంగాతని యుద్ధమున నెదిరించెను. ఇరుపక్షములవారికిని ఘోరముగ యుద్ధము జరుగుచుండెను. ప్రప్రథమమున కళింగగంగున కించుకజయము లభించినది. కాని విక్రమదేవుండు సైన్యముల హెచ్చరించి కడపటిదినంబున కళింగగంగుయొక్క బలము లన్నిటిని చీకాకుపరచెను. సైన్యము కలగుండు పడియుండుట దిలకించి కళింగగంగు తనసైన్యముల హెచ్చరించుటకై హయాధిరూఢుడై సమరరంగమున కరుదెంచెను. అయ్యది గాంచి విక్రమదేవుండు కసురయంబున నాతని నెకర్కొని యుద్ధముచేసి యాతని నోడించి పట్టుకొనెను. భూపాలుండు శత్రురాజునకు జిక్కుటగాంచి బలంబులన్నియు యుద్ధభూమినుండి పలాయనములయ్యెను. విక్రమదేవుండు కళింగగంగును బాధించి తనశిబిరమునకు గొనిపోయెను. నాటికి యుద్ధము నిలుపుచేయబడినది. విక్రమదేవుండు యుద్ధమాపుజేయబడినను రాత్రిభాగమున దమరాజును విడిపింప శత్రులరుదెంతురేమో యని భావించి తనసైన్యము లన్నియును కళింగనగరము ప్రవేశించు నంతవరకును ప్రతినిమిషమునను శత్రువు నెకర్కొనుటకు సిద్ధముగా నుండవలసిన దని యాజ్ఞాపించి యుండెను. ఆరేయి యంతయును నెట్టియుపాంతరము లును లేకుండ గడచిపోయెను.

మరునాడు విక్రమదేవుండు కళింగనగరమును ప్రవేశించెను. కళింగగంగును కారాగారమున బంధించి కళింగసింహాసన మధిష్ఠించెను. విక్రమదేవుండు తాను పరిపాలకుడుగా నుండి పరిపాలనావిధానమునను యధికారవర్గమునను నెట్టి మార్పును గావింపకయె రాజ్యముచేయు చుండెను. ఇట్లు కొన్నిదినములు గడచిపోయెను.

తదుపరి వంగరాష్ట్రమున ప్రజలలో కొన్ని కక్షలేర్పడెననియు నాకక్షలవలన సామాన్యప్రజల కలజడి కలుగుచుండెననియు దెలియ వచ్చుటచే విక్రమదేవుఁడు కళింగనగరమున నొక ప్రతినిధిని నిలిపి వంగరాష్ట్రమున కరిగెను.

కొన్ని దినంబులు గతించిన పిమ్మట నారాజప్రతినిధి కళింగ గంగునపై జాలిగలవాఁడై యాతని చెరవిడిపించి దూరదేశములకు బోయి జీవింపుమని నియమించెను. కళింగగంగ పరిమితానందభరితుఁడై చెఱనుండి వెలికరుదెంచి యదే పదివేలుగ నెంచి సమీపరాష్ట్రముల నుండక దూరదేశములకు బారిపోయెను. కొన్ని దినంబులవఱకు నట నట కూలిపని చేసి జీవయాత్ర సాగించుచు పనిపాటల కభ్యాసపడి యుండనివాఁడగుటచే, కష్టముల కోర్వఁజాలక, పరదేశముననుండుటచే దన్నితరులు గుర్తింపరని తలంచి భిక్షాటనమున చేయుచు నాదినమునకు దొరకిన యే గంజినీళ్లనో ద్రావుచు కాలము గడపుచుండెను.

విక్రమదేవుఁడు వంగరాష్ట్రములో కక్షిదారుల రూపుమాపి దేశమున మరల శాంతినెలకొల్పెను. ఆసమయమున దన ప్రతినిధి కళింగ గంగును చెరసాలనుండితప్పించిన వార్త విక్రమదేవునకు దెలియవచ్చెను. అంత విక్రమదేవుఁడు మరల కళింగనగరమునకు జనుదెంచి రాజకార్యముల దానే విచారించుకొనుచుండెను.

ఒక్కనాఁడు వేములవాడ భీమకవి పిఠాపురమునకు జనుదెంచి యుండెను. ఆయూరనే కళింగగంగు కూడ తలదాచుకొని యుండెను. నాటిరాత్రిభోజనము లైనపిమ్మట వేములవాడ భీమకవి వీధియరుగుపై నిలువబడి చేయి కడుగుకొనుచుండగా సమీపమునుండి అయ్యో! నిష్కారణముగాగోతబడి పోతినే! కాలిదివిటీయైన లేకపోయెనే! యను పలుకులు వినవచ్చెను. ఆపలుకులను విని భీమకవి ఎవరా గోతిలో

నుండిమాట్లాడుచున్నారు. గోతిలోబడి కాలిదివిటీ కొరకేడ్చువారెవరు రా? యని ప్రశ్నించెను.

కళింగగంగు గోతినుండి నెమ్మదిగాలేచి యీవలికరుదెంచి తన్ను ప్రశ్నించినవారిని సమీపించి అయ్యా! వేములవాడ భీమకవిగారిచే జేయబడిన జోగిని, ఒకప్పుడు భోగము లనుభవించిన వాడనే. అందువలన కాలిదివిటీ లేకపోయెనే యనుమాట ప్రశ్నముగా నానోట వెడలినది. మహానుభావా! ఈపూట కింతయన్నము బెట్టింపుము. నిన్నరాత్రి నుండియు దిండిలేక మలమల మాడుచుంటిని, అని ప్రార్థించెను. భీమకవి యాతని యవస్థకెంతయు జింతించి, యాతనికెప్పటియట్లు సింహాసనము పై గూర్చుండబెట్టవలయునని సంకల్పించుకొని యిట్లనియెను. ఓయీ! ఇప్పటికైన భీమకవి శక్తియుక్తులు బోధపడినవా? నేనే భీమకవిని నిన్నిస్థితిలో చూచుటచే నామనస్సు కరిగినది. నన్నును శపింపవలసి వచ్చెనేమోయని నేనెల్లప్పుడు భీతిల్లుచునే యుంటిని. పరుల కడగండ్లజూచి సహింపజాలను. ఇంతేసును విధి నీకనుకూలింపకపోవుటవలననే నాడట్లవమానకరచితివి. గతమును మరచిపోవుము.

ఉ. వేయుగజంబులుండ పది / వేలతురంగములుండ నాజిలో
రాయలగెల్చి సెజ్జవగ / రంబునపట్టముగట్టు కోపడిక
రాయకళింగగంగు! కవి / రాజభయంకరమూర్తి జూడగా
బోయినమానమాసమున / పున్నమ బోయినషష్ఠి నాటికిన్.

అని ఆశీర్వదించినవిని కళింగగంగాతని పాదపంకేజములకు సాష్టాంగనమస్కారము లాచరించెను. అంత భీమకవిపుంగవుడు వాత్సల్యంబున నాతని లేవనెత్తి లోనికిం గొనిపోయి దృప్తిగా భోజనముపెట్టించెను. నాటి మొదలాతనికి బలము చేకూరు నంతవరకును భోజనసముపాయములు గావించి రాజధానికి పోవలసినదని యా

జ్ఞాపించి ద్రోణబత్తెమునకై కొంతధనమిచ్చెను. కళింగగంగు భీమకవి సార్వభౌమునకు బునరభినందన మాచరించి యాతని యాశీర్వాదము నొంది సెజ్జనగరమునకు బ్రయాణమయ్యెను. కతిపయదినంబుల కాతఁడు సెజ్జనగరమును జేరుకొనియెను.

అప్పుఁ డానగరమున గొందఱు పగటివేషగాండ్రు వివిధవేషములు ధరించుచు ప్రజల నానందాబ్ధి నోలలాడించుచుండిరి. క్రమక్రమముగా నీపగటివేషగాండ్ర ప్రఖ్యాతి విక్రమదేవునకు దెలియవచ్చెను. ఆతఁ డావేషగాండ్రను పిలిపించి వారలచే పెక్కువేషము లభినయింపఁ జేయుచు వారల దగినట్లుగా బహూకరించుచు, కొన్నిదినములు గడపెను. ఆవల నొక్కనాడు విక్రమదేవుఁడు వేషగాండ్ర కిట్లనియెను. ఓయీ! మీరు పెక్కువేషములు వేసికొని చక్కగా నభినయించిరి. రాజకళింగగంగు వేషము వేసి నన్నానందింపజేసిన యెడల మీకు వేయి వరహాలను బహుమానముగా నొసంగుదును. అని పల్కెను. ఆవేషగాండ్రలోనున్న నాయకుఁడు దమకా వేషము వేయునసమర్థత లేకున్నను నట్లు జెప్పిన తమప్రఖ్యాతికి లోపమని యెంచియో లేక వేయివరాలు లభించునను నాశతోడనో యా వేషము వేయగలమని జెప్పి నాటికి సెలవుతీసికొని తనమేళముతో నిలయమునకు జేరనంగెను.

వేషగాండ్రందఱును నిలయమున సమావేశమై యిట్లాలోచింప గడంగిరి. పేరుప్రఖ్యాతులకు భంగము వచ్చునేమోయను భయంబున నీవేషము వైచుట కంగీకరించితిమిగాని, మనలో కళింగగంగువలె నటింపగలవా డెవ్వడును గాన్పింపడు. ఏమిచేయుదుము విక్రమదేవు నెట్లు సంతోషపెట్టగలము. అట్లు కొంతవడి చింతించి నాయకు డిట్లనియెను. రేపటిదినమున నే నాస్థానమున కేగి యావేషమభ్యాసము చేసికొనుటకు కొంత మాసము వ్యవధిగావలసియున్నదని ప్రార్థించి వాయిదమత్తి గైకొందు

ను. ఈలోపుగా మనలో నెవ్వరినైన నొక్కని తయారు జేయుదము. అని వారలను నచ్చజెప్పెను. మరునాఁ డతఁడు సభారంగమున కేగి భూపాలుని గడు విచ్చుకొనవలసినదని ప్రార్థించెను. విక్రమదేవుఁడు గడు వొసంగి వారి కానెలదినములకును సరిపడిన యాహారపదార్థము లీయవలసిదని యాజ్ఞాపించెను.

ఆమేళనాయకుఁడు డెందమునఁ గెంతయో సంతసించి భూపాలుఁడు గడు వొసంగటయేకాక తమకు గావలసిన యాహారపదార్థములఁగూడ నిప్పించియున్న వర్తమానమును తక్కినవారందరకు దెల్పి వారలకు త్సాహముకలుగునట్లొనరించెను.

ఆదినమునుండియును వేషగాండ్రిందఱు ననుదినమును కళింగగంగువేషము వేయుటకై యభినయము నేర్చుకొనుచుండిరి. కాని యొక్కనికిని కళింగగంగుయొక్క చేష్టలేవియు పట్టుబడవయ్యెను. అంత మేళనాయకుఁడు చింతించి యూరిలో నెవ్వడైన కళింగగంగువేష మభినయింప గలిగినవానికి నూరువరహాల నిత్తునని రహస్యముగా దానెఱిఁగిన మువ్వురు నలువురతో జెప్పియుండెను. ఇట్లులాతఁడు సరియైన మనుజునికొఱకు ప్రయత్నము చేయుచుండగా కళింగగంగు ఆదినముననే గ్రామము చేరినవాడగుటచే నావేషగాండ్రు నివసించుచున్న యింటియరుగుపైననే గూర్చుండి శ్రమదీర్చుకొనుచుండెను. అంత నామేళనాయకు డాతని దిలకించి ఓయీ! నీ వెవ్వడవు, ఇచ్చటి కేలవచ్చితివని ప్రశ్నించెను. కళింగగంగు అయ్యా! నేనొక బాటసారిని. ఇంచుక విశ్రమింప నిందుగూర్చుంటిని. అని ప్రత్యుత్తరమిచ్చెను. మేళనాయకుడును ఆతనినింకను గొన్ని ప్రశ్నలడిగి యున్నిటికి నాతనివలన దగు నుత్తరముల బడసెను. ఆసమయమునకు లోపలినుండి యొకపురుషుఁ డీవలకు వచ్చి యిట్లని వేరొకరిపై ఫిర్యాదు చేసెను. 'నేను కళింగగంగువేషమునకు ప్రయత్నించి చూచెదనని పల్కితిని. ఆపలుకులకు మనవారందరును యెగతాళిచే

యుచు నిందించుచున్నారు. చూడుడు." అనివల్కినవిని కళింగగంగు యజమానితో అయ్యా ! మీరెవ్వరు. కళింగగంగు వేషముతో మీకే మివని గల్గినది. అని ప్రశ్నించెను. మేళనాయకుడు దమవృత్తాంతముం తయు దెలిపి కళింగగంగుయొక్క వేషమభినయింపగలవాడు సందర్భ పడలేదనియు, తన క్రిందనున్న వారందఱును అందులకు ప్రియత్నించు చున్నారనియు ఒక్కడును కృతార్థత జెందకుండెననియు, తాను మరి యెవ్వరిచేతనైన నా వేషము వేయించుటకు ప్రయత్నము చేయుచుంటి ననియు దెల్పెను. అంత కళింగగంగు అయ్యా ! నే నా వేషము చక్కగా నభినయింపగలను. నన్ను మించినవాడు మీకుదొరకబోడు. వలయు నేని మీకుదోడ్పడెదను. అని వచించెను మేళనాయకుం డధికసంతోష ముతో నంగీకరించెను.

పగటివేషగాండ్రిలో జేరి కళింగగంగు తనరాజఠీవినంతయు బ్రద ర్శింపగా తక్కినవారది గాంచి విక్రమదేవునివలన తమకెక్కుడు బహు మానము రాగలదని సంతసించిరి. ఇంక వారముదినములుమాత్రమే గడువు మిగిలియుండెను. కళింగగంగు పదచ్యుతుడైననాటినుండియు సరియైన తిండిలేనందునను క్షురకర్మాదికము లేనందునను నెక్కుడుగా మారియుండెను. తొల్లియాతనితో ననుదినమును గలసిమెలసి వర్తించు వారలైనను యాతని గుర్తింపలేనంతగా మారిపోయి యుండెను.

మరునాడు వేష మభినయింపవలయును. అనగా కళింగగంగు నాయకుని బిలిచి ఓయీ ! నీవు విక్రమదేవునియొద్దకేగి కళింగగంగు దుస్తులును, యాభరణములును, కైజారు మున్నగునవన్నియు వేషమువే యువానికి గావలయునని తెల్పి గొనిరమ్ము. మరియు కళింగగంగధిరో హించెడి యశ్వముగూడ రేపటికిచ్చుటకి వచ్చునట్లు జేయవలయును.

ఈయూర పేరెన్నికగన్న క్షౌరకు నొకనిని బిలిపింపుము. అని చెప్పెను. నాయకుండును విక్రమదేవుని చెంతకరిగి కళింగగంగు యాభరణములను వస్త్రులను వేషమునకై యిప్పింపవలసినదని ప్రార్థించెను. విక్రమదేవుడును వేషమునకు దగిన యలంకారాదికము లేకున్న శోభింపదని నిశ్చయించి వానినన్నిటిని యామేళనాయకున కీయవలసినదని యాజ్ఞాపించెను. మేళనాయకుం డపరిమితానందభరితుండై యాభరణాదికములగొని చనెను.

మరునాడుదయమున నొకక్షౌరకుని బిలిపించి కళింగగంగును వేషము వేయవలసినదనెను. కళింగగంగు భూషణములన్నిటిని నొక గదియందు బెట్టించి యశ్వమును దీసికొని రావలసినదని మేళనాయకుని బంపి యా క్షౌరకుని నాగదిలోనికి బిలిపించి క్షురకర్మను ప్రారంభింపుమనియెను. క్షౌరకుడు గూడ మొట్టమొదట యాతనిగుర్తింపకుండెను గాని క్షురకర్మసగము ముగియునంతకు యాతని కళింగగంగు గాగుర్తించి నమస్కరించెను. అంత కళింగగంగాతనితో రహస్యముగా నోరీ! ఈరహస్యము నెప్పుడు వెల్లడిచేయకుము. నేడెల్లైనను విక్రమదేవుని వధించి రాజ్యమును కైవసమొనర్చుకొనియెదను. అటుపిమ్మట నీకు గొప్పబహుమాన మొసంగెదనని నమ్మికబుట్టవచించి వానిని సమ్మతింపజేసెను. క్షురకర్మపూర్తియైనపిమ్మట నాగదియందే యభ్యంగన మాచరించి తనవస్త్రములన్నిటిని ధరించెను. ఇంతలో నాయకుం డశ్వమును గొని వచ్చెను.

కళింగగంగు వెలికరుదెంచి గుఱ్ఱమును నిమిరి తట్టెను. అయ్యాదియు చిరకాలమునకు యజమానిని జూచిసంతసమొంది సకిలించెను. రాజకళింగగంగాయశ్వము నధిరోహించి విక్రముని దర్బారున కేగెను. త్రోవలో నాతనిగాంచినవారందఱును యీవేషము చక్కగా కళింగగంగును బోలియున్నదని వచించుచుండిరే గాని

కళింగగం గీతఁడేయని యెవ్వరును తలంచియుండలేదు. విక్రమదేవుడును వేషగాని నేర్పునకు మెచ్చుకొని యానందించుచుండెను. కళింగగంగును రాజకళింగగంగు గుఱ్ఱముపై నిట్లు స్వారిచేయుచుండువాడని పలుకుచు గుఱ్ఱమునటనుండి యిచటికిని యిచటినుండి యచటికి దూకించుచు ఆకస్మికముగా నొక్కమారు విక్రమదేవునిచెంతకు బోయి కైజారుతో నాతని బొడిచిచంపి క్రిందకులాగివైచి యాసింహాసన మధిష్ఠించి యటనున్నమంత్రులు మొదలైనవారెల్లరును యీావరకు దనక్రిందనున్నవారే యగుటచే వారి కిట్లనియెను. మంత్రిపుంగవులారా! నేను పగటివేషగానిని కాను. నేను పూర్వమునిచ్చో పాలించిన కళింగగంగునే. నాశాత్రవుని యీావిధముగా సంతమొందించితిని. తదనంతరము జరుగవలసిన పనులన్నియు క్రమముగా నడపుడు. అని తనవృత్తాంతమాద్యంతము వారికెఱిగించెను. మంత్రులాతని గుర్తించి విశ్వాసముకలవారలై రాజుపక్షమవలంబించిరి. విక్రమదేవునిసైన్యములు యుద్ధమునకు సిద్ధపడెను. అపుడు కళింగగంగు తన పక్షమున నిలిచిన 1000 గజములతోడను 10000 గుఱ్ఱములతోడను ప్రకాశించి నిలిచినసైన్యమును రూపుమాపి సజ్జనగరంబున మరల పట్టాభిషేకము గావించుకొనియెను.

పట్టాభిషేకానంతరము పగటివేషగాండ్రకును తనకు నాడుపకారకర్మజేయుచు తన్ను గుర్తించిన మంగలివానికిని దగిన పారితోషికముల నొసంగి సత్కరించెను.

---

## చొక్కభూపాలుఁడు.

భీమకవిపుంగవు డొక్కనాఁడు చొక్కభూపాలునియాస్థానము నకేఁగి యుండెను. చొక్కభూపాలుఁడు ఆతనిరాకముందుగా నెఱింగి యెదురేగి యాతని కుచితగౌరవములగావించి, కస్తూరి, పునుగు, జవ్వాదిమున్నగు సుగంధవస్తువుల నొసంగి బహూకరించి యాస్థానమునకు గొనిపోయి, యొక యున్నతాసనముపై గూర్చుండఁబెట్టి యాతనిచెంతనే గూర్చుండి యిష్టాలాపము లాడుచు కాలము గడపుచుండెను.

భీమకవియు నాతఁడు తనకు జరపిన మర్యాదలకెంతయు సంతసించి యచట గొన్నిదినంబు లుందునని బల్కెను. చొక్కనృపాలుఁడును యట్టికవిశిరోమణి దనయాస్థానమున నిలుచుటయే పదివేలని సంతసించి యాతని విడిదికై యొకరమ్యహర్మ్యము నొసంగి వలయు సంభారముల నొసంగుటకై తగినవారిని నియమించి కవిపుంగవున కిట్లనియెను. దేవా! తమకు సకలసదుపాయములును జరుగున ట్లేర్పాటు గావించితిని. లోటుపాటులేవైన గల్గినయెడల నా కెఱింగింపుఁడు. అనుగ్రహించి నాయాస్థానముననే యుండవలయును. అని ప్రార్థించెను.

చొక్కనృపాలుఁడును భీమకవిపుంగవునితో గలసి సాయంసమయములం దుపవనముల విహరించుచు సరససంభాషణల దేలుచుండిరి. ఒక్కనాఁడు చొక్కనృపాలుఁ డుద్యానవనమున విహరించుచు భీమకవిపుంగవుని గనుంగొని యిట్లనియెను. అయ్యా! తమరాడిన దాటయు, పాడినది పాటయునగునని యెల్లరును ప్రసిద్ధిగా జెప్పుకొందురు. అది వినుటయేగాని ప్రత్యక్షముగా నెప్పుడును గాంచియుండలేదు. అనిన విని భీమకవి "రాజా! అట్లే చూడవచ్చును." అని బల్కెను. అంత చొక్కభూపాలుఁడు "కవివరేణ్యా! ఈమల్లెపందిరికి

రాటగా పాతబడిన యాకంబము వృక్షముగున ట్లొనరింపుము." అని వేడుకొనియెను. భీమకవియును యాతని యభిమతమును దీర్పవలయునని దలంచి యీక్రిందిపద్యమును జదివి యాకంబమును వృక్షముగునట్లుగా జేసెను.

శా. ఆనీతాభ్యుదదానశృంఖలపదా గ్రభ్యాలంభిత స్తంభమా
నేనే వేములవాడ భీమకవి నే నిక్క జిత్రకూటంబులో
భూనవ్యాపిత పల్లవోద్భవమహా పుష్పోపగుచ్ఛంబులన్
నానాపక్వఫలప్రవాయుతమహా నాకల్ప వృక్షాకృతిన్.

భీమకవి యీపద్యమును చదివినంతనే యాకంబము పువ్వులు, ఆకులు, కాయలు, ఫలములు చిగురులుగల యొకమహావృక్షమయ్యెను. అచ్చటనున్న పరివారజనంబు లెల్లరును భీమకవి నెంతయు గొనియాడుచు ఆవృక్షమును కాయలు మున్నగునవి గోసికొని చేతబట్టుకొని యానందించుచుండిరి. చోక్కభూపాలుడును ఆతనిసామర్థ్యమునకు కరంబచ్చెరువొంది సంతసంబున భీమకవిం గొనియాడి కవిసార్వభౌమా! నీమహామహిమంబుల గనుటచే నేటికి నాజన్మ పవిత్రమయ్యెను. నీయట్టివానిని త్రికాలములందు ముల్లోకంబుల జూడ మటశక్యము. నీకు నీవే సాటిగాని యన్యులు నీతో సరిపోల్చుటకైన జాలనివారు. అనుగ్రహించి యీవృక్ష మెప్పటియట్లు కంబముగా నిలచునట్లొనరింపుము. అని ప్రార్థించెను. భీమకవియు చిరునవ్వున నీక్రిందిపద్యము జదివెను.

ఉ. శంభువరప్రసాద కవిసంఘవరేణ్యుడనైన నావచో
గుంభనమాల కించి యఘ కూలత నొంది తనూనభావనన్
గుంభిన చొక్కనామ నృప కుంజరు పందిటిమల్లె సాలకున్
స్తంభమురీతి నీతనవు దాలిచి యెప్పటియట్ల నుండుమా.

తోడనే యావృక్షమున గలుగు యాకు లంత హరితములయ్యెను. పూవులు చూపడవయ్యెను. కాయలు గానరానివయ్యెను. ఆవృక్షము యొక్క రూపమంతయును మారుపడెను. ఎప్పటివలె మల్లిపందిరికిరాటగా నుండెను. చొక్కనృపాలుండయ్యది గాంచి సంతసించి యాతని ననేకవిధంబుల బొగడి యధికంబుగ బహూకరించెను.

---

## రణతిక్కన.

ఈతఁడు సిద్ధయకుమారుఁడు. ఈరణతిక్కనకు ఖడ్గతిక్కనయని నామాంతరము గలదు. ఈతనితల్లి మైలమ. ఈమెకు భీమనయను పేరు గల కుమారుఁడింకొకఁ డుండెను. రణతిక్కన భీమనలలో రణతిక్కన పెంపకమీయబడి యుండెను. భారతమును రచించియుండిన తిక్కనసోమయాజికి జ్ఞాతివర్గములోని వారు. భీమకవికికూడ బంధువర్గములోని వారను అగుటచే తరచుగా భీమన వీరింటికి వచ్చుట యాచారమై యుండెను.

రణతిక్కనయు మైలమభీమనయు మనుమసిద్ధిభూపాలునివద్ద దండనాథులగాను మంత్రులుగాను నుండిరి. మనుమసిద్ధిరాజునకును, కాటమరాజునకు జరిగినయుద్ధమునందు రణతిక్కన మనుమసిద్ధిభూపాలునిసైన్యముల నడిపించుచు ఘోరముగాబోరాడి తనప్రాణములను గోలుపోయియుండెను.

ఇరువురుభూపాలురకును పశువులమేతబీళ్ళ విషయమై పోరాటముగల్గెను. మనుమసిద్ధిభూపాలునకుఁగల పశువులమేతబీళ్ళలో దన పశువుల మేపుకొనుటకును అందులకుగాను తాను కప్పముగట్టుటకుగాను కాటమరాజు యేర్పాటు చేసికొనియుండెను. ఒకసంవత్సరమున తన పశువులలోనుండవలసిన కోడెదూడయొకటి గాన్పింపనందున యాదూ

డను మనుమసిద్ధి హరించియుండె ననితలంచి కాటమరాజు తనదూడను తనకువప్పగించువఱకు పుల్లరి (కప్పము) నీయననెను. మనుమసిద్ధి తాను దూడసంగతి యెఱుఁగననియు తనపసుపులలోని కట్టెదూడ రాలేదనియు, కప్పమీయకున్న యుద్ధమునకు సిద్ధపడియుండవలసినదనియు వర్తమానమంపెను. కాటమరాజు యుద్ధమునకాయత్తమై మనుమసిద్ధి భూపాలునిపై దాడివెడలెను.

రణతిక్కన మనుమసిద్ధిభూపాలునిసైన్యముల నడిపించుచుండెను. రెండుసైన్యములవారికిని పోరు ఘోరముగా జరిగెను. రణతిక్కన కాటమరాజుసైన్యము నెదుర్కొని ధైర్యముతో కొంతవఱకు పోరాడెను. కాని శత్రుసైన్యము తరుగుగాన్పింపకుండుటచేతను, తనపక్షము వారల్పసంఖ్యాకులై యుండుటవలనను రణతిక్కన యుద్ధభూమినుండి వెనుకకు మరలెను.

రణతిక్కన గృహంబునకు బోయినతోడనే యాతనితల్లియు భార్యయు నాతని చులుకనగా జూచిరి. రణతిక్కన స్నానముచేయుటకు నీటిని సిద్ధపరుపుమని భార్యకు జెప్పెను. ఆమెయు రెండుమూడు బిందెలతో నీటి నొకచోనుంచి యటనొక నులకమంచముకు తెరగానుంచి యామంచపుకోటిపై నింతపసుపుముద్దనుంచి భర్తతో నీళ్లు సిద్ధముగానున్నవి స్నానముచేయవచ్చునని జెప్పెను. తిక్కన స్నానముచేయుటకు వచ్చి యిదేమి స్త్రీలు స్నానముచేయుటకు చేసినట్లీయేర్పాటులన్నియు నెందులకని భార్యను ప్రశ్నించెను. అంతభార్య యాతనికీ క్రిందిపద్యమున ప్రత్యుత్తర మొసంగెను.

క. పగరకు వెన్నిచ్చినచో
నగరే నినుమగతనంపు నాయకులెంకన్
ముగురాడువారమైతిమి
పగపేటికి జలకమాడ వచ్చినచోటన్.

అని ప్రత్యుత్తరమొసంగిన విని తిక్కన భార్యనేమియు నన జాలక వినుచుకొనుచు నెట్లో స్నానముచేసి భోజనమునకు గూర్చుండెను. భోజనసమయమున తిక్కనతల్లి యాతనికి విఱిగిన పాల నొడ్డించెను. తిక్కన అమ్మా! ఇదేమి విఱిగినపాలను బోసితివని ప్రశ్నించెను. అంతనామెయు కుమారా యేమిచేయను. నీవు యుద్ధమునకు బోయిన స్థలమునకే మనపశువులును మేతకై పోయియుండెను. నీవు దిఱిగి యింటికి జనుదెంచినట్లే అవియు దిఱిగి గృహమునకు వచ్చెను. పాలును విఱిగినవి. అని యీక్రిందిపద్యమును జదివెను.

క. అనదృశముగ నరివీరుల
మసిపుచ్చక విఱిగివచ్చి మగవంద్రియుల్
గసవున్ మేయగబోయిన
పసులుల్ విఱిగినవి తిక్క పాలును విరిగెన్.

తల్లి గూడ తన్ను చులకనజేసి మాటలాడినందున తిక్కన వీరావేశమున భోజనమును పూర్తిగ జేయకయే యటనుండి లేచి యుద్ధపుదుస్తులను ధరించి రణరంగమున కేగెను.

నాటి రణమున సాటిలేని పరాక్రమమున నిరుపక్షంబులవారును దన్నభినుతింప శత్రుసైన్యమునగల యొక్కొక్కని కొక్కొకరూపమున గాన్పించుచు వీరవిహారంబు సలిపెను. నాటియుద్ధమున, నాతనిధాటి కోర్వలేక కాటమరాజు సైన్యము వెనుకాడుచుండెను. ఆసమయమున కాటమరాజు దనసైన్యముల కుత్సాహముగల్గించి పోరాడ నాజ్ఞాపించెను. ఆయుద్ధమున రణతిక్కన నిహతుడయ్యెను.

ఆదినమున వేములవాడభీమకవి రణతిక్కన గృహమునకు జనుదెంచెను. తిక్కనభార్య భీమకవిపాదములకు నమస్కరింప నాతడు తిక్కనవృత్తాంతమేమియు నెఱుంగనివాడగుటచే నామెను దీర్ఘసుమంగలీభవ యని యాశీర్వదించెను. ఆమెయు నాతని వదను

లనుండి లేచి తిక్కనవృత్తాంతమంతయును దెల్పి తమయాశీర్వచనము వృథగాకూడ దనియెను. అంత భీమకవి యీక్రిందిపద్యము జదివి రణతిక్కనను బ్రహ్మర జీవితునిగానొనర్చెను.

క. గుణములనిధానమగు మన
రణతిక్కన తాకళేబ : రంబును శిరముం
గణకమెయి గలయ బ్రదుకును
బ్రణుతాఖిల వైరిమకుట : భాసితపదుడై.

రణతిక్కన రణభూమియందు శిరమును మొండెమును గలియుటచే జీవించి గృహమునకు జనుదెంచెను. ఈఖడ్గతిక్కనపై రచింపఁబడిన పద్యములు పెక్కులు గలవు. వానిలో గొన్నిటి నీక్రిందనొసంగుచున్నాడను. వీనియందలి గొన్నిటిని భీమకవియే రచించియుండెనని కొంద రభిప్రాయబడుచున్నారు.

చ. పదటునవాజిరాహుతులపై దుమికించుచు దిక్కడార్చినన్
బెదరి పరిభ్రమించి కడు బిమ్మిట వీరులు భీతచిత్తులై
యదె! యిదె! వాలువాల్మెఱుగులల్లవె! యల్లదె యాతడంచనన్
గొడుకక యాజిసేసె రిపుకోటుల కందర కన్నిచూపులై.

ఉ. చిక్కక మన్మసిద్ధినిభుచే మనుగొన్న ఋణంబుదీర్చె మా
తిక్కనమంత్రిసోమశిల దేవరసాక్షిగ బెన్నసాక్షిగా
నెక్కినవాణిసాక్షిగ మహిన్నుతికెక్కిన కీర్తిసాక్షిగా
స్రుక్కక మారుకొన్న రణశూరులు సాక్షిగ గొండసాక్షిగన్.

సీ. రణరంగమున మోహ : రంబుల బొడగని
ప్రాణంబువాసిన : షండగజము
విజయాధిపునిదాడి : వెనుకొని పగులంగ
దెసదప్పి పారిన : దిగ్గజంబ

చేరజాలక తిర్గి ॥ చేమడ మల్లించి
మంచాన కందని ॥ మదగజంబ
పెనుతల్లి చెఱ్వులో ॥ బిరుదులన్నియు బ్రోంపి
గ్రంగంగ ద్రొక్కిన ॥ కుంజరంబ
నేడు మొదలుగాగ ॥ నెల్లూరుపురములో
బాగడు తనయుసేయు ॥ మగలతలలు
పూరి గఱచి తిక్క! ॥ భూతమై పోకుము
యూరివారి పోకు ॥ గారుసేసి.

ఈపద్యమునకు పాఠాంతరము—

సీ. విజయాధిపుని దాడి ॥ వెనువెంట దగిలిన
ప్రాణముల్ దాచిన ॥ పందగజమ
పెనజల్లె పల్లెలో ॥ బిరుదులన్నియువైచి
పరుగెత్తివచ్చిన ॥ పారుబోత
నరములో జాలక ॥ దొరలెల్ల హాసియించ
మంచాన కరిగిన ॥ కొంచెకాడ
చతురంగ బలముతో ॥ సమరంబు సేయక
మానంబు విడిచిన ॥ మందబుద్ధి
యనుచు నార్వేలవారు ని ॥ న్నపహసింప
ధరణి నెల్లూరులో నెట్లు ॥ తిరుగగలవు
వైరులనుగెల్చి సత్కీర్తి ॥ వరలుమయ్య
మంత్రికులహేతి తిక్కనా ॥ మాత్యమౌళి !

సీ. ధైర్యంబు నీమీన ॥ దవిలియుండుటజేసి
చలియించి మంధరా ॥ చలము తిరిగె
గాంభీర్యమెల్ల నీ ॥ కడనయుండుట జేసి
కాకుత్స్థుచే వార్ధి ॥ కట్టుబడియె

జయలక్ష్మి నీయుర స్థలిని యుండుటజేసి
హరి పోయి బలి దాన మడిగికొనియె
ఆకారమెల్ల నీ యందయుండుటజేసి
మరుడు చిక్కుబడి మడిసి చనియె
దిక్కదండనాథ దేవేంద్రపుత్రికి నీ
పరుగుచెరిగి నగము తిరుగుచుండు
నబ్ధికట్టు విడుచు నచ్యుతుకొదమాను
మరుడు మరలగలుగు మగలరాజు.

సీ. నందినిబుత్తెంచె నిందుశేఖరుఁడు నీ
వన్న! యేతెమ్మంతా రాద్రికడకు
గరుడుని బుత్తెంచె నరహరి రావయ్య
వడిసిద్ధ తిక్క! కైవల్యమునకు
హంసను బుత్తెంచె నజుఁడు నీకడకు న
భఃకులమిత్ర! రా బ్రహ్మసభకు
ఐరావతేము నంపె నమరేంద్రుఁడిప్పుడు
దివమున కేతెంచు తిక్కయోధ!
యనుచు వేరువేర యర్థితోఁ బిలువంగ
వారు వీరుగూడ వచ్చి వచ్చి
దివ్యయోగియైన తిక్కనామాత్యుఁడు
సూర్యమండలంబు సొచ్చి చనియె.

ఉ. వెన్నెలలేనిరాత్రియు ర విప్రభ లేని దివంబు నీరు లే
కున్నసరోవరంబు గడు నొప్పగు దీపము లేని యిల్లునై
విన్నదనంబునొందె మన విక్రమసింహపురంబు చూడగా
బున్నమచంద్రుఁబోలు మన పోలమతిక్కడు లేమినక్కటా.

ఉ. ఏమితపంబుసేసి శర । మేశ్వరునేమిట పూజసేసిరో
రామునితల్లియన్ బరశు । రాముని తల్లియు భీము తల్లియన్
కాముని కన్నతల్లియును । గంజదళాక్షునకుంగుదల్లియుఁ
శ్రీమహితప్రతాపుడగు । సిద్ధయతిక్కన గన్నతల్లియుఁ.

ఉ. శ్రీలలరారశత్రువులఁ । జెండితివార్యులు మంత్రివర్యులా
ర్వేలఘనుల్ నుతించి రల । వేల్పుదొరల్ ముదమందిమెచ్చిరో
లాలితశౌర్యధైర్యజయ । లక్ష్మిప్రియంబున నిన్వరించె నీ
లీలలు హెచ్చఁ దిక్కనికళేబరమా యిక నిల్చియాడుమా ?

ఇప్పటికిని నెల్లూరుసమీపమున దిక్కనపాడు అనుగ్రామము గలదు. అందు ఒక్కగుఱ్ఱముపై కెక్కిన రౌతుయొక్క విగ్రహ మొక్కటి రాతిపై చెక్కబడియున్నది. అయ్యది రణతిక్కని విగ్రహమని యట నున్నవారు జెప్పుచుందురు. ఈవిషయము చెన్నపట్టణమందలి ప్రాచ్య లిఖితపుస్తకభాండాగారమునందలి చారిత్రకసంపుటమునందు వ్రాయఁబడియుండెను.

---

## బసవపురాణము.

పిడుపర్తి సోమనాథుడు బసవపురాణమును రచించుచు నీక్రింది పద్యమును రచియించియుండెను.

సీ. విరచించె జైమిని । వేదపాదస్తవం
బాకపాదమునను వే । దోక్తిగలిపి
హరభక్తివైదికం । బని శ్రుతులిడి చెప్పె
బ్రతిభ సోమేశుడారాధ్యచరిత
సరవి శ్రీనాథుడా । చరితపద్యప్రబం
ధము జేసె ద్విపదలు । తఱచునిలిపి

యాతండు పద్యకా । వ్యము జేసె నైషధ
మంచితహర్షవా । క్యములు సాఁపి

సోమగురువాక్యములు వెట్టి । భీమసుకవి
గరిమ బసవపురాణంబు । గణనజేసె
గాన బూర్వకావ్యము వేఱ । గతిరచించు
వారి కాదికావ్యోక్తులు । వచ్చినెగడు.

పై పద్యమును దిలకించినవారిలో పెక్కురు భీమకవి బసవపురాణమును జెప్పియుండెనని భ్రమించుచున్నారు. తెనుగున బసవపురాణము భీమనవిరచితముగా గాన్పింపదు. కాని కర్ణాటకభాషయం దొకబసవపురాణము భీమనకవిపుంగవునిచే రచింపఁబడినది కలదు. దానిని గాంచి భీమకవి కన్నడమున నే బసవపురాణమునురచించియుండె ననియు, యావిషయమే పైపద్యమున సూచింపబడినదనియు కొందరు తలంచుచున్నారు. కానియది ప్రమాదజనితమని చెప్పవచ్చును. ఈవిషయవిమర్శన మొనరించునపుడు ప్రప్రథమమున, నెత్తుగీతిలోనున్న సోమగురువెవ్వరు, ఆతఁడురచించిన బసవపురాణమును జూచినపిమ్మటగదా భీమకవిరచించియుండెనని పద్యము చెప్పుచున్నది. కాన ఆసోమన యెప్పటివాఁడో యించుక పరిశీలింతము. బసవపురాణమును ప్రప్రథమమున పాల్కురికి సోమన రచియించియుండెను. సోమన 13 వ శతాబ్దమువాఁడై యుండెనని యాంధ్రకవులచరిత్రము నుడువుచున్నది. కావున భీమన 13 వ శతాబ్దమునకు పిమ్మటివాడని నిశ్చయింప వచ్చుచున్నది. కాని బసవపురాణములోని యీక్రిందిపద్యములవలన నాబసవపురాణము శా. 1291 సం॥ సరియైన క్రీస్తుశకము 1369 సం॥రమున రచింపబడియుండెనని తెలియవచ్చుచున్నది.

కోవిదరు కేళొల్పి తెనలుసు
దేవనిధినయనేంఱ సంఖ్యెగ
శోవిశవసుమంగళాగళసౌమ్యవత్సరద
శ్రావణబహుళపక్షమీాదశమీా
జీవవారదొళాదిత్యవృషభేం
ద్రావతారదబసవచరిత్రేసమాప్తియాయిత్తు.

మఱియు నాగ్రింథమునసే యీబసవపురాణమును పాల్కురికి సోమేశ్వరునివలన నొదవినకవిత్వకుశలుఁడైన భీమునచే రచింపబడినది.

ఇదుసకల మహేశ్వరానుళ
పదపయోజరాగ షడప
ట్పదియెనిపాల్కురికె సోమే
శ్వరన కారుణ్య బవవిసఖిళా
పరిపూరిత హృదయభీమామనక
విరచితాభ్యుదయ బసవపురాణ
కథయొళు అష్టమాశ్వాస—

కావున కన్నడబసవపురాణమును వ్రాసిన యాతఁడు పాల్కురికి సోమునశిష్యుఁడు భీమనయే. కాని యాతఁడే వేములవాడభీమన యని చెప్పుటకు వీలు లేదు. బసవపురాణకర్త ఆరాధ్యబ్రాహ్మణుఁడనియు, యితనితండ్రి శివకవిదేవుఁడనియు కర్ణాటకవులచరిత్రమున దెలియవచ్చుచున్నది.

ఇందువలన నీబసవపురాణమును రచించినయాతఁడు వేములవాడ భీమకవి గాడని స్పష్టమగుచున్నది.

# రాఘవపాండవీయము.

వేములవాడభీమకవి రాఘవపాండవీయమును తొల్లి రచించి యుండెనని వాడుకలోనున్నదనియు అగ్రింథముమాత్ర మెక్కడను గాన్పింపకుండుటచే దాను తిరుగ రాఘవపాండవీయమును వ్రాయుచున్నాడనని పింగళి సూరన దనరాఘవపాండవీయపీఠికయం దిట్లు వ్రాసి యున్నాఁడు. (రాఘవపాండవీయము యెట్లుసరించినదో వివరమునకు నన్నయభట్టు అనుశీర్షికక్రింద చూడుడు.)

శా. రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండం దద్గతి గావ్యమెల్లనగు నేనో హాళోదపుం జేసుదే
పాండిత్యంబున నందునుం దెనుగుకబ్బం బొక్కభీమనభం డ
ఘుం డేర్పాడిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్.

ఉ. భీమన తొల్లి చెప్పెనను పెద్దలమాటయె కాని యందు నొం
డేమియు నేమెఱన్నిలుచు టెవ్వరుగానరటుండనిట్ల నా
నామహితప్రబంధరచనాఘనవిశ్రుతి నీవు గల్గుట
న్నామది తద్వయార్థకృతినైపుణియుం గలదంచు నెంచెదన్.

---

# కవిజనాశ్రయము

ఈ కవిజనాశ్రయమును వేములవాడభీమకవి రచించియుండెనని కొందరును మల్లియ రేచన్న రచించెనని కొందరును, గోకర్ణుఁడు రచించెనని కొందఱును తలంచుచున్నారు.

మానవల్లి రామకృష్ణకవిగారు ఆంధ్రపత్రిక యుగాదిసంచిక 1910 లో కవిజనాశ్రయమును గోకర్ణుఁడు రచించియుండెనని వ్రాసియున్నారు. ఈ గోకర్ణుడు సూర్యవంశపురాజనియు, నైజాముగాష్ట్రమందలి యొకచిన్నభాగమునకు రాజుగానుండి పరిపాలించెననియు, నీతని

తండ్రి భీమనయనియు వారందరు వ్రాసియున్నారు. ఈత డీఛందమును రచించి రేచభూపతి కంకితము జేసెనట.

కవిజనాశ్రయమును మల్లియ రేచన్నయే కవిజనాశ్రయమును రచించినట్లు చెప్పబడియున్నది.

క. అనవద్య కావ్యలక్షణ
మొనరంగా గవిజనాశ్రయము మల్లియ రే
చన సుకవికవిజనాశ్రయు
మనుబంధము తెనుగుబాస నరుదుగ జెప్పెన్.

క. పరగిన విమలయశోభా
సురనిరతుఁడు భీమనాగ్రసుతుఁడఖిలశ్లాఘా
పరిణతు డమ్మ్యెయు భూసుర
వరుఁడు ప్రసాదోదిత ధృవశ్రీయుతుఁడై.

క. అసమానదానరవితన
యసమానోన్నతుఁడు యాచకాభరణుఁడు ప్రా
ణసమానమిత్రుడీ కృతి
కి సహాయముగా నుదాత్తకీర్తి ప్రీతిన్.

కాని యేతద్గ్రంథము నచ్చొత్తించుట నవతారికయందు నీక్రింది పద్యమును జయంతి రామయ్య పంతులువారు తమను తాళపత్ర ప్రతులలో లభించినట్లుగా వ్రాసియున్నారు.

క. వేములవాడను వెలసిన
భీమేశ్వరుకరుణగల్గు భీమసుకవినే
గోమటి రేచనమీఁదను
నీమహిగవు లెన్న ఛందమెలమిరచింతున్.

ఈపద్యము కవిజనాశ్రయకర్తృత్వము భీమకవికే యొసంగుచున్నది. కాని యీ పద్యమొకటి రెండుప్రతులయందు మాత్రమే కాన్పిం

చుచున్నదనియు, ఇతరప్రతులయందు లేదనియు, రామయ్యగంతుల వారు వ్రాసియున్నారు. మఱియు నీకవిజనాశ్రయము వేములవాడ భీమకవికృతమని రంగరాట్ఛందమునను, యప్పకవీయమునను బేర్కొన బడియెను. మరియు వారిచే గోకర్ణచ్ఛందము గూడ బేర్కొనబడియుం డెను. రామకృష్ణకవిగారు తలంచినట్లు గోకర్ణుడు రచించినది కవిజనాశ్రయముగాక గోకర్ణచ్ఛందమని వాడబడునదియై యుండును. కాని కవి జనాశ్రయమును గోకర్ణుడు రచించెనని దలంచుట సమంజసముకాదు.

ఉ. ద్వీపులదృంచి విశ్వజగ । తీపతియుత్తమ శక్తిజాంబవ
ద్ద్వీపమునందు గోవులకు । నిమ్ముగ జేయుటకై బ్రసన్నయై
గోపతిధేను నవ్విభున । కుం దనవైభవమిచ్చెగాక యే
భూపతులీవదాన్యగుణ । బుద్ధుల నిట్లువహించి రుర్వరన్.

క. నీకరవాలము పాలై
నాకంబునకరిగి రాజ నారాయణ యా
భూ కాంతు లెంతచనునో
నాకవిటోత్తములదూల నడతురు కడిమిన్.

ఈపద్యములు రెండును కవిజనాశ్రయప్రతుల గొన్నిటిలో గాన్పించుచుండుటచే భీమకవి కవిజనాశ్రయమును పిద్దన కావ్యాలంకారచూడామణి రచించినపిమ్మటనే రచించియుండెనని తలంచుచు న్నారు. ఈవిషయమై యిచట కొంత చర్చించుట సంగతముకా జాలదు.

ఈవిషయమై యప్పకవి దన యప్పకవీయములో నిట్లు జెప్పి యున్నాడు.

క. భీమన పదిచెప్పెననం
తామాత్యుడుచేసె వెనుక । యతులిరువదినా

లామీద గొండఱుకవి
గ్రామణులిరువదియు నేఁడు 7 గావించిరొగిన్.

భీమన మొదట 10 యతిభేదముల నెఱింగించెననియు, తమపరి యనంతామాత్యుండు 20 యతిభేదములదెలిపెననియు, అంతటినుండి యతిభేదములు సంఖ్య యప్పకవి నాటికి 27 అయియున్నదని జెప్పినాఁడు. ఈపద్యమువలన కవిజనాశ్రయమే మొదటరచింపబడి యుండెనని తలంపవలసియున్నది. కవిజనాశ్రయమందు స్వరయతులు, వర్గఅఖండయతులు, ప్రాదియతులు, బిందుయతులు, ప్లుతయతులు, సంయుక్తాక్షరయతి ఎక్కటివడి, పోలికవడి, సరసవడి యనుపదియతులనుజెప్పియున్నాఁడు. పెద్దనకావ్యాలంకారచూడామణియందు పైయతులలో నన్నిటిని జెప్పియుండెను. కాని అఖండయతిని మాత్రము చెప్పలేదు. పైగా నాతఁడు ఆదేశవళి దేశీయవళియు జెప్పియుండెను. ఈక్రమమునను సరించి చూచినను భీమకవి కవిజనాశ్రయమే తొలుతరచింపబడినదని తలంపవలసియున్నది.

పైన యొసంగబడినపద్యములు రెండును కావ్యాలంకారచూడామణిలోనివే అయియున్నను. అందాపద్యములు ఆదేశవళికి లక్షణముగాను లక్ష్యములుగాను యొసంగబడియున్నవి. భీమన ఆదేశవళి జెప్పియుండలేదు. అయినను కొన్నికవిజనాశ్రయప్రతులలో నాపద్యములు గాన్పించుచున్నవి. అయ్యవి వ్రాయసకాండ్రచే నంమజేర్పబడినవే కాని వేరుకాదని చెప్పవచ్చును.

కవిజనాశ్రయములోనను కావ్యాలంకారచూడామణియందునను కొన్ని వృత్తలక్షణములును వృత్తములును నొక్కటైయున్నవి.

శ్రీవృత్తము. శ్రీశ్రీజేయర్ 7 కవిజనాశ్రయము
శ్రీశ్రీజేయర్ 7 కావ్యాలంకారచూడామణి.

నారీవృత్తము. నారీవృవత్తారంభం
బారున్నాకారంబై } కవిజనాశ్రయము.

కన్యావృత్తము. పొత్తైమాగా
వృత్తింగన్యా
వృత్తంబయ్యెన్
జిత్తంబాగన్ } కావ్యాలంకారచూడామణి

పొత్తైగాగా
వత్తింగన్యా
వృత్తంబయ్యెం
జిత్తంబారన్ } కవిజనాశ్రయము.

ఇట్టివి కొన్ని గాన్పించుటంజేసి కొందఱు కవిజనాశ్రయమె చూడామణి యనంతము రచింపబడియుండె ననితలంచుచున్నారు. పైసాదృశ్యము లుండుటచే నిరువురు గ్రంథకర్తలలో నెవ్వరో యొకరు ముందు రచించిన గ్రంథమును గాంచిపిమ్మటనే రెండవగ్రంథమును రచించియుండిరని తలంపవలసియున్నది. ఇంకు కవిజనాశ్రయము ముందు రచింపబడినదా? లేదా? యను సందేహము గలుగుచున్నది. బ్రహ్మశ్రీ వఝ్ఝల చిన సీతారామశాస్త్రిగారు కావ్యాలంకారచూడామణియే ముందురచింపబడినదని నిరూపించియున్నారు. వారు నిరూపించిన కారణముల వరుసగా నిందు బొందుపరచుచున్నాను.

1 మధ్యాక్కరలయతివిషయము. భారతమున (నన్నయవిరచితమగు భాగమున) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనములందు మధ్యాక్కరలందు 5 వగణము మొదటియక్షరమే యతిగా నుండెను. కాని యరణ్యపర్వశేషమున (నెఱ్ఱాప్రెగడ విరచితమైన) 4 వ గణా

దినే యతి గాన్పించుచున్నది. పాఠకమహాశయులకు అవగాహనముగుట కై యుద్ధమల్లుని శాసనమునుండియు, భారతమునుండియు పద్యముల నిందుదాహరించుచున్నాను.

మధ్యాక్కర.

స్వస్తినృపాంకు శాత్యంతవత్సల ‡ సత్యత్రినేత్ర
విస్తరశ్రీయుద్ధమల్లు డనవద్య ‡ విఖ్యాతకీర్తి
ప్రస్తుత రాజాశ్రయుండు త్రిభువనా ‡ భరణుండు సకల
వస్తుసమేతుండు రాజసల్కిభూ ‡ వల్లభుండర్థి.

యుద్ధమల్లునిశాసనము.

మధ్యాక్కర.

అవసరజ్ఞుడయి వ్యాసుడే తెంతె ‡ నంతన త్తపసి
కవిలగడ్డంబున గవిలజడలును ‡ గవిలకన్నులును
దవిసయన్నా నల్లనై నదీర్ఘపుం ‡ దనువురు జూచి
యువిదకన్నుంగవమొగిచి తెఱవక ‡ యుండెభయమునన.

భారతము ఆ 4. వ. 254

పై రెండుపద్యములందునను యతి 5 వగణము మొదటనే నిలువబడియుండెను. ఇంక నెన్నాప్రగడ కృతమగు నారణ్యశేషమున నెట్లుండెనో గమనింతము.

మధ్యాక్కరము.

అసదృశతేజుండు బ్రాహ్మ ‡ ణానీకసహితుడై కడగి
వసుమతియందు నధర్మ ‡ వర్తులైయున్న మ్లేచ్ఛులను
మసలక నిజశక్తిజేసి ‡ మడియించి ధర్మంబునిలిపి
వసునిభుండొనరించుబేర్మి ‡ వాజిమేధము నిష్ఠయొప్ప.

అరణ్యపర్వశేషము అ. 4. వ 310

ఈపద్యమునందు యతి 4 వ గణము మొదటనేయున్నది. బ్రహ్మశ్రీ శాస్త్రిగారు యీమార్పుజరిగినపిమ్మటనే కవిజనాశ్రయము ను కావ్యాలంకారచూడామణియు రచింపబడియుండెనని వ్రాసియున్నారు. మహాకవుల లక్ష్యము లేకుండ లక్షణము వ్రాయుట పూర్వాచారము గాదుగదా.

లక్షణముచూచియే యెఱ్ఱాప్రగడ యట్లు రచించెనని జెప్పుటకాటంకముండునా? భీమకవి స్వతంత్రించి యతి నాలుగవగణాదినే యుండవలెనని సూచించెననుట తగదా? ఎఱ్ఱాప్రగడ భారతమున స్వతంత్రించి వ్రాసియుండెననిన, అదే నమ్మవలసినదా? కావున భీమనయే యీమార్పు గావించియుండనోపును. "ప్రయోగమూలంవ్యాకరణ" మనియుండుటచే ముందుప్రయోగము తరువాత లక్షణము పుట్టెనని దలంపవలసియున్నదని కొందఱభిప్రాయపడుచున్నారు. కాని ఎఱ్ఱాప్రగడ విన్నకోట పెద్దన యిరువురును యించుమించుగ సమకాలము వారని యాంధ్రకవులచరిత్రము నుడువుచున్నది. అందువలన నెఱ్ఱాప్రగడ వ్రాసినభారతము చూచియే పెద్దన యీమార్పుగావించి యుండెననుటకు గల యవకాశము తక్కువ కావున నన్నయ యెఱ్ఱాప్రగడలమధ్యకాలముననే యీమార్పుజరిగి యుండవలెనని దోచుచున్నది. భావి పరిశోధకులు నన్నయ యెఱ్ఱాప్రగడలకు మధ్యకాలముననున్న యితరకవుల గ్రంథములలో మధ్యాక్కరలున్నవో లేవో గమనించి యీవిషయ నిర్ధారణ మొనరింపవలసియున్నది.

తే. గీ. అచ్చుపరమైనపట్టున ... ... ...కవిత్రయానుమతిని.

అనుపద్యము కావ్యాలంకారచూడామణిలో నుండుటవలన నయ్యది 1350 ప్రాంతమువాడైన నెఱ్ఱాప్రగడకు పిమ్మటనే రచింపబడి యుండవలెనని శ్రీ చినసీతారామశాస్త్రిగారు వ్రాసియుండిరి.

అటుల భావించినయెడల చూడామణి 1350 ప్రాంతమున రచింప బడియుండవలెను. తరువాత భీమకవి కవిజనాశ్రయము రచించె ననగా 1360 లేక 1370 ప్రాంతమైయుండును. అటులైనచో దనకు ముప్పదియేండ్లకు ముందున్న భీమనను శ్రీనాథుఁడు నన్నయకు పూర్వమున బేర్కొనియుండునా? అది సరికాదని యీయాధారమే రుజువుచేయుచున్నది.

కవిజనాశ్రయము మొదట రచింపబడియుండెననుటకు సందియము లేదు. కవిజనాశ్రయమునందు జెప్పబడిన వృత్తములలో గొన్నిటినిగైకొని పెద్దన కావ్యాలంకారచూడామణియందు జెప్పియుండెను. నడక సరిగాలేని వృత్తములనదలివైచి సరియైన గమనిక గలిగినవానినే పెద్దన గ్రహించియున్నాఁడు. 15 ఛందమున జెప్పబడిన అలసగతివృత్తమును విడచిపెట్టి యింకొక నాలుగు వృత్తములను జెప్పియున్నాఁడు

...    ...    ...    ...

పై హేతువులవలన కవిజనాశ్రయము కావ్యాలంకారచూడామణికంటె ప్రాచీనమైయుండవచ్చును. బ్రహ్మశ్రీ వఝ్ఝల చిన సీతారామశాస్త్రిగారి యభిప్రాయానుసారముగా నన్నయభట్టు కాలమున నొక భీమకవియును కావ్యాలంకారచూడామణి రచింపబడిన పిమ్మట కవిజనాశ్రయమును రచించిన భీమకవి మరియొకభీమకవియు నైయుందురని సంశయించుట మూలకమైనది కాదు.

## సాహిణిమారన.

వేములవాడ భీమకవిపుంగవుఁడు, చోక్కభూపాలుని యాస్థానమున సకలసౌఖ్యంబుల నందుచు పెక్కుదినము లుండెను. అక్కాలమున సాహిణిమారన యను నాతఁడు చోక్కభూపాలునిపై దండెత్తి వచ్చెను. చోక్కభూపాలుని కానపుడు మున నితరరాజులలో నొక్కరైనను సహాయముచేయుటకు రారైరి. చోక్కభూపాలుఁ డొక్కఁడే శత్రుసైన్యము నెదుర్కొనవలసినవాఁ డయ్యెను.

మారనసైన్యమును చోక్కభూపాలునిసైన్యమును పెదవేగి సమీపమున యుద్ధమునకు తలపడి పోరాడుచుండెను. మారన స్వయముగా సైన్యమును నడపుచు సైనికుల నుత్సాహపరచుచు పోరు సాగించుచుండెను. చోక్కభూపాలుఁడును వెనుదీయక సైనికుల నత్యుత్సాహమున హెచ్చరించుచు పోరాడుచుండెను. ఒక దినమున సాహిణిమారనకును, మరియొకదినమున చోక్కభూపాలునకును జయము లభించుచుండెను. ఇరుపక్షముల వారికిని జయము తమకే లభించుననుటయం దనుమానము జనించెను. ఇట్లు నాలుగైదు దినములు గతించెను.

ఆఱవనాటియుద్ధమున సాహిణిమారుఁడు తనసైన్యముల పురికొల్పి యీదినమున జయలక్ష్మిని గొనుటయో, మోక్షలక్ష్మిని గనుటయో, నిర్ధారణమగునంతవరకు యుద్ధభూమినుండి వెనుదిరుగరాదని స్థిరచిత్తమున నుండెను. నాటియుద్ధమున మారనసైన్యములన్నియు నుద్రేకించి, చోక్కభూపాలుని సైన్యముపై బడి చెల్లాచెదరు గావించెను. వికావికలై సైన్యము పగతురచే త్వరలో నిహతమయ్యెను. కాని చోక్కభూపాలుఁడు మాత్రము హతశేషులగు సైనికులతో పోరాటము సాగించుచుండెను. మారనయు చోక్కభూపాలుని నాడా

హావరంగమున నంతమొందింపవలయునను పూనికతో యుద్ధమొన రించుచుండెను. అంత దివాకరుండును భూపాలుర పోరాటము చూడ జాలకనో యనునట్లు పశ్చిమసముద్రమున మున్గి యస్తంగతుడయ్యె ను. అంత గిరుసైన్యములు, నాటికి యుద్ధమును చాలించి విశ్రాంతి గైకొనసాగిరి.

ఆ దినమున చొక్కభూపాలుండును భీమకవిసన్నిధి కరుదెంచి వినయపూర్వకముగా నమస్కరించి నాడు సమరంబునగల విశేషంబు లెఱింగించి వెండియు నిట్లనియెను. కవిసార్వభౌమా! నేటి సం గ్రామముతీరుగాంచినంత నాహృదయము వికావికలై నది. దుస్సహ మైన యీరణమున నాజీవముల నెట్లుకాపాడుకొనగలిగితినో వక్కా ణింపజాలను. మున్నెన్నియుద్ధములనో చేసియుంటిని గాని యిట్టి ఘోరంబగు పోరు దిలకించియుండలేను. నేను నాసైన్యములన్నియు చెదరగొట్టబడినవి. హతశేషులు యుద్ధమునుండి విముఖులైరి. మరి కొందఱు పలాయనమొనరించిరి. ఈవిధముగా నిక నొక్కదినము గడ చినయెడల నిక్కముగా నేనామారనకు లోబడవచ్చును గాని యాతని జయించుట దుస్సాధ్యమని దోచుచున్నది. నేను తమ యా శీర్వచనమును గొని యుద్ధభూమి కేగవలయునను కుతూహలంబున జనుదెంచి యుంటిని. మీయనుగ్రహమువలనగాని నాభుజబలముచే మారన నింక నెదుర్కొనజాలను. అని పల్కి మిన్నకుండెను. అంత భీమకవి యాతని వెరపుడిపి యిట్లనెను. ఓయీ! రేపు నిన్ను జయ లక్ష్మి వరింపగలదు. సందేహమువలదు. అని యాశీర్వదించి సాహిణి మారనను శపించుచు చొక్కభూపాలు నిట్లాశీర్వదించెను.

ఉ. చక్కదనంబు దీవియగు సాహిణి మారుడు మారుకై వడిన్
బొక్కిపడంగలండు చలమున్ బలమున్ గల యాచళుక్యపున్

చొక్కనృపాలు డుగ్రుడయి కే చూడ్కుల మంటలురాల జూచినన్
మిక్కిలి రాజశేఖరుని కే మీదికివచ్చిన రిత్తపోవునే.

ఇట్లాశీర్వదించి భీమకవి యాతని ప్రోత్సాహపరచి మరుదినంబున యుద్ధమునకు బంపెను. నాడు యుద్ధమారంభమైనకొలదికాలములోనే సాహిణిమారన చొక్కనృపాలునకు బట్టుపడెను. చొక్కనృపాలు డాతని రయంబున వధించి తనసైనికుల హెచ్చరించి యున్న స్వల్పసైన్యములతో నొక్కుమ్మడిగా మారన సైన్యముతో దలపడెను. రాజులేని సైన్యమెంతవరకు పోరాటమును సాగింపగలదు? మరికొన్ని ఘడియలలోన యుద్ధభూమియందు మారన సైనికు డొక్కడైనను గాన్పింపడయ్యెను. జయలక్ష్మి చొక్కభూపాలుని వరించినది.

యుద్ధము ముగిసెను. అనంతర మొకనాడు చొక్కభూపాలుడు భీమకవిపుంగవుని సభారంగమున ననేకవిధంబుల పూజించి మహాత్మా! తమయాశీర్వచన ప్రభావమున ప్రాప్తమైన యీరాజ్యమును మీకర్పించితిని గాన తమరే యథేచ్ఛముగ బాలింపవలయును. ఇంతకంటె తమకు నేనేమియొసంగి తృప్తిపరుపగలను? అని ప్రార్థించెను. భీమకవి సంతుష్టాంతరంగుడై ఓయీ! మేము కవిత్వము జెప్పగలముగాని కత్తిబట్టి యుద్ధము చేయజాలముగదా! అట్టిచో మాకీరాజ్యమేల. నీవే పరిపాలించుచుండుము. నీయొద్దనే నెల్లప్పుడుండునట్లనుగ్రహించితిని. అని బల్కి యాతని సమ్మతిబరచెను. భీమకవి పెక్కుదినము లాతనియొద్దనే యుండి తనవాగ్దానమును చెల్లించుకొనెను.

---

# నన్నయభట్టు.

వేదవ్యాస విరచితమైన శ్రీమహాభారతమును బ్రథమమున నాంధ్రీకరించుటకు ప్రారంభించిన కవిపుంగవుడే నన్నయభట్టు. ఈతఁడు రాణ్మహేంద్రవరమును బరిపాలించిన రాజరాజనరేంద్రుని యాస్థానకవియు నాతనికి కులగురువునునై యుండి యాతని యానతి పైననే భారతాంధ్రీకరణమునకు పూనుకొనియున్నట్లుగా భారతమున నిట్లు జెప్పుకొనియున్నాడు.

చ. అమలసువర్ణశృంగఖుర మై కపిలంబగు గోశతంబు ను
త్తము బహువేదవిప్రులకు దానము చేసిన తత్ఫలంబు త
థ్యముసముకూరు భారతక థాశ్రవణాభిరతి౯ మదీయచి
త్తము ననిశంబు భారతక థాశ్రవణప్రవణంబ కావున౯.

క. జననుత కృష్ణద్వైపా
యనమునివృషభాభిహితమ హాభారతబ
ద్ధనిరూపి తార్థమేర్పడ
దెనుగున రచియింపు మధిక ధీయుక్తిమెయి౯.

... ... ... ... ...

వ. అయినను దేవా! నీ యనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెద.

ఈతండు భారతమును రచించునెడ భీమకవి రాఘవపాండవీయమును రచించి రాజరాజనరేంద్రుని దర్శించి యాతనికి దనగ్రంథమును వినిపించి యద్దాని నాతనికి గృతినొసంగుటకై సంకల్పించుకొని రాజమహేంద్రవరపురమున కరుదెంచియుండెను. మహారాజగు రాజనరేంద్రుని దర్శన మపేక్షించి వచ్చిన భీమకవి నన్నయభట్టును

సమీపించి రాజదర్శనము చేయించవలసినదని ప్రార్థించి దానురచించిన రాఘవపాండవీయమును యాతనికి జూపించెను.

రాఘవ పాండవీయము మంచిరసపుష్టిగలిగిన ద్వ్యర్థికావ్యమై యుండుట దిలకించి నన్నయభట్టారకుఁడు భూపాలుఁడాగ్రంథమును జూచినయెడల దన్నుగూడ నట్టికావ్యములనే రచింపవలసినదని యాజ్ఞాపించుననియు, నందువలన తానెక్కుడుగా శ్రమనందవలసివచ్చు ననియు భావించి భీమకవికి రాజనరేంద్రుని దర్శనము చేయింపక కాలయాపన మొనరించుచుండెను. కొన్నిదినములు గతించెను. కాని నన్నయ రాజసందర్శనము చేయించునను నమ్మకముదప్పి భీమకవి యొకనాఁడు నన్నయభట్టుతో నిట్లనియెను ఓయీ! నే నరుదెంచి పెక్కుదినములైనది. ఇప్పటికైన రాజదర్శనము చేయించక కాలయాపనము గావించితివి. ఇంకనైనను నీవు రాజదర్శనము చేయింతువను నమ్మకము నాకు గలుగ లేదు. పోనిమ్ము. నేను వెడలిపోయి యింకొకప్రభువు నాశ్రయించెదను. అనికోపముగ బల్కిన విని నన్నయ ఓయీ! ఆత్రతపడిన కార్యములగునా? బుద్ధిమంతుడైనవాఁడు కార్యసాధనమునకై యెంతమాత్రమును తొందరపడఁగూడదు. భూపాలుఁడుల్లాసముగానున్న సమయమున ప్రస్తావనసమయమున నీవిషయమై జెప్పవలయునని నిరీక్షించితిని. గతదినంబున నాతనితో గొంతవరకు మాటలాడితిని. గ్రంథమును ముందుగా దనకు జూపవలసినదని కోరియుండెను. నీకీ సంగతి దెల్పి పుస్తకమును గొనిపోవలయునని దలంచితిని. అంతలోననే తత్తరమంది కోపింపదగునా? అని సామవాక్యముల నాతని కోపమును చల్లార్చి మంచిమాటల జెప్పుచు యాతనివద్దనున్న రాఘవపాండవీయమును దనవశము జేసికొనియెను.

నన్నయభట్టు గ్రంథమునంతను బూర్ణముగాఁజదివి, యాగ్రంథము రాజు దిలకించిన తనకుఁగలుగఁబోవు ఖ్యాతియంతయు భీమనకుఁబోవునను సందియమునకులోనై యాగ్రంథమును నశింపజేసెను. (కొందఱు గ్రంథమునింటియందుంచి గృహమునకగ్గిపెట్టి గ్రంథము కాలిపోయినదని భీమకవితోఁజెప్పి యుండెనని కొన్నికథలవలన దెలియవచ్చుచున్నది.) తదుపరి గొన్నిదినంబులకు భీమన జనుదెంచి ఓయీ! ఎన్నటికేని నీవు రాజదర్శనము చేయించునట్టు లేదు. ఇంక నా కీరాజుతో నిమిత్తము లేదు. నాగ్రంథమును నాకిచ్చివేయుము. నాయిచ్చవచ్చిన కడకేగి యేరాజునో యాశ్రయించెద నని బల్కెను. నన్నయయాగ్రంథము రాజరాజనరేంద్రుఁడు దిలకించుచుండెనని జెప్పెను. కాని భీమకవి కాతనిపలుకుల నమ్మకము జనింపక యాతనిచేతనున్న ఆంధ్రశబ్దచింతామణిని లాగుకొని నీవు నా రాఘవపాండవీయమును నాశనము చేసితివి గాన నేనీ గ్రంథమును నాశనము జేసెదనని బలుకుచు దానినిగొనిపోయి ముక్క ముక్కలుచేసి గోదావరి లోగలిపెను. తదుపరి భీమన మహాకోపమున నన్నయచెంతకరుదెంచి ఓయీ! అన్యాయముగా నెంతయో శ్రమపడి వ్రాసిన నా రాఘవపాండవీయమును నిష్కారణము నశింపచేసితివి. కావున నాశాపమును కొలదిదినములలోననే నీ వనుభవింపగలవు. నీవు రచింపబూనిన మహాభారతమును మూఁడుపర్వములేని ముగియకపూర్వమే మరణించెదవు. అని శపించి వెడలిపోయెను.

# కోమట్లు.

వేములవాడ భీమకవి యొకగ్రామమునకుబోయెను. ఆయూర సత్రములులేవు. ఆతని నెఱిఁగియుండి భోజనమునకును రావలసినదని పిలిచినన వా రెవ్వరును లేకపోయిరి. తుదకాతఁ డొకరియింటికేగి వారిని ప్రార్థించి వారిఁటవంటజేసికొనుటకు యను మతినిబడసి సమీపమున నున్న యొకచిల్లరసుకాణమునకుబోయి సామగ్రులవెలయిచ్చి కొనుచుండెను. ఆకోమటియు పొరుగూరునుండివచ్చినవాడని తెలిసికొని రెట్టింపువెలకట్టి బియ్యము మొదలైనవి యిచ్చుచుండెను. భీమనయు గొంతవరకు నిదానించి ఓయీ! ఇదేమికర్మము. ఒకరికిచ్చినదానికంటె నెక్కుడు వెలదీసికొనుచున్నావు. ఇదేమిన్యాయమని ప్రశ్నించెను. అంతనాకోమటియు అయ్యా! సరుకులధరలు సమానమేయైనను యవసరమునుబట్టి యధిక మగుచుండును. మీకిష్టమైన నా జెప్పినధరయిచ్చికొనుడు. లేకున్న మాని వేయుఁడు. ఇందు యిరుపురకును నష్టములేదుగదా! అనిబల్కిన యాతనిపల్కులను విని భీమకవికోపించి కోమట్ల నీవిధముగా దిట్టెను.

చ. గొనకొని మర్త్యలోకమున ♣ గోమటిపుట్టగబట్టెదోన బొం
కులుగపటంబు లాలనయు ♣ గుచ్ఛితబుద్ధియు రిత్తభక్తియుఁ
ననువరివాటలుం బరధనంబున గ్రక్కున మెక్కజూ మటల్
కొనుటలు నమ్మటల్ మిగులఁగొంటుదనంబును మూర్ఖవాదమున్.

ఉ. కోమటికొక్కటిచ్చి పది ♣ గొన్నను దోసము లేదు యింటికిఁ
సేమమెరింగిచిచ్చిడినఁ ♣ జెందద పాపము; వానినెప్పుడే
నేమరుపాటునన్మరియు ♣ నేమియొనర్చిన లేదుదోసమా
భీమునిలింగమాన! కవి ♣ భీమునిపల్కులు నమ్మియుండుడీ!

ఉ. వేములవాడ భీమ ! తగ । వే ? కవిశేఖరసార్వభౌమ ! నీ
వేముని యానతిచ్చితివి । యిమ్ములఁ గోమటి పక్షపాతివై
కోమటికొక్కటిచ్చి పది । గొన్నను దోసము లేదటంటి వా
కోమటికొక్కటీకపది । గొన్నను ధర్మము ధర్మపద్ధతిన్.

ఉ. రాముని యమోఘబాణమును । రాజశిఖామణి కంటిమంటయున్
భీమగదావిజృంభణము । పేర్మిని వజ్రము చక్రిచక్రమున్
దామరమౌళిత్రిశూలము ను । దారకవిద్విషఘోరశక్తియున్
వేములవాడ భీమకవి । వీరుని తిట్టును రిత్తవోవునే.

---

## భీమకవివిరచిత చాటువులు.

క. భువిఁబుట్టి పీచమడచెను
దివిజారాతులదినేశ । దీప్తుండర రా
ఘప్రభుఁడనుచు మునులుపొగడఁ
దివిని దివాకరుఁడుమిగుల । దీపించెఁ బొగిన్.

ఉ. కలగకుఁడీ నభశ్చరులు । కంపముఁజెందకుఁడెప్పుడిక్కరుల్
తలఁగకుఁడచ్చరల్ మునులు । తత్తరమందకుఁ డేఁగువచ్చి మీ
యలజడులెల్ల బాపి మిము । నందరఁ గాచెద నంత వట్టుమీఁ
గలిబిలిమానియుండుఁడని । కైటభమర్దనుఁ డోలిఁబల్కెనన్.

ఈరెండుపద్యములును భీమకవివిరచిత శతకంధరరామాయణములోనివని యొకలక్షణగ్రంథమున నొసంగబడియెను. కాని గ్రంథమెక్కడను గాన్పించుట లేదు.

ఉ. వారకవారకామినుల । వర్తులచారుకుచోపగూహముల్
కోరకకోరకోల్లసిత । కుంజములన్ జిగురాకుపానుపుల్

చేరక బాయి కేరల । లింగకళింగనరేంద్రమందిర
ద్వారవిహారులై సిరుల । నందక నందకపాణిగొల్వరే.

క. ఈక్షితికివచ్చి వేగమ
ద్రాక్షారామమున వార । తరుణులనృత్యం
బీక్షించి యంతకంటెను
దక్షిణమున నేర్చి రంభ । తగవేర్పడగన్. 4

ఉ. నవ్యవిలాసరమ్యనలి । నంబని బాలముఖాబ్జసౌరభా
భివ్యసనంబునం బరగు । భృంగకులోత్తము తద్వియోగతా
పవ్యథఁ బ్రాణిసల్వను కృ । పాగుణమేర్పడ బ్రాహ్మణోనహం
తవ్యయనంగ నొప్పువచన । స్థితిసుందరెఱుంగ జేయుమా. 5

చాటుధార.

. బిసరుహగర్భువ్రాతియును । విష్ణునిచక్రియు వజ్రివజ్రముఙ్
దెసలనురాపుబాణము యుగధ్విషికోపము మహానిశాపముఙ్
మసకపుపాముకాటును గుమారునిశక్తియు గాలుదండమున్
బసుపతికంటిమంటలును । బండితవాక్యము రిత్తబోవునే. 6

. సురుచిరపానపాత్రమున । సుందరియొక్కతె కేలనిందుచం
దురుడు ప్రకంపితాంగములతో । దిలకించె దదాననాంబుజ
స్ఫురితవికాసవైభవముసొంపులడంకువ వృద్ధిలింప జె
చ్చెరజనుదెంచి కట్టువడి । చేడ్పడి భీతివడంకుచాడ్పునన్. 7

నృసింహపురాణము.

క. మానవనాథుడు గంగా
స్నానానంతరము సకల । దానములు మహా

దీనులగు విప్రకోటికి
సేనాదయతోడనిచ్చి శివుసేవించెన్.

ఈపద్యములో భీమననృసింహపురాణములోనిదని రంగరాట్ఛందమున నొసంగబడియున్నది.

క. ఎంతయును దుస్తరంబు న
రంతరసంసార వారి రాశియుశివెనన్
గంతుగొను మానవుండొక
యింత శివస్మరణచేసి యేచినభక్తిన్.

క. భువిలో మిత్రుండగు వా
డవిరతమును వేరులేక యాత్మీయమనో
త్సవముఖకృత్యంబుల న
ధ్యవసాయంబెఱుక వరుస దగు సంప్రీతిన్.

ఈరెండుపద్యములును భీమన హరవిలాసములోనివని రంగరాట్ఛందమున నొసంగబడియెను. ఏభీమునిదియో వివరము తెలుపబడియుండలేదు.

చ. హరుడధికుండు వింటికి పురాంతకుకంబె గిరీటిమేటిశం
కరపురుహూతనందనుల కంబెను రాముడు నేర్పు విందుశే
ఖరకపికేతుభార్గవుల కంటె గుమారుడు మీఱు నంబికా
వరనరజామదగ్న్యఖిల వాహుల కెక్కుడు రాముపుండిలన్.

ఉ. వాండిమికల్లసిద్ధి జన వల్లభుడోర్చున రాజభీముడై
యాంధ్రముగానకుండ వృష భాంకము పెట్టికొనంగజూచితో
నెండిదె యేమినీవనుచు నెచ్చెలులెల్ల హసింప నంతలో
మూడవకంటితోడ దొర మూర్తివహించిన మ్రొక్కెరంగనల్.

భీమకవిరచించిన నరసింహపురాణములోనిదని యీపద్యము కుమారసంభవపీఠికయందు వ్రాయబడియున్నది.

సీ. యోజనద్వయము విశాలోన్నతి జెలువొంది
పట్టణంబమరుచో భావిభూతి
హాటకరత్నక వాటానుమోదమై
నూటిమించును గంచు కోటమహిమ
నూటొక్క గుళ్ళు చె న్నుగ శివానందమై
నిత్యోత్సవక్రీడ నెఱ్ఱుదనరు
వంశధారానది వారాశిసంయుత
సాగరసంగవి సంభ్రనమర

గీ. గడిదిరాజకళింగ భూకాంతునకును
దనరె నవలక్షకాళింగ మనగనొప్పి
శృంఖళద్వీపమనగ బ్రసిద్ధిమించు
గణనకెక్కు కళింగపట్టణము ధాత్రి.

క. శాపానుగ్రహపటువును
ఆపాడెడికవులనెత్తి యంపంబనఁగా
భూపాల సభలబూజ్యుఁడ
నాపేరే భీముఁడంద్రు నరవరసభలన్.

చ. గరళపుముద్దలోహమవ గాఢమహాశనికోట్లుసమ్మెటల్
హరునయనాగ్నికొల్మి యుర గాధిపుకోఱలుపట్టకర్లు ది
క్కరటిశిరంబుదాయి లయ కాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణగుణాభిరాముఁడగు మైలమ భీముని ఖడ్గసృష్టికిన్.

కవిజనాశ్రయములోనిపద్యములు.

వేములవాడభీమకవిపుంగవుని యొక్క శైలిని దెలుపుటకై యిట నాతని విరచితమగు కవిజనాశ్రయములోని పద్యముల గొన్నింటి నొసంగుచున్నాడను.

ఉ. మానుగవిశ్రమాక్షరస ♦ మన్వితమై స్వరమూదినర్ణ దదీ
యానుగుణాక్షరంబుగొని ♦ యైనను జెప్పగ నొప్పు నీక్రియన్
భానుసహస్రభాసి వృష ♦ బాధిపుడన్నటు లర్ధయుక్తమై
పూనినచో నఖండవళి ♦ పొల్పగు నాది కవిప్రణీతమై.

సంపూర్ణము.



# కో కి ల.

గ్రంథకర్త:—పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

ఇది యొక అపూర్వవిచిత్ర కల్పనాసమేత మగు చక్కని నాటకము. కోకిల ధవునకై తండ్రిని త్యజించిన త్యాగశీల. భవ్యతరప్రాసాదముల సుందరోద్యానముల సంచరించు సతీతిలకమైనను, భయద క్రూర మృగ సంకీర్ణభీకరారణ్యరంగమున నిజధీరచారిత్రాభినయమున, మోహాంధు డగు మోహనుని హృదయాగారమున ప్రేమజ్యోతిని వెలిగించి, దమయంతీ అనసూయాదుల మరపించిన పాతివ్రత్యవిరాజిత. అసూర్యంపశ్యయైనను పురుషుల భోగలాలసతాతృప్తికై నిర్మింపబడిన క్రీడాపదార్థములుగాక, సతులు పురుషులకన్న నేమిటను తక్కువకారని లోకమున చాటుటకో యన రాజ్యపరిపాలనాభారమువహించిన రమణీమణి. ఈ నాటకము శృంగారరసమునకు నిలయము. శృంగారమున కరుణ, కరుణయందే భీభత్సము; దాన రౌద్రము, దానియందే హాస్యము అంతయు నొక్కరంగమునందే ! పసితనమునందే తలిదండ్రులబాసి, కారాగారమున బద్ధుడై, వేదాంతియైన వసంతకుడు, వేదండయానకు దాసుడై కథానాయకత్వమును వహించును. తరువాత విచారణస్థానమున ప్రణయిని కోకిల విచారణీయస్థానమున నిందితులు ప్రేమస్వరూపియగు జనకుడు, దైవసముడగు ధవుడు విచారణరంగభూమి యురికంబప్రాంతము. నేరారోపణచేయునది తల్లి. దీన ప్రపంచమున స్థాపింపబడు నీతి తరుణీమణులయవ్యాజప్రేమ. ఈ యత్యద్భుత సంఘటనాశక్తియు, తన్నిర్వహణనైపుణియు, స్త్రీలను పురుషుల జేసి, పురుషున కబలవేసము నిచ్చి, యపూర్వప్రణయసంభాషణాకల్పనల మేళవించు శేముషి యీ కవిశేఖరునియందే, యీకవివిరచితమగు నీ కోకిలనాటకమునందే చూడదగును.

వెల రు 1—0—0 మాత్రమే.

---

వలయువారిట్లు వ్రాయవలెను:—

కురుకూరి సుబ్బారావు, ప్రొప్రయిటరు,

సరస్వతీబుక్‌డిపో, బెజవాడ (కృష్ణాజిల్లా.)